# చతుర సమీక్ష

ఈ శీర్షికద్వారా ప్రతినెలా 'చతుర'లో వెలువడే నవలను సమీక్షించే అవకాశాన్ని కల్పిస్తున్నాం. పాఠకులు తమకు నవల ఎందుకు నచ్చిందో లేదా ఎందుకు నచ్చలేదో వివరిస్తూ రచన బాగోగులు గురించి రాయాలి. సమీక్షలు రాసేవారు కథ మొత్తం మళ్లీ చెప్పకుండా, అవసరమైన మేరకే ప్రస్తావిస్తూ రాయాలి.

1. సమీక్ష అరఠావుకి మించకుండా కాగితానికి ఒక వైపునే రాయాలి.
2. ఏ నెల సమీక్ష ఆ నెల 20వ తేదీలోపు మాకు అందేటట్లు పంపాలి.
3. మీ సమీక్షకు తప్పనిసరిగా ఈ కింది కూపన్ జతపరచాలి.
4. కవరుపై 'చతుర సమీక్ష'కు అని పేర్కొని ఎడిటర్, 'చతుర', 'ఈనాడు' కాంపౌండ్, హైదరాబాద్-500 482 అనే చిరునామాకు పోస్టుచేయాలి.

మాకు అందిన సమీక్షలలో ఉత్తమమైనవిగా ఎంపికచేసి ప్రచురించిన వాటిలో మొదటి మూడింటికి రూ. 100/-, రూ. 75/-, రూ. 50/- చొప్పున; మరో మూడింటికి రూ. 25/- చొప్పున నగదు బహుమతులు పంపగలం. పాఠకుల పరిశీలనాశక్తిని, రచనాశక్తిని పెంచే లక్ష్యంతో ఏర్పాటు చేసిన ఈ సమీక్షా రచనలో పాల్గొని ఈ అవకాశాన్ని సద్వినియోగం చేసుకోగోరుతున్నాం.

✶ కొందరు బహుమతి విజేతలు తమ బహుమతి తాలూకు చెక్కు అందలేదనీ, అడ్రను మారిందనీ రాస్తున్నారు. బహుమతి మొత్తాలు ప్రతినెలా మొదటివారంలోనే పంపుతున్నాం. అడ్రనుల విషయంలో కూపన్‌లో రాసేటప్పుడే జాగ్రత్తపడటం మంచిది. ఈ విషయంలో ఉత్తర ప్రత్యుత్తరాలు సాధ్యంకాదు.

------------------ కూపన్ ------------------

జూలై చతుర నవల మాతృబంధం

సమీక్షకుని పేరు : ..........................................

చిరునామా : ..........................................

..........................................

..........................................

..........................................

# రచయితలకు సూచనలు







'చతుర'
ప్రచురించే ప్రతి నవలకు రు. 2,000/- పారితోషికం అందజేస్తున్న
లో ప్రతిభావంతులైన రచయితలకు నెలనెలా నవలల పోటీయే. వైవిధ్య
పూరిత ఇతివృత్తాలతో, ఆసక్తికర రచనా సంవిధానంతో పాఠకులను ఆకట్టుకో
గల నవలలకు వేదిక 'చతుర'.

చతుర ప్రపంచం వంటి
★ 'చతుర'లో నవలకు వేసే చిత్రాలు, చతుర కథలు,
శీర్షికలు కాక కేవలం నవల మాత్రమే అచ్చులో 100 పేజీలు ఉంటుంది.
"చతుర"లో అచ్చులో ఒక పేజీలో సుమారుగా 350 పదాలు వస్తున్నాయి.
నవలనుబట్టి పేజీల సంఖ్య పెంచటంగాని, తగ్గించటంగాని ఉండదుగనుక
నవలలన్నీ సరిగా ఈ సైజుకు సరిపడేలా, మొత్తంమీద 35వేల పదాలకు
తక్కువకాకుండా ఉండాలి. వ్రాత ప్రతిలో వారివారి దస్తూరీని బట్టి, ఒక పేజీకి
ఎన్నిపదాలు వస్తున్నాయనే దానినిబట్టి మొత్తం నవల ఎన్ని పేజీలు ఉండాలనేది
ప్లాన్‌వేసుకోవటం అవసరం.

★ ఈ లెక్క ప్రకారం "చతుర" కొరకై ప్రత్యేకంగా రాసిన
నవలలు మాత్రమే పరిశీలనార్హాలవుతాయి.

★ నవలను ప్రచురించే సమయంలో అవసరాన్నిబట్టి కొంత కుదించవలసివచ్చే
పక్షంలో, అందుకు అభ్యంతరంలేనివారే తమ నవలలను పంపించాలి.

★ ప్రచురణకై ఎన్నికకాని నవలలు త్రిప్పి పంపేందుకై నవలతోపాటే తగు పోస్టేజీని
జతపరచాలి. వ్రాతప్రతులు పోస్టులోగాని, ఇతరత్రాగాని పోయిన సందర్భాల్లో మా
బాధ్యత ఉండదు.

★ సాధారణంగా నవలలు మాకు అందిన 4 వారాలలోగా ప్రచురణార్హంగా భావిస్తే ఆ
విషయం తెలియపర్చటమో, లేనిపక్షంలో తిప్పి పంపటమో జరుగుతుంది.

★ పారితోషికం ఏ నెల చతురలో ప్రచురిస్తే ఆ నెల మొదటివారంలో పంపబడు
తుంది.

ఎడిటర్
**చతుర**
'ఈనాడు' కాంపౌండ్, హైదరాబాద్-500 482

# సచిత్ర విచిత్రం



▲ పళ్ళతో పీటర్ పట్టుకున్న ఇనువగొలుసుకు తాకించి సిగరెట్ ముట్టించుకుంటున్న అమ్మాయి.

కంఠనాళాలతో ఇనుపచువ్వల్ని వంచే దృశ్యం. ▶

# స్వీయహింసా ప్రదర్శన

నున్నటి గుండుతో, చూడడానికి అతిసాధారణంగా కన్పించే పీటర్ మెక్‌గోవన్, తన అద్భుత ప్రదర్శనలతో ప్రజల్ని మంత్రముగ్ధుల్ని చేస్తున్నాడు. ఎంతో క్లిష్టమైన, ప్రమాదభరితమైన అంశాల్ని సునాయాసంగా చేస్తూ జనంనుంచి అపూర్వమైన ఆదరాభిమానాల్ని చూరగొంటున్నాడతను.

కంఠనాళాలతోను, కనురెప్పలతోనూ ఇనుప చువ్వల్ని వంచడం, పదునైన గాజుపెంకులపై పరుండి - పైన ఒక మనిషిని ఎక్కి తొక్కమనడం, కొలిమిలో పెట్టి తీసిన గొలుసును నోటితో పట్టుకొని పైకి లేపడం, నుదుటి మీద చెక్కముక్కలతో బలంగా కొట్టుకొని వాటిని తునాతునకలు చేయడం... ఇలా ఒకటేమిటి? శరీరం గగుర్పొడిచే రకరకాల విన్యాసాలను ప్రదర్శిస్తున్నాడతను. అతను నోటితో పట్టుకొన్న ఇనుప గొలుసు ఎంత వేడిగా వుంటుందంటే దానికి అంటించి సిగరెట్లు కూడా కాల్చుకోవచ్చు.

తాను కేవలం మనోస్థైర్యాన్ని అలవరచుకోవడంద్వారానే ఈ ప్రమాదకరమైన ఫీట్స్‌ని ప్రదర్శించగలుగుతున్నానని చెప్పే పీటర్, కావడానికి యూరోపియన్ అయినా బౌద్ధమతాభిమాని. మనోధైర్యాన్ని ఎవరైనా అలవరచుకోవచ్చని, దీన్ని సాధనచేస్తే మరికొన్ని అతీంద్రియ శక్తులు కూడా వశమయ్యే అవకాశం ఉందని చెబుతున్నాడు పీటర్. అతనికి భార్య, ఇద్దరు పిల్లలు వున్నారు.

కనురెప్పమీద ఇనుపచువ్వను ఉంచి వంచుతున్న పీటర్.



# కరగని కలపై చతుర సమీక్షలు



'మే' చతురలో ప్రచురితమైన శ్రీమతి కొళ్ళకూరి కృష్ణ నవల 'కరగని కల'పై మాకు అందిన సమీక్షలలో ఉత్తమంగా ఉన్న ఆరింటిని ఈ సంచికలో ప్రచురిస్తున్నాం.

## జీవనమథనం

*(ప్రథమ బహుమతి రు.100/-పొందిన సమీక్ష)*

ఈ నెల చతుర నవల 'కరగని కల' మధ్యతరగతి జీవితాలను మథించి తీసిన అమృతంలాగున్నది. ఎంతోమంది ఆడవాళ్ళు ఉద్యోగాలు చేస్తున్న ఈ రోజులలో అత్తాకోడళ్ళ మధ్య సంఘర్షణ పూర్వంకంటే, మరింత ఎక్కువగా చెలరేగుతోంది. ఫలితంగా అసహాయురాలైన అత్తగారు కసి, కోపంతో కోడళ్ళని సాధించి కొంత తృప్తిపడుతోంది. ఇటు తల్లికీ, అటు భార్యకీ సర్దిచెప్పలేక కృష్ణ మాటల్లో 'నా ఖర్మేమిటో నాకు ఎవరు ఏది మాట్లాడినా, అది సరయినదనే అనిపిస్తుంది'. అలాగే పాత భావాలుగల అమ్మని మారమన్నా మారదు. ఆధునిక భావాలుగల భార్య కూడా మారదు. మధ్యన మగవాడు మనశ్శాంతికి దూరమవుతాడు. వర్ధన్ కుటుంబంలాగా ఎన్ని తగాదాలు వచ్చినా పైకి మాత్రం మేడిపండులాగా కుటుంబం కలిసికట్టుగా వున్నట్టు చూసేవాళ్ళకి భ్రమ కలిగిస్తుంటారు చాలామంది.

కృష్ణ తల్లి అన్నపూర్ణమ్మలాగా సర్దుకుపోయే చోట్ల కోడలు లలితలాగా మరీ అత్తగారినెత్తికెక్కి కూచుంటుంది. అయితే చివరలో లలితలాగా అహంకారం తగ్గించుకుని అత్తగార్ని క్షమాపణ అడిగే కోడళ్ళు అరుదుగా వుంటారేమో! పాత కొత్తల సమస్యలను తీసుకుని రచయిత్రి చక్కని ముగింపిచ్చారు.

కేవలం ఈ ముగింపువల్లే నవల గొప్పది కాలేదు. ఒక ప్రేమమూర్తి అయిన అమ్మ 'ప్రేమ ఇచ్చిన ప్రేమ వచ్చును' అన్న సూత్రాన్ని నమ్మి అనాధబాలుణ్ని సొంతబిడ్డలాగా సాకిన అమ్మ, మామూలుగా అయితే, 'ఒరే వెధవా దిక్కుమొక్కులేని వాడిని నిన్ను తెచ్చి ఎంత కష్టపడి పెంచానురా! ఇవాళ పెళ్ళాం, రాగానే పెంచినమ్మ చేదైపోయిందా?' అన్న మాటలు సాధారణంగా వింటుంటాము. కానీ ఇక్కడ ప్రేమించటమే తప్ప ఫలితం ఆశించని అమ్మ 'మనకు ఆకలి వేస్తేగాని పక్కవాడి ఆకలి మనకు అర్థంకాదు. అలాగే వయసులో వున్నప్పుడూ తాము శృంగారం కోసం ఎంత ఆరాటపడేవారో చాలామంది వృద్ధాప్యంలో అడుగిడగానే మర్చిపోతారు. తమ పిల్లలను ఆ విషయమై విమర్శిస్తారు. కొడుకు స్థానంలో తాముంటే ఎట్లా ప్రవర్తించేవాళ్ళో ఊహించుకోరు. అమ్మ ప్రత్యేకత అదే. నా స్థానంలోను, లలిత స్థానంలోనూ, మా అత్తామామల స్థానంలోను కూడా తనను ఊహించుకుంటుంది. అందుకే అమ్మకు సాధారణంగా ఎవరి ప్రవర్తనలోనూ తప్పుతోచదు' అలాంటి అమ్మ ఎవరివల్లనయినా మనసు కష్టపడితే ఎవరినీ ఏమీ అనక, తననుతానే హింసించుకునే అమ్మ ప్రేమగా ఆప్యాయతగా తప్ప

కవర్ పేజీ ఫొటోగ్రాఫర్: వి.సత్యమూర్తి

కఠినంగా మాట్లాడటం కూడా చేతకాని అనురాగమూర్తి. అంతటి ఉదాత్తమూర్తి పెంచిన కొడుకుగా అనాథ బాలుడినన్న సంగతి లలితకి చెప్పి, ఆవిధంగా లలితకి అత్తగారిమీద కృతజ్ఞత కలిగించవచ్చని వర్ధన్ చెప్పినా, కూడా కృష్ణ 'మా అమ్మని తనకు పరిచయమైన వ్యక్తిగానే లలిత ప్రేమించాలి' అంటూ చాలా సంస్కారవంతంగా ప్రవర్తిస్తాడు. అందరిళ్ళల్లో సాధారణంగా జరిగే విషయాలనే తీసుకుని, అసాధారణమైన ప్రజ్ఞతో కృష్ణగారు మంచి నవలనందించారు. అయితే చాలాచోట్ల ఇంగ్లీషు మాటలు, కొన్నిచోట్ల వాక్యాలకు వాక్యాలే గుప్పించారు. ఇది మాత్రం పానకంలో పుడకలాగా వుంది.

-టి.బి.టి. సుందరమ్మ,
గుడివాడ-521 301

## సందేశం ఏమీలేదు

*(ద్వితీయ బహుమతి రు.75/- పొందిన సమీక్ష)*

శ్రీమతి కాళ్లకూరి కృష్ణగారి నవల ఒక రచయిత్రి వ్రాసినట్లు లేకున్నా ఏదో ప్రత్యేకత పాఠకులను ముందుకు తీస్కెళుతోంది. హీరో సబ్జెక్టివ్‌గా ఆలోచిస్తూ ఆబ్జెక్టివిటీ కోసం తాపత్రయపడటంలో అసమర్థత స్పష్టంగా కనపడుతోంది. 'అమ్మ' అన్నది చాలా ఉన్నతమైందని చెప్పటం కోసం కొంత అతిగా వెళ్లినట్లు తోస్తుంది. నవల పేరు చివరకు అర్థాన్ని పోగొట్టుకుందేమో! కలలో చివర్న కొద్దిగా మార్పు వచ్చిందికదా? అదీగాక అమ్మ ఔన్నత్యం చూపించటం కోసం ఒక కల, హీరోని అనాథగా కలలో తేల్చడం అనవసరం. ఇందులో రెండు తరాల స్త్రీలున్నారు. ఒక చదువులేని సాధారణ గృహిణి, ఒక ఉద్యోగస్తురాలు. ఒక్కపిల్లని కనగానే, జాబ్ రావడం రెండూ సంబాళించుకోలేక పోవటంతో ఇలా వ్రాసింది రచయిత్రేనా అనే అనుమానం కల్గిస్తుంది. లలిత చిత్రణ అసమగ్రంగా వుంది. మిడిల్‌క్లాస్ స్త్రీలింత స్పాంటేనియస్‌గా ఇంగ్లీషు వాడటం అరుదుగా చూస్తాం. అదయినా కాస్మొపాలిటన్ సిటీస్‌లో మాత్రమే. అమ్మకు ప్రేమ, క్షమ, ఎక్కువ అని చెప్పటం తప్ప ఈ నవలలో ఇంకేం విశేషంలేదు. చాలా కథల్లో, నవలల్లో సినిమాల్లో ఇవన్నీ చూస్తున్నాం. ఈ నవలలో వున్న పాత్రలు సాధారణ మానవులు కారు. అన్నీ మంచి గుణాలతో 100 శాతం ఎఫిషియంట్‌గా వుండేవాళ్ళు అసలు వుండరు. ఉదాత్తతకోసం వ్రాయబడిన నవలని మంచి నవలగా ఒప్పుకోలేం. ఇది సమాజానికి స్ఫూర్తి నివ్వగల రచన కాదు. ఇది కఠినమైనా సత్యం మాత్రం ఔను.

-పెద్దాడ సీతాలత,
తణుకు-534 211

## ఈ అత్తగారు వేరు!

*(మూడవ బహుమతి రు.50/- పొందిన సమీక్ష)*

జీవన స్రవంతిలో ఎదురయ్యే ప్రాపంచిక సమస్యలకు తాజా ఉదాహరణ "కరగని కల!!"

'పాటకు పల్లవి, కథకి శిల్పం ప్రాణం అన్నట్లు కథనంలో శిల్పం ఏమాత్రం కరువవకుండా చక్కగా, సునిశితంగా వివరిస్తూపోవడంలో రచయిత్రి కృతార్థులయ్యారు.

దైనందిన జీవితంలో నిత్యం ఎదుర్కొనే సమస్యలేకాక ఈ నవల్లో జోడించిన మరికొన్ని సమస్యలు ఇలా జరుగుతాయా అనే ఇరకాట స్థితిలో పడేస్తాయి. ఎంతమందిలో ఇలా జరుగుతుంది? ఎన్ని కుటుంబాల్లో అత్తాకోడళ్ళ మధ్య మ్యూచువల్ అండర్‌స్టాండింగ్ వుంది?? అయితే అన్ని అత్తాకోడళ్ల సబ్జెక్ట్ ఉన్న నవలల్లా ఈ నవల్లో కిరోసిన్ చావులు, వరకట్నపు బెదిరింపులు, సూసైడ్ అఘాయిత్యాలు లేకపోవటం విశేషం.

ఎంతమంది మగాళ్లు కృష్ణలా సైకోఏనాలిసిస్‌తో బాధపడుతున్నారు అనే ప్రశ్న ఉద్భవించకపోదు. మగాడు అన్నాక, అదీ ఒక స్టేటస్‌లోకి వెళ్ళాక- కొన్ని నిర్దిష్టమయిన హక్కులూ, తనకంటూ కొన్ని భావాలూ కలిగి వుండటం సహజం! ఒకప్రక్క తల్లి మమతానురాగాలూ, మరోపక్క లలిత ఉద్యోగాభిమానం మధ్య ఊగిసలాడాడేగాని, డబల్ గ్రాడ్యుయేట్ అయివుండీ అతను వెతుక్కున్న పరిష్కారం మాత్రం శూన్యం! లా ఆఫీసర్ అయివుండీ



కృష్ణ నవల చివరివరకూ అటు తల్లి, ఇటు భార్యమీద ఆధారపడటం సబబుగా లేదు. లలిత వ్యక్తిత్వం ఏమిటో తెలిసివున్నా అతను ఆమె భావాలను గౌరవించనూలేదు, ఖండించనూలేదు. ఈ సమస్యని నవల్లో కాలమే పరిష్కరించింది!! అలాగాక కృష్ణ ఏమాత్రం చొరవచూపించినా ఇంకా బావుండేదేమో??

ఫొటోల ప్రహసనంతో కథకి మలుపునిచ్చి కృష్ణని అనాధగా చిత్రించడంవల్ల ఆ పాత్ర మీద పాఠకుల్లో అపారమైన 'సింపతీ' పెరగాలని రచయిత్రి ఉద్దేశమా?? ఒకవేళ అదే అయితే అతను ప్రేమరాహిత్యానికి ఎందుకు చేరువయ్యాడు?? మనసు పొరల్లో అతిసున్నితంగా పెనవేసుకుపోయిన 'మాతృప్రేమ' అనే పదాన్ని కొలబద్దతో కొలిచేప్రయత్నం ఎందుకు చేశాడు? అనే ప్రశ్నలు ప్రశ్నల్లాగే మిగిలిపోయాయి!!

కృష్ణ స్నేహితుడైన వర్ధన్ ఒక సైడ్ కేరక్టర్‌గానే తప్ప, నిజమైన స్నేహితుడిగా, ఒక సపోర్టర్‌గా ఉపయోగపడలేదు. నిజం చెప్పాలంటే- సైకియాట్రిస్ట్‌గా సైకో ఎనాలిసిస్‌మీద వర్ధన్ ఇచ్చిన వివరణ ఏమీలేదు. అసలు తన ఫ్యామిలీ బేక్‌గ్రౌండ్ గురించి అతను చెప్తున్నప్పుడు తన ఇంటి సమస్యని చక్కదిద్దుకోలేనివాడు ఇతరులకు ఏమని సలహాలివ్వగలడన్పిస్తుంది!!

పాత్రోచితంగా లలిత ఆదర్శభావాలున్న మహిళ. కానీ నేరోమైండెడ్ కృష్ణ ఆమె మనసుని సుతిమెత్తగా గాయపరిచాడన్పిస్తుంది. అందుకు ఉదాహరణ అర్ధరాత్రి బుద్ధుడిలా ఇల్లువిడిచి వెళ్ళిపోవడం, వారంరోజులవరకు ఇంటిధ్యాస లేకపోవడంలాంటివి!!

ఒకరి హాబీలు మరొకరికి ఇబ్బందిని కలిగించవచ్చు. నవల్లో కృష్ణ హాబీ అయిన కాఫీతోనే లలిత మనసు గాయపడటం మొదలవుతుంది. ఈ ఫిల్టర్, ఇన్‌స్టెంట్ కాఫీల గురించి వివరించడం కంటే- రచయిత్రి సైకో ఎనాలిసిస్‌మీద మరికొంత ఇన్ఫర్మేషన్ అందించివుంటే పాఠకులకి లాభదాయకంగా ఉండేది, ఈ నవలకి బేస్ అదే కాబట్టి!!

-శ్రీనివాసరాజా,
కరీంనగర్-505 002

## ఊరట

*(నాలుగవ బహుమతి రు.25/- పొందిన సమీక్ష)*

కొ‌ళ్ళకూరి కృష్ణగారి 'కరగని కల' చదువుతుంటే మొదట్లో విసుగనిపించినా తరువాత్తరువాత ఇంటరెస్టింగ్‌గా కొనసాగి లలిత బయటకు వెళ్ళినప్పుడల్లా నా కూతురు ఎన్నిగ్రాములు ఆహారం తీసుకుంది. ఎన్ని మిల్లీలీటర్ల నీళ్ళు తాగింది? ఎన్నిసార్లు టాయిలెట్‌కు వెళ్ళింది అని లెక్కలు రాసి ఉంచాలనే ఆజ్ఞలు జారీ చేసినప్పుడు ఆ పిచ్చితల్లి తూ.చా తప్పకుండా పాటించటం కొంచెం అతిశయోక్తి అనిపించింది. ఎన్ని చదువులు చదివినా, ఎంత ఉద్యోగం వున్నా ప్రేమముందు అన్నీ తక్కువే అన్నట్లు, తనకే సర్వం తెల్సుననీ భ్రమించే లలిత చివరకు తన అత్తగారి ప్రేమముందు ఓడిపోవాల్సివచ్చింది. ఈ నవల చదువుతున్నంతసేపూ సంభాషణలు చాలా సహజంగా అనిపించాయి. అలాగే కథలో వర్ణనలు చాలా బాగున్నాయి. అన్నపూర్ణమ్మగారి మంచి మనస్తత్వం గురించి చదువుతుంటే ఇంతమంచి అత్తగార్లు నేటి సమాజంలో ఉంటే ఎంత బాగుండును అనుకున్నాము. కానీ ఇది నవల అని గుర్తొచ్చి నవ్వుకున్నాం. ఆమె తన కొడుకుతో గుడిలో జరిపిన సంభాషణను గూర్చి చదువుతున్నప్పుడు, బాధపడకుండా ఉండలేకపోయాం. నవల చదువుతున్నంతసేపూ, తల్లి ఓర్పు, ప్రేమ, లలిత నడవడిక, కృష్ణుని ప్రవర్తన అంతా కలిసి తీపి, పులుపు, చేదుల ఉగాదివచ్చడిని గుర్తుచేసింది. అలాగే కృష్ణుడు, వర్ధన్‌ల సంభాషణ చదువుతున్నప్పుడు నవ్వకుండా ఉండలేకపోయాం.

''కరగనికల'' చదువుతున్నంతసేపూ అదో కథలాగాక వాస్తవంలా అనిపించి మరిపించింది. నేటి సమాజంలో భార్యకి, తల్లికి మధ్య నలిగిపోయే వ్యక్తులకు ఇది ఒక ఊరట.

-ఎం. లక్ష్మి
కూనవరాజుపర్వ-521 215




## వంట ఇంటికే అంకితమా?

*(అయిదవ బహుమతి రు.25/-పొందిన సమీక్ష)*

'అత్తాకోడళ్ళ అభిప్రాయభేదాలు' అన్న ప్రాతిపదికపై రాయబడ్డ నవల 'కరగని కల'. ఒక తల్లి ఔన్నత్యాన్ని పెంచడానికి రచయిత్రి కలం రకరకాలుగా పరుగులు తీసింది. అలా పెంచడానికి ఓ కోడల్ని అడుసులోకి తోసేశారు. కోడలైన లలిత తత్వం అంత హేయమైందేమీ కాదు. పీ.జీ. చేసినా ఇంటిపనులు, వంటపనులు చేస్తూ, కాస్తో కూస్తో అవగాహనతో కనుపించే పాత్రే అది. అత్తగారైతే మమతానురాగాల మయమైన ఉదాత్త మనస్తత్వం, ఉన్నత వ్యక్తిత్వం. అలాంటి వారిమధ్య 'సఖ్యత' కుదర్చటం ఓ నగటు మగాడికి అసాధ్యమేమీ కాదు. అయినా ఓ 'లా' గ్రాడ్యుయేట్ అయినా కథానాయకుడు కృష్ణ అనవసరపు సెంటిమెంట్లవల్ల కథ ఎటెటో సాగదీయబడింది. 'అమ్మ'ను గురించిన తాపత్రయం అవసరానికి మించి ప్రదర్శించారు. హీరోగారికి తన పాపను ఎత్తుకోవటానికిగాని, కాస్సేపు ఆడుకోవటానికిగాని లేదా కనీసం ఓ ముద్దుపెట్టుకోవటానికైనా తీరలేదు. తన అర్ధాంగే 'అమ్మ'ను బాధపెట్టిందన్న అక్కసు ఉండవచ్చుగానీ, ఆ పాప ఏం పాపం చేసిందని తండ్రి స్పర్శ కూడా తగలకపోవటం?

సగం కథ దాదాపుగా వంటింటికే అంకితమైంది. అస్తమానూ ఫిల్టర్ లేదా ఇన్‌స్టెంట్ కాఫీ లేదా ఇడ్లీలు, దోసెలూ, బ్రెడ్డూ, కోడిగుడ్డూను. సెంటిమెంట్లన్నీ 'కిచెన్'కే పరిమితమైపోయాయి.

-యం. రవీంద్రనాథ్,
నిజామాబాద్

## ఉదాత్త గాథ

*(ఆరవ బహుమతి రు. 25/- పొందిన సమీక్ష)*

సహజంగా మన సాహిత్యంలో అత్తలు ఆరళ్లు పెట్టేవాళ్లుగా, కోడళ్లు అగచాట్లు పడేవాళ్లుగా చిత్రీకరించటం ఎక్కువ. లేకపోతే కోడళ్లు డామినేట్‌చేసి అత్తమామల్ని ద్వేషించేట్లుగా చిత్రీకరించేవి కొన్ని. వీటికి భిన్నంగా- వాళ్ళ వాళ్ళ సమస్యల్నీ పరిస్థితుల్నీ విపులీకరిస్తూ, ఎవరి ప్రవర్తనకి వాడు నిర్మించుకునే వాదనని రచయిత్రి ఈ నవలలో తనకున్న నిశితపరిశీలన దృష్టితో అత్యంత వాస్తవికంగా సహజంగా, సున్నితంగా- కథకు తగ్గశైలితో నవలీకరించారు.

అమ్మ పాత్రని 'మరింత వుదాత్తంగా' మలచటంలో రచయిత్రి ప్రజ్ఞ చూపారు. లలిత ప్రవర్తనకు ఆమె చెప్పే కారణాలు కూడాసహేతుకంగా వుండి పాఠకుల్ని ముఖ్యంగా పాఠకుల్లోని భర్తల్నీ భార్యల్నీ ఆలోచింపజేసేవిగా వున్నాయి.

తల్లి ఆప్యాయతనీ, అనురాగాన్ని చూరగొంటూ, భార్య ప్రేమనీ, లాలిత్యాన్నీ పొందుతూ సమస్య ఎక్కడ మొదలైందో, ఎక్కడ ముగుస్తుందో తెలీని అయోమయంలో కృష్ణ అంతర్మథనం- రచయిత్రి అవగాహననీ, సునిశిత పరిశీలననీ చాటుతుంది. తల్లిపట్ల కృష్ణకి ఏమాత్రమూ సందేహంలేదు. అదేవిధంగా తల్లిని లలిత కూడా అర్థం చేసుకుని ఆమెని నొప్పించకుండా వుంటే బాగుండుననే అభిప్రాయం- ముఖ్యంగా ఈ విషయమై అతడు తనలో పదేపదే యోచించుకుని సమయస్ఫూర్తితో 'సీన్ క్రియేట్' చేయకుండా లలితని హెచ్చరించటం అతని సంస్కారానికి తగినదిగా వుంది.

లలిత కూడా మూర్ఖంగాకాక ఎప్పటికప్పుడు సహజత్వాలకి స్పందిస్తూ 'మౌల్డ్' అవుతూ సమస్యని పరిష్కరించుకున్నతీరు ముచ్చటగా వుంది. 'మైథిలిని కసురుకున్నట్లు తనని కూడా మొదట్లోనే కసురుకుంటే బావుండేదన్న' భావాన్ని వెలిబుచ్చి లలిత తనలోని మార్పుని అత్తగారికి తెలియజేయటంతో నవలలోని 'మూగయుద్ధం' ముగుస్తుంది.

అమ్మ పాత్రని 'మరింత ఉదాత్తంగా' మలచడానికి రచయిత్రి సృష్టించిన 'కరగని కల' మాత్రం అసహజంగా వున్నా మొత్తానికి ఉదాత్త నవల "కరగని కల".

-రవి, రవిచంద్ర,
శ్రీనగర్, గుంటూరు జిల్లా



# చమత్కార ప్రపంచ



## లెక్కలు చేసే గుర్రం

"ఆఁ... వాడికామాత్రం తెలివెక్కడేడ్చింది... ఒట్టి జంతువనుకో..." అంటూ ఎందుకూ పనికి రాని దద్దమ్మల్ని ఈసడించుకోవడం మనందరికీ అలవాటే. అంటే జంతువులకు బుర్రలేదనీ, అవి తెలివితక్కువ ప్రాణులనీ మనం ఎప్పుడో తీర్మానించేసుకున్నామన్నమాట. కానీ అది మన అపోహమాత్రమే. జంతువులలోనూ పండితులూ, మేధావులూ ఉన్నాయి.

బెర్లిన్‌లోని హాన్స్ అనే అశ్వరాజం లెక్కలు చేయడంలో దిట్ట. దానిముందు నిలబడి




'ఫైవ్' అని అరిస్తే కాలిగిట్టతో ఐదుసార్లు నేలను తడుతుందట. అలాగే 'టెన్' అంటే పదిసార్లు తడుతుందట. అంతేగాక వేరే ఎలాంటి లెక్క చెప్పినా జవాబును నిముషాల మీద తన బాణీలో నేలమీద తట్టి చెబుతూంటుందది. ఆ గుర్రానికి అంతటి శక్తి సామర్థ్యాలెలావచ్చాయో ఎంత పరిశోధించినా శాస్త్రజ్ఞులకు అంతుచిక్కడంలేదు. "ఆఁ...ఒట్టి కాకమ్మకబుర్లు" అంటూ కొట్టిపారేసిన మేధావులు సైతం ఆ గుర్రాన్నీ దాని గణిత శాస్త్ర ప్రావీణ్యాన్నీ ప్రత్యక్షంగా చూసి ముక్కున వేలేసుకున్నారు. ప్రస్తుతం అశ్వరాజాన్ని పరిశీలిస్తున్న డాక్టర్ ఆస్కార్ ఫాస్ట్ ఆ గుర్రానికి అతీత శక్తులేవో ఉండి ఉంటాయని అభిప్రాయపడుతున్నాడు. కాని చాలామంది ఇతర శాస్త్రవేత్తలు తని అభిప్రాయంతో ఏకీభవించడంలేదు.

జంతుశాస్త్రాన్ని క్షుణ్ణంగా అధ్యయనంచేసిన కొందరు శాస్త్రవేత్తలు జంతువులలో కూడా చురుకైన బుర్రలుగలవి కొన్ని ఉంటాయని చెబుతున్నారు. నీటిలో ఉండే డాల్ఫినులు, నేలమీద సంచరించే గొరిల్లాలు, కోతులు ఆ కోవకే చెందుతాయని వారు అభిప్రాయపడుతున్నారు. క్రమశిక్షణ పరంగా చెప్పాలంటే కుక్కలు, చీమలు మొదటి వరుసలో ఉంటాయని తమ అధ్యయనాలు నిరూపిస్తున్నాయని కూడా వారంటున్నారు.

మరో గమ్మత్తేమంటే పైన చెప్పుకున్న లెక్కలు చేసే గుర్రంలాంటి అద్భుత జంతువులు వాటిని పరిశీలించే సమయంలో సాధారణ జంతువుల్లాగే ప్రవర్తిస్తున్నాయని తెలుస్తోంది. అందువల్ల పరిశోధకుల పనికి తీవ్ర ఆటంకం ఏర్పడుతోంది. తద్వారా ఆ తరహా పరిశోధనలు ఎన్నేళ్లు గడిచినా ఓ కొలిక్కి చేరుకోవడంలేదు. ఏదేమైనా మనుమల్ని జంతువులతో పోల్చి వాటిని చిన్నబుచ్చడం మనకేమంత భావ్యంగా ఉండదని కొందరి అభిప్రాయం. అది నిజమనే అన్పిస్తోంది గదూ!

# ఇన్‌స్పెక్టర్ ఇంటూ గవర్నమెంట్



గుజరాత్ ప్రభుత్వానికి ఆ పోలీస్ ఇన్స్‌పెక్టర్ గారొక పెద్ద తలనొప్పిలా తయారయ్యారు. ఆయన్ని అరెస్టు చెయ్యడానికి అధికారులకి తలప్రాణం తోకకి వచ్చినంతపనైంది. కారణం ప్రజలూ, స్థానిక పోలీసులూ ఆ ఇన్స్‌పెక్టర్‌గారి కొమ్ము కాస్తుండడమే! ఓనాటి రాత్రి గుట్టుచప్పుడు కాకుండా ఆయనని అరెస్టు చెయ్యాలని పథకం వేసింది ప్రభుత్వం. ఎలా పొక్కిందో ఏమో ఆ వార్త క్షణాలమీద ఊరంతా తెలిసిపోయింది. యువకులు, స్త్రీలు రాత్రంతా ఇన్‌స్పెక్టర్‌గారి చుట్టూ దడిలా నిలబడి ఆయన్ను అరెస్టు చేయకుండా అడ్డుపడ్డారు. దాంతో ప్రభుత్వం తోకముడువక తప్పింది కాదు.

ఆ మరునాడే ఇన్స్‌పెక్టర్‌గారు తాను పనిచేసే స్టేషన్‌కి వెళ్లి- "చట్టప్రకారం మీ విధి మీరు నిర్వర్తించుకోవచ్చు. నేను ఇక్కడే వుంటాను. వచ్చి అరెస్టు చేయండి" అంటూ తన ఉన్నతాధికారులకి ఫోన్ చేశాడు. హుటాహుటిన బయలుదేరివచ్చారు అధికారులు. అంతలో ఆ విషయం తెల్సి ఊళ్లోని అబాలగోపాలమూ స్టేషన్‌ని చుట్టుముట్టారు. ఇన్స్‌పెక్టర్‌గారిని ఓ గదిలోదాచి ఆడవాళ్లంతా దానికి అడ్డుగా నిలబడ్డారు. అధికారులకి ఏంచేయాలో పాలుపోలేదు. స్థానిక పోలీసులు చోద్యం చూస్తున్నట్లు చూస్తూ కూర్చున్నారే తప్ప కలగజేసుకోలేదు. అప్పుడు కేంద్ర రిజర్వు పోలీసుదళాల్ని రప్పించి, ఘెరావ్ చేస్తున్న స్త్రీలని, అటుతర్వాత ఇన్స్‌పెక్టర్‌గార్ని అదుపులోకి తీసుకున్నారు అధికారులు.

ఆ వార్త దావానలంలా రాష్ట్రమంతటా వ్యాపించబడడంతో తీవ్రమైన అలజడి పుట్టింది. పోలీసులు తమ విధులకి హాజరుకావడం మానేశారు. ప్రభుత్వ ఆస్తుల దహనాలు, లూటీలు యధేచ్ఛగా జరిగిపోయాయి. స్థానిక పోలీసుల స్థానంలో సి.ఆర్.పి.దళాలు వచ్చేశాయి.

మేజిస్ట్రేట్ ముందు ప్రభుత్వం సరైన ఆధారాలు చూపలేకపోవడంతో ఇన్స్‌పెక్టర్‌గారు విడుదల చేయబడ్డారు. విడుదలైన మరునాడె రాష్ట్ర పోలీసు ఉద్యోగుల మీటింగ్‌లో ప్రభుత్వాన్ని దుయ్యబడుతూ ఆయన బ్రహ్మాండమైన ఉపన్యాసం ఇచ్చారు. తత్ఫలితంగా విడుదలైన 15 గంటలలోపే ఆయన్ను మళ్లీ అరెస్టు చేసింది ప్రభుత్వం. అక్కడే ఉంచితే అల్లర్లు చెలరేగుతాయనే భయంతో ఎక్కడో సుదూరంగా ఉన్న మారుమూల ఊళ్లో ఖైదు చేశారు.

అసలీ గొడవంతటికీ మూలకారణం ఏమంటే-

పంజాబ్‌లోని టెర్రరిజాన్ని అణచడానికి గుజరాత్ రాష్ట్రప్రభుత్వం తమ స్టేట్ రిజర్వు పోలీసుదళాల్ని పంపాలని నిర్ణయించింది. "అత్యంత ఆధునిక ఆయుధసంపత్తిగల టెర్రరిస్టులతో తాతలనాటి తుపాకులు తప్ప మరో ఆయుధం గతిలేని మేము ఎలా పోరాడగలం? మాకు మంచి ఆయుధాలు సమకూర్చేదాకా మేం పంజాబ్‌కెళ్లం" అంటూ లడాయి వేసుకొన్నారు మన ఇన్స్‌పెక్టర్‌గారు. ప్రజలూ, పోలీసులూ ఆయన అభిప్రాయంతో ఏకీభవించినా రాష్ట్రప్రభుత్వం మాత్రం తన నిర్ణయాన్ని మార్చుకోలేదు. అందుకే ఇంత 'రగడ' జరిగింది. ఇంతకీ ఇన్స్‌పెక్టర్ పేరు అశోక్‌భట్. గుజరాత్ పోలీసు ఇన్స్‌పెక్టర్ల అసోసియేషన్‌కి ఆయన వ్యవస్థాపక అధ్యక్షుడట!



# పెట్రోలు చెట్లు

ప్రస్తుతం భూగోళంమీద ఉన్న పెట్రోలు నిక్షేపాలు మహా అయితే ఇంకో పాతికేళ్లవరకూ మాత్రమే సరిపోతాయి. మరి ఆ తర్వాత పరిస్థితి ఏమిటి? ఈ వాహనాలు, యంత్రాలు సమస్తం మూలకూర్చోవల్సిందేనా? అందుకే శాస్త్రజ్ఞులు పెట్రోలుకి ప్రత్యామ్నాయంకోసం వెదకులాట మొదలెట్టారు. ఆ పరిశోధనలలో భాగంగా ఇటీవల చెట్లనుంచి పెట్రోలు ఉత్పత్తిచేసే ప్రయత్నాలు ప్రారంభమయ్యాయి.

పెట్రోలుకి బదులుగా 'సౌరశక్తి'ని వినియోగించవచ్చు. అయితే 'ఫొటోసింథసిస్' ద్వారానే 'సౌరశక్తి' ఉత్పత్తి చేయాల్సివుంటుంది. 'ఫొటో సింథసిస్' కావాలంటే చెట్లను, కలవను తగలేయడంద్వారానే దాన్ని సంపాదించుకోవాలి. అలా చేయడంవల్ల పర్యావరణ సమతౌల్యం దెబ్బతినిపోతుంది. ఇప్పటికే అడవుల్ని విచక్షణారహితంగా కొట్టేయడంవల్ల మనం అనేక ఇబ్బందుల్ని ఎదుర్కోవల్సివస్తోంది. అంచేత కొన్ని రకాల చెట్లనుపయోగించి పెట్రోలు ఉత్పత్తిచేయవచ్చా అనే అంశంమీద పరిశోధనలు సాగించి విజయవంతమయ్యారు శాస్త్రజ్ఞులు. నిజానికి ఈ మలుపు మనకి కొత్తదే కానీ ఆదిమవాసులు ఈ విషయాన్ని ఎప్పుడో పసిగట్టేశారట.

పెట్రోలు చెట్లలో చాలా రకాలున్నాయి. ప్రస్తుతం 'జోజోబా' అనే పెట్రోలు చెట్టును అమెరికా, ఆస్ట్రేలియా, మెక్సికో, ఇజ్రాయెల్, సౌదీఅరేబియా, జోర్డాన్, ఘనా, ఈజిప్ట్‌వంటి దేశాలలో విరివిగా పెంచుతున్నారు. ఈ చెట్టు విత్తనాలు మెత్తగా, మైనంలా ఉంటాయి. వీటి నుంచి లభించే ఆయిల్‌ను యంత్రాలలో కందెనలుగా ఉపయోగించవచ్చు. ఇంకా సబ్బులు, కొవ్వొత్తులు, షాంపూలు, కాస్మెటిక్స్ తయారీలో కూడా ఆ ఆయిల్‌ను ఉపయోగించుకోవచ్చు. ఈ 'జోజోబా' చెట్లు అమెరికాలో ఎక్కడబడితే అక్కడ విపరీతంగా పెరుగుతాయట.

'గోఫర్' అనే మరో పెట్రోలు చెట్టు వుంది. రబ్బరుజాతికి చెందిన ఈ చెట్టును పెంచడానికి నీటి అవసరం పెద్దగా ఉండదు. దీనిలో హైడ్రోకార్బన్స్ 40 శాతంపైగా ఉన్నాయట. అవి ముడిపెట్రోలుగా బ్రహ్మాండంగా పనిచేస్తాయట. దీనినుంచి కూడా ఇతర పెట్రోలియం ఉత్పత్తులను సమకూర్చుకోవచ్చునని తెలుస్తోంది. ఒక ఎకరం నేలలో పెరిగే గోఫర్ చెట్లనుంచి సంవత్సరానికి యాభై బేరల్స్ ముడి పెట్రోలు దిగుబడి అవుతుందని శాస్త్రజ్ఞుల ఊహ.

బ్రెజిల్‌లోని 'కాపియాబా' అనే మరొక రకం చెట్టునుంచి డీసిల్‌ను పోలిన ఆయిల్ లభిస్తోంది. దాన్ని యథాతథంగా తీసుకువెళ్లి డీసిల్ ఉపయోగించే యంత్రాల్లో వాడుకోవచ్చు. చెట్టు కాండానికి చిన్న రంధ్రం చేయడంద్వారా ఈ ఆయిల్‌ని పొందవచ్చునట. ఒక హెక్టారు స్థలంలో పెంచిన 'కాపియాబా' చెట్ల నుంచి ఏడాదికి యాభై బేరళ్ల డీసిల్ లభిస్తుందని అంచనా వేసుకోవచ్చు.





## శవాల వైభోగం

**1968,** జూన్ 4... చైనాలోని హూ- ఈ భూభాగంలో చైనీస్ లిబరేషన్ ఆర్మీ తవ్వకాలు సాగిస్తోంది. ఆ తరుణంలో శిలామయమైన ఆ ప్రాంతంలో ఒకానొక రంధ్రం ఒక సైనికుడి దృష్టినాకర్షించింది. ఓ దారానికి చిన్న రాయి కట్టి, ఆ కన్నంలోకి జారవిడువగా అది ఇరవై అడుగులపైగా లోతున్నట్లు తేలింది. కుతూహలంతో సైనికులంతా కల్సిదాన్ని తవ్విచూశారు. ఇంతకీ అదేమిటనుకున్నారు?... సమాధి. హువాన్ రాజవంశీకుడైన ల్యూషెంగ్,అతని భార్య తావాన్‌ల సమాధి అది. దానినిండా బంగారు వెండినగలు, వజ్ర వైఢూర్యాలు వేల సంఖ్యలో ఉన్నాయి. అవిగాక యువరాజావారి దుస్తులకు 1680, యువరాణీవారి దుస్తులకు 2250 మేలిమి వజ్రాలు తాపడంచేసి ఉన్నాయి. ఆ సమాధి నిక్షేపం విలువ మొత్తం అరవై కోట్ల రూపాయలుంటుందని ఆ రోజుల్లోనే అక్కడి ప్రభ్యుత్వం అంచనా వేసింది.

గత యాభై ఏళ్లుగా భూగర్భపరిశోధకులు ఇలాంటి సమాధులనేకం తవ్వి భూగర్భ నిధులెన్నింటినో వెలికి తీశారు. అయితే అప్పటికే చాలా సమాధుల్ని దొంగలు లూటీ చేసేయడం జరిగింది.

రష్యాలోని కహొూట జిల్లాలో ఒకానొక సైనికుడి సమాధిని తవ్వి చూడగా అరుదైన 500 బంగారు నాణాలు దొరికాయి. వాటితోపాటు 12 కోట్ల రూపాయల విలువ చేసే నగానట్రా కూడా దొరికిందక్కడ.

1977 ఆగస్టు 30న వర్జీనియాలో ఒక సమాధిని తవ్వగా బంగారంతో చేసిన రెండు శవపేటికలు బయటపడ్డాయి. అందులో ఒకటి రెండవ ఫిలిప్పుది కాగా, రెండవది అతని భార్య అయిన ఒలింపియాది. 1978 ఏప్రిల్ 7న బల్గేరియా వాయవ్య దిశలో జరిగిన తవ్వకాలలో 3,000 రకాలకు పైన రకరకాల ఆభరణాలు శవపేటికలలో లభించాయి. శవాలు ఇంచుమించు మట్టిలో కలిసిపోయినా శవపేటికలలోని నగలు మాత్రం ఇంతవరకూ వన్నె చెడలేదు. 1978 నవంబర్ 15న ఆఫ్ఘనిస్థాన్ - రష్యాలు సంయుక్తంగా సాగించిన తవ్వకాలలో ఆరు శవపేటికలు బయటపడ్డాయి. వాటిలో ఒకదాని నిండుగా మణిమాణిక్య వజ్రవైఢూర్యాలుండడం చెప్పుకోదగ్గ విశేషం.

అయితే ఇప్పటివరకూ బయటపడ్డ నిధుల సమాధులలో దక్షిణ కొరియాలోని ముర్యాంగ్ మహారాజు సమాధే అత్యంతవిలువైనది. 1921 సెప్టెంబర్ 24న జరిగిన తవ్వకంలో అది వెలుగులోకివచ్చింది. ఆ సమాధిలో గాజుతో తయారైన అద్భుత కళాఖండాలు 30,000 పైగా లభించాయి. ఇంకా అపూర్వమైన ఆభరణాలు 56,000లకు పైగా లభించాయి. అంతేగాక ఓ బంగారు సింహాసనం కూడా ఆ సమాధిలో దొరికింది. కేవలం ఆ సింహాసనం ఒక్కటే ఆ రోజుల్లోనే 48 కోట్ల రూపాయల విలువచేస్తుందని అంటున్నారంటే ఆనిధి మొత్తం విలువని అంచనావేయడం కష్టతరమే అవుతుందనడంలో ఎలాంటి సందేహమూలేదు. నేటి బతికున్న మనుమలకన్నా నాటి శవాలే కొన్ని కోట్ల రెట్లు సంపన్నమైనవని మనం నిర్మొహమాటంగా ఒప్పుకోక తప్పదు. అవునంటారా?

# ఏరిన ముత్యాలు

★ వివేకం కలవాడు ముందు ఆలోచించి తరువాత మాట్లాడతాడు. అవివేకి ముందు మాట్లాడి తరువాత ఆలోచిస్తాడు.

—డెవీలే

★ మనిషి మరణించగానే అతడు ఎంత ఆస్థిపాస్తులు సంపాదించిపెట్టాడని మనుషులు ఆరాతీస్తారు. దేవతలు అతడు ఎన్ని మంచి కార్యాలుచేశాడని లెక్కలు చూస్తారు.

—మహ్మద్

★ మనసిచ్చి మాట్లాడు. వివేకంతో ఆలోచించు.

—కార్లైల్

★ ఒకదేశపు గొప్పతనం ఆ దేశపు సాహిత్యంలోనూ, లలిత కళలలోనూ ప్రతిఫలిస్తుంది.

—సర్వేపల్లి రాధాకృష్ణన్

★ కళాకారులు కొన్ని విషయాల్లో మిగిలిన అందరిలా ప్రవర్తించరు. వీరు చూస్తూ చూస్తూ ఒకపట్టాన ఎవరినీ వివాహమాడరు.

—పెరల్‌బక్

★ కళాకారుల్లో చాలామంది స్వార్థపరులే. ఓర్వలేనితనం వారిలో ఎక్కువగా వుంటుంది. ఒకర్ని మరొకరు అణగదొక్కివేయాలనే ప్రవృత్తి,ప్రయత్నం అందుకే వారిలో ఎక్కువగా కనిపిస్తాయి.

—పెరల్‌బక్

★ మనిషి బహుముఖభావాల ప్రవాహాన్ని నిరోధించలేనప్పుడే 'కళ' రూపంలో బయటపడుతుంది.

—రస్కిన్

★ 'కళ' అనేది చాలా సామాన్యమైనది. అది అన్ని వస్తువులలోనూ, అన్ని పనులలోనూ వుంటుంది. ఏటొచ్చీ దానికి గుర్తింపు అవసరం.

—స్టాంటన్

★ కీర్తి మనిషిని ఒంటరివాణ్ని చేస్తుంది.

—వికీబామ్

★ 'కీర్తి' ఒక రెక్క నలుపు, ఒక రెక్క తెలుపుగల హంసలాంటిది.

—మిల్టన్

★ లోకంలో గబగబా పైకి పొయ్యేవారిని గూర్చి హెచ్చుగా చెప్పుకుంటారు. కానీ సులువుగా పైకి పొయ్యేవి దుమ్ము, ధూళి, గడ్డిపోచలు- ఇలాంటివే.

—అజ్ఞాత ఆంగ్లకవి

★ కీర్తి అంటే ఏమిటి? నీకే మాత్రం తెలియని వ్యక్తులు నీ గురించి తెలుసుకోవాలని కోరుకోవడం, వారి గూర్చి నువ్వు బొత్తిగా పట్టించుకోకపోవడం.

—స్టానిస్లా

★ మరణించిన వ్యక్తిపై వుంచిన పూవులాంటిది కీర్తి.

—స్టైరన్

సేకరణ: నల్లబెల్లి శ్రీమన్నారాయణ

సంపుటి: 15
సంచిక: 6

చతుర

జూలై: 1992



# మాతృ బంధం

భర్త పోయిన ఆ యువతిని అతడు ఆదర్శవాదిలా పునర్వివాహం చేసుకున్నాడు. కానీ... ఆమె తప్ప... ఆమె బిడ్డగానీ, మరణించిన భర్త జ్ఞాపకాలుగానీ ఏవీ ఆమెతో రాకూడదనే ఆంక్ష విధించాడు. మాతృత్వాన్ని తెంచుకో లేక, పునర్వివాహబంధాన్ని ఆనందంగా పంచుకోలేక అడ కత్తెరలో పోకలా నలిగిన ఆమె... తాను క్రూరంగా వంచించబడినట్లు భావించుకున్న క్షణంలో ఏం చే సింది...?

**ఆధునిక యువతి ప్రగతిపథంలోకి అతివేగంగా పరుగిడు తున్నా, అక్కడక్కడ ఇంకా గర్జిస్తూనే వున్న పురుషాధిక్య తనీ, దానికి గురౌతున్న అబలల జీవితాల్నీ అక్షరబద్ధం చేస్తూ శ్రీమతి ఇంద్రగంటి జానకీబాల రచించిన 'మాతృ బంధం' ఈ నెల చతుర సమర్పణ.**

నులివెచ్చని ఉదయపుటెండలో తలంటుకున్న జుట్టు ఆరబోసుకుంటూ పచార్లు చేస్తోంది అనుపమ. వాతావరణం ఆహ్లాదకరంగా వుంది. చలి విరిగి వేడి పుంజుకుంటోంది. ఆరోజు శుక్రవారమవడంవల్ల తలంటుకుని, డాబామీద పచార్లుచేస్తూ ఇంటిచుట్టూ అందంగా అమరిన తోటను, పూలను చూస్తోంది అనుపమ.

వెయ్యిగజాల స్థలంలో అత్యంత ఆధునికంగా, కళాత్మకంగా, చూడంగానే మన సంస్కృతి వుట్టిపడేలా వున్న ఆ ఇంట్లో మనుషులు సంబరంగా, నిరాడంబరంగా కనిపిస్తారు.

ఆ వూరుకి పది కిలోమీటర్ల దూరంలో పెద్ద సిటీ వుండటంవల్ల, పట్టణాలలోని సౌకర్యాలకి లోటూలేదు, పరిసరాల పచ్చదనానికి లోటులేదు.



పొలాలూ పుట్రలు, ఇళ్ళూవాకిళ్ళు, ఆవులూ గేదెలు ఆస్తిపాస్తులుగా గల రాఘవేంద్రరావు ఏకైక సంతానం అనుపమ. మొదట్లో మగపిల్లవాడు లేడని కాస్త బెంగపెట్టుకున్నా అనుపమ పెరిగేకొద్దీ వారాచింత వదిలేశారు.

రాఘవేంద్రరావు భార్య సావిత్రి చదువుకోకపోయినా సంస్కారం, మంచి హృదయం, దయా, దానం గల మనిషి. అందుకే ఆ చుట్టుపక్కల ఆ ఇంటి సౌభాగ్యాన్ని చూసి ఎక్కువమంది సంతోషపడతారేగానీ ఈర్ష్యపడరు.

కూతురు అనుపమ మరీ సన్నగా వుండదుగానీ, ఆమెని చూసి ఎవ్వరూ లావుగా వుందనలేరు. నిండుగా వుంటుంది. ఆకర్షణీయమైన ముఖంతో దర్జాగా వుంటుంది. పద్ధతులు ఎక్కువగా పల్లెటూరివే.

జరీఅంచు పరికిణీలు, జడగంటలు, కాళ్ళకి మువ్వలపట్టాలు, జూకాలతో చాలా సాధారణ వేషం. ఏదైనా సంబరాలొస్తే, చెంపస్వరాలు, రాళ్ళగాజులు, సూర్యుడు, చంద్రుడు, నాగరం ఇలా ఏవేవో అలంకరిస్తుంది సావిత్రి తన కూతురికి.

అనుపమ ఆ వూళ్లోని స్కూలుకెళ్ళి టెన్త్‌క్లాసువరకూ చదివి ప్యాసయింది. పైచదువుల గురించిన పెద్ద వూహలు ఏవీ అనుపమకి లేవు. రాఘవేంద్రరావు, సావిత్రి ఈమధ్య అనుపమ పెళ్ళి గురించి ఆలోచిస్తూ బెంగ పెట్టేసుకుంటున్నారు. అల్లుడు ఇల్లరికం అయితే బాగుండునని ఆశ పెట్టుకుంది, సావిత్రి.

కూనిరాగం తీస్తూ చిక్కుతీసుకుంటున్న అనుపమ దూరంగా మలుపు తిరిగి తమింటి వైపు వస్తున్న తెల్లని అంబాసిడర్ కారు చూసి, ఆనందంతో బయటకు పరుగుతీసింది. రెండే సిమెట్లు దిగుతూ అరిచింది.

"అమ్మా! అమ్మా!" అది పిలుపుకాదు ఆనందంతో పెట్టిన కేకే.

పూజ చేసుకునేందుకు అన్నీ సమకూర్చుకుంటున్న సావిత్రి అదిరిపడింది "ఏమిటీ? అనూ, ఏమిటి ఆ కేకలు" అంది.

"రాజా అన్నయ్య వస్తున్నట్లున్నాడు" అంది అనుపమ ఆనందం ఆయాసం కలిసిపోగా రొప్పుతూ.

"అలాగా" అంటూ చీరకొంగు సవరించుకుని పూజగదిలోంచి- కటకటాల సావిట్లోంచి, హాల్లోంచి ముందుగదిలోకి వచ్చిందామె. గేటువైపు చూసేసరికి సరిగ్గా అప్పుడే కారు గేటు ముందు ఆగింది.

అనుపమ పరుగే పెట్టింది.

సావిత్రి ముఖమంతా ఆనందంతో వెలిగిపోతోంది.

"ఏమండీ! రాజా, పెళ్ళాం వచ్చారు" అంది. ఈ హడావిడికి అప్పుడే బయటకొచ్చిన రాఘవేంద్రరావును చూస్తూ. ఆయన పోర్టికోలోకి వచ్చి నవ్వుతూ చెయ్యూపాడు.

"మల్లన్నా గేటు తియ్" అంటూ అరిచింది అనుపమ. మల్లన్న అరనిమిషంలో వచ్చి గేటు తీయడం, కారు పోర్టికోలోకి వచ్చి ఆగడం జరిగిపోయింది.

"హాయ్ అనూ" అంటూ దిగింది నళిని.

"అమ్మా! వదిన కూడా వచ్చిందే" అంది అనుపమ ఆనందంగా. అంటూనే నళిని చేతుల్లో బొద్దుగా ముద్దుగా ఒదిగివున్న కుక్కపిల్లని అందుకుంది.

చకచకా కారుదిగిన రాజా రాఘవేంద్రరావు వైపు చురుగ్గా అడుగులువేసి ఆయన్ని చేతులతో చుట్టాడు. ఆయన అతన్ని ఆప్యాయంగా పొదివి పట్టుకున్నాడు.

"ఎలా వున్నావు బాబయ్యా! మూడునెలల నుంచి ప్రతిక్షణం అనుకుంటూనే రాలేకపోయాను. ఒక్కక్షణం తీరలేదు. పైగా అన్నీ కొంపలు మునిగేపనులే. ఇప్పుడెలా వుంది ఆరోగ్యం!" రాజారావు గడగడ మాట్లాడేశాడు. అతని స్వభావమే అంత. ఒక వాక్యంతో ఆగడం అతనికి చేతకాదు. ఎంతో క్లుప్తంగా మాట్లాడటం అంటే అతని లెక్క ప్రకారం ఇదే.

రావుగారు చిర్నవ్వు నవ్వి అన్నారు- "బాగానే వుంది. నాకు తెలీదట్రా, నీకు టైము దొరికితే రెక్కలు కట్టుకుని వస్తావని అయినా ఫోను చేస్తూనే వున్నావుగా"

సావిత్రి వచ్చి "ముందు లోపలికి రానీండి, రామ్మా- నళినీ బాగున్నావా? కొత్త కుక్కపిల్లలా వుందే" అంది.

''అవునత్తయ్యా, ముద్దుగా వుందికదూ''

సావిత్రి నవ్వింది- ''నీ కన్నీ ముద్దుగానే వుంటాయి''

''వదినా! నేను బెంగుళూరునుంచి గులాబీలు స్పెషల్‌గా తెప్పించి వేశాను. రా, చూపిస్తా'' అంది అనుపమ.

''బతికాయా''

''బ్రహ్మాండంగా''

మగవాళ్ళిద్దరూ ముందు హాల్లోకి వచ్చి కూర్చున్నారు. నళిని. అనుపమ తోటలోకి వెళ్ళారు. సావిత్రి టిఫిను ఏర్పాట్లు చూడటానికి వంటింట్లోకి వెళ్ళింది.

ఇంతలో ఓ యువకుడు వచ్చి కొన్ని బిల్లులు, చెక్కులు ఇచ్చి, రావుగారిచేత సంతకాలు చేయించుకుంటుంటే రాజారావు అతనివైపు ఆశ్చర్యంగా చూశాడు.

''ఇప్పుడు వెళ్తున్నావా మధూ'' అన్నాడు రావు.

''మరేనండి'' నమ్రతగా వుంది అతని స్వరం.

''ఇదిగో రాజా, ఇతను మధుసూదనరావు. మనవాళ్ళే, బంధుత్వం చాలా దూరమనుకో.

ఇక్కడే వుంటున్నాడు, మంచివాడు మన పనులు చూసి పెడుతున్నాడు.

మధు రాజాకి నమస్కరించాడు.

''మా అబ్బాయి రాజా; కన్నకొడుకు కాకపోయినా, అంతకాన్నా ఎక్కువే. మా అన్నయ్య కొడుకు''

రాజా తలపంకించాడు. మధు నిశ్శబ్దంగా నిలబడివున్నాడు. ఒకసారి రావువైపు చూశాడు.

''నువ్వు వెళ్ళిరా'' అన్నాడు రావు.

అతనటు వెళ్ళగానే

''ఇంతకీ ఎవరితను?'' అన్నాడు రాజారావు ఆసక్తిగా.

''చెప్తాను...''

''టిఫిను రెడీ అయింది. రండి. రాజా వెంటనే రా- పెసరట్లు చల్లారితే బాగుండవు'' సావిత్రి కేక సూటిగా వచ్చి హాల్లో ప్రతిధ్వనించింది.

అప్పుడే నళినీ, అనుపమ నవ్వుకుంటూ హాల్లోకి అడుగుపెట్టారు.

★ ★ ★

పాత పెంకుటింటి వసారాలో నవారు మంచంలో పడుకుని వుందామె. బయట సన్నగా జల్లుపడుతోంది. చిన్నగా చలిగాలి కూడా వుంది. విశాలమైన ఆ ఆవరణలో ముందు బ్రహ్మాండమైన మేడ, వెనుక ఎప్పటిదో తాతలనాటి పెంకుటిల్లు. ఆ ఇంటి యజమాని ఆ వూర్లో లీడింగ్‌లాయర్ గుర్నాధం. పేరు మోసిన క్రిమినల్ లాయరుగా ఆయన ఆర్జనకి అంతూపంతూ, లేవని చెప్పుకుంటారు. తిమ్మిని బమ్మిని చెయ్యడం, వున్నది లేనట్లు, లేనిది వున్నట్లు పకడ్బందీగా నిరూపించటంలో ఆయన అఖండుడు.

ఆయన భార్య భాగ్యవతి. మంచి దర్జాగా కనిపిస్తుందిగానీ, ఆమెకి డబ్బుకి లంకె. ఆమెకి ఎంత డబ్బున్నా ఎంత ఆస్తివున్నా ఎన్ని నగలు, చీరలూ వున్నా ఇంకా ఏదో కావాలనే తాపత్రయపడుతుంటుంది.

ఎదుటివారికి పైసా పెట్టాలంటే ఆమె ప్రాణం విలవిల్లాడిపోతుంది.

ఆమె దగ్గర సుమారు పదిహేనేళ్ళుగా వంటమనిషిగా పనిచేస్తున్న సుభద్రమ్మ ప్రస్తుతం పెంకుటింటి వరండాలో జ్వరంతో మూలుగుతోంది. ఇంటెడు పనిచేసి, పట్టెడు మెతుకులు తను తిని, గుప్పెడు మెతుకులు కొడుక్కి పెట్టి, ఏభైరూపాయల జీతానికి గొడ్డుచాకిరి చేసే సుభద్రమ్మకి జ్వరం రావడం భాగ్యవతికి మహాబాధగా వుంది. బాధ జ్వరం వచ్చినందుకు కాదు. ఇంట్లోపని కుంటుపడినందుకు. మూడురోజులైనా జ్వరం తగ్గకపోయేసరికి ఆమెలోని సహనం నశించింది.

జ్వరంతో వున్నా అన్నం తినకపోయినా, ఆమె కొడుక్కి అన్నం పెట్టాల్సి వచ్చేసరికి భాగ్యవతికి ప్రాణసంకటంగా వుంది. నలుగురూ వచ్చిపోయే ఇల్లు కావడంతో వంటమనిషి లేకుండా గడవదు. తక్కువలో తక్కువ రోజుకి పదిరూపాయలైనా ఇస్తేగానీ ఎవ్వరూ రావడంలేదు.

భాగ్యవతి ఎటూతోచక గిజాటు పడిపోతోంది. 'ఇదే రేటు రేపు సుభద్రమ్మ జ్వరం తగ్గాక అడగదుకదా' అనే బెంగ ఆమెని మరీ పీడిస్తోంది.

అప్పుడే లోపలికొస్తున్న మధుని చూసి, చూడనట్లుగానే దండకం మొదలుపెట్టింది.

''ఇంటినంటి పెట్టుకుని వున్నారు. రెండురోజులు జ్వరం వచ్చిందికదాని పొమ్మంటే ఎక్కడికి పోతారు? వాళ్ళకేమైనా ఇల్లావాకిలా, పోనీ ఒక్కర్తే కాదుగదా. పిల్లాడొకడు? ఏమంటాం? ఏం బాగుంటుంది? గుప్పెడు మెతుకులకి చూసుకున్నారు అంటారు. నిజం చెప్పాలంటే, మరి, వంటమనిషి కుదరకపోతే, నేనైనా వండి వాడికి పెట్టాల్సిందేగా''

కొత్తగా వంట చేస్తున్నామె అందుకుంది.

''అదేమన్నమాటలెండి. పాపం, మీ ఇంటినే అంటిపెట్టుకుని వుంది. పైగా ఒళ్ళు దాచుకునే మనిషి కూడా కాదు''

''అలాగనేకదా! పిల్లాడి చదువు కూడా ఆయన నెత్తినేసుకున్నారు'' అంది భాగ్యవతి.

ఈ మాటలన్ని వింటూనే నెమ్మదిగా నడుస్తున్న మధు, చివరి మాటతో బ్రేకు పడినట్లు ఆగాడు. అతనిలో క్రోధం, కోపం పెల్లుబికాయి. తన తల్లి అష్టకష్టాలుపడి, వాళ్ళిచ్చిన జీతంలో ఖర్చులు పోనూ పైసాపైసా దాచి తనని ఈ మాత్రం చదివించింది. ఎప్పుడైనా పదిరూపాయలు ముందుగా ఇవ్వాలన్నా ఈ మహాతల్లి విలవిల్లాడిపోయేది. ఆయనగారు సరేసరి. ఇన్నాళ్ళుగా వాళ్ళింట్లో వుంటున్నా ప్లీడరు గుర్నాధంగారిని తను మూడు నాలుగుసార్లు చూశాడేమో, మాట్లాడాడేమో.

మధు తల్లి మంచం దగ్గరకెళ్ళి- ''అమ్మా'' అన్నాడు. ఆమె నెమ్మదిగా కళ్ళు తెరిచింది.

''కాస్త ఏమైనా తింటావా అమ్మా''

''ఏమీ వద్ద''ని సైగచేసింది. ఒళ్ళు చాలా వేడిగా వుంది.

ఆ వసారానానుకొని లోపలికి ఒక చిన్నగది వుంది. అందులోనే సుభద్రమ్మ సంసారానికి సంబంధించిన సామాను వుంది. అయితే అక్కడికి గాలీ వెలుతురు రావని వసారాలో మంచం వేసుకుంది సుభద్రమ్మ.

''అమ్మా! లోపల పడుకుందువుగాని పద. బయట వర్షం పడుతోంది. చలిగా కూడా వుంది'' అన్నాడు.

''మధూ. డాక్టరు దగ్గర కెళ్దాం నాయనా! ఎన్నాళ్ళిలా పడకేస్తాను. గడవద్దూ'' అంది సుభద్రమ్మ నీరసంగా.

''నేనిప్పుడే సీతారామయ్యగారితో మాట్లాడాను. తీసుకురమ్మన్నారు. రిక్షా తీసుకొస్తాను. వెళ్దాం''

''డబ్బు భాగ్యవతమ్మగార్ని అడిగి తీసుకో''

''ఏమో... నాకెలాగో వుంటుంది''

''అది మన డబ్బే. అవసరానికి కాకపోతే మరెందుకు? పర్లేదులే అడుగు'' అంది.

మధు నెమ్మదిగా వెళ్ళాడు ''అమ్మని ఆసుపత్రికి తీసుకెళ్తున్నా కొంచెం డబ్బు కావాలండీ'' అన్నాడు.

''వున్నపళంగా డబ్బులంటే ఎలావస్తాయి నాయనా... మధ్యాహ్నం ఆయన భోజనానికి వచ్చినప్పుడు అడుక్కో'' అంది విసురుగా.

మధు మనసు చివుక్కుమంది. అతనికి తెలుసు ఆమె దగ్గర బోలెడంత డబ్బు వుంటుందనీ ఒక్కోసారి చీరల వ్యాపారులు పెట్టెలు దించితే, రెండేసి, మూడేసి వేల రూపాయిల చీరలు బేరం చేస్తుందనీ కూడా. కానీ తాను దరిద్రుడు. ధనవంతులముందు ఎప్పుడూ యాచించవలసిన దుస్థితిలో వున్నవాడు. వాళ్లకి దయాదాక్షిణ్యాలు వుండాలని ఏముంది?

అసలు గొప్పవాళ్ళకీ, పేదవాళ్ళకీ ఇంత తేడా ఎందుకుండాలి? అనిపించిందతనికి.

గొప్పవాళ్ళకి దేముడు మనసనేది పెట్టడు. వాళ్ళకి గుండెలనిండా డబ్బునే కుక్కుతాడు. వాళ్ళ రక్తమాంసాలలో రూపాయలే కరిగి ప్రవహిస్తూ వుంటాయి.

కాకపోతే అమ్మ ఇన్నాళ్ళూ ఎంత చాకిరీ చేసింది? నిజంగా అందరిలా ఆమె కూడా ఇంత అని జీతం డిమాండు చేసి, హాయిగా వేరే వుండివుంటే ఎంతో స్వేచ్ఛగా వుండేది. కానీ తన తల్లి భయస్తురాలు. తన డబ్బు కూడా వాళ్ళదగ్గరే దాచమంది. ఇప్పుడు కావాలని అడిగితే ఏదో ముష్టివేస్తున్నట్లు మాట్లాడు




తోందామె. అడుక్కోవాలిట అడుక్కోవడం!! ఛీ...

అసలు ఈ ప్రపంచంలో గొప్పవాడూ, ధన వంతుడనేవాడు ఎవడూ లేకుండా నాశనం చేసెయ్యాలి. చంపి పారెయ్యాలి. వాళ్ళ డబ్బు అందరికీ పంచేసి చిందరవందర చేసె య్యాలి.

"నిలబడితే ఏం చెయ్యను నాయనా. ఇదిగో ఈ పదీ తీసుకుని ముందు హాస్పిటల్‌కి తీసుకె ళ్ళు, మధ్యాహ్నాం ఆయనొచ్చాక పుచ్చుకుని యిస్తాలే" భాగ్యవతి పదిరూపాయల కాగితం అందించింది.

ఆలోచనల నుండి వులిక్కిపడి ఆ నోటు అందుకుని రిక్షాకోసం వెళ్ళాడు.

"ఇవ్వలేదనే మాటే వస్తుందిగానీ, సంద ర్భం అర్థంచేసుకోరు. సుభద్రమ్మ మెతక మని షేగానీ, అమ్మో! వీడు మాత్రం కరోడా" పైకే అందామె.

ఈ మాటలు మధు వినలేదు. అప్పటికే అతను వేగంగా బయటకెళ్ళిపోయాడు. అత నికిప్పుడు ఒకటేధ్యాస. తల్లిని హాస్పిటల్‌కి తీసుకెళ్ళాలి. ఆమె జ్వరం తక్షణం తగ్గిపో వాలి.



డాక్టరు సీతారామయ్యగారు మధువంక నిశి తంగా చూశారు. "మీకు అయిన వాళ్ళెవరైనా వుంటే కబురు చెయ్యి" అన్నారు.

మధు బిక్కమొఖంవేశాడు. దుఃఖం ఆపుకో వడం అతని చేత కావడంలేదు.

"మాకెవ్వరూ లేరండీ... మా అమ్మకు నేను నాకు మా అమ్మ తప్ప ఎవ్వరూ లేరు" అన్నా డు ఏడుపు గొంతుతో.

"సారీ... చూడూ- నువ్వు చాలా చిన్న వాడవు, మరీ... నీకు చెప్పాల్సి వస్తోంది. నువ్వు ధైర్యంగా వుండాలి. పెద్దవాళ్ళు ఎప్పుడో ఒక ప్పుడు పోతారనుకో. కానీ మీ అమ్మగారికి ఇది ఇంతలో నయమయ్యే జబ్బుకాదు"

"అంటే ఆమె బతకదాండీ"

"కష్టం నాయనా- మహా అయితే ఓ పదిహే ను రోజులు అంతే-

మధు చేతుల్లో ముఖం దాచుకుని కుళ్ళి కుళ్ళి ఏడ్చాడు.

అరవై ఏళ్ళుపైబడి, ఎన్నోఅనుభవాలు చవిచూసిన డాక్టరు ఆ కుర్రాడి మీద జాలి పడ్డాడు.

మధు పరిస్థితి పూర్తిగా అడిగి తెలుసుకుని నిట్టూర్చాడు.

"ఆమెకి నయమయ్యే అవకాశం లేకపో యినా, ఎక్కడికైనా డైరెక్ట్ చేద్దామన్నా చాలా ఖర్చవుతుంది, చాలా ముదిరిపోయింది కే న్సర్... " డాక్టరు సాలోచనగా ఆగాడు.

"నన్నేం చెయ్యమంటారు. మేం ఉంటున్న చోట అమ్మకి ఏమీ బాగా లేదు. వాళ్ళు మను షులు కూడా చాలా భయంకరంగా వుంటారు"

"..."

"పోయేవరకు నేను జాగ్రత్తగా చూసుకోవా లికదా" మధు ఏడుస్తూనే వున్నాడు.

పంధొమ్మిది సంవత్సరాల ఆ ముక్కు పచ్చ లారని కుర్రాడి ఆవేదనకి డాక్టరు మనసు కరిగింది.

"ఓ పని చెయ్యి... ఆమెని నా నర్సింగ్ హోంలో వుంచేయి, నువ్వు నాకేం యివ్వద్దు, చూద్దాం" అన్నాడు.

మధు సీతారామయ్య పాదాలకి నమస్క రించాడు. డాక్టరు అతన్ని చటుక్కున లేపనెత్తి "మరేం ఫర్వాలేదు. డాక్టరేం దేవుడుకాడు. దేవుడు పైన వున్నాడు" అన్నాడు భుజం తట్టి.

డాక్టరు సీతారామయ్య నర్సుని పిలిచి, పురమాయించాడు.

తల్లిని రూములో పడుకోబెట్టి, గుండె దిటవు చేసుకుని, తన యిల్లు కాని యిల్లు, ప్లీడరు

గుర్నాథం యింటి వైపు నడిచాడు మధు.

మధుని చూస్తూనే భాగ్యవతి "ఏరా, ఏమన్నారు డాక్టరుగారూ!" అంది.

"ఫరవాలేదన్నారండీ" అన్నాడు.

"పోన్లే... అదే మనకి కావలసింది"

"అక్కడే వుంచమన్నారు... జాగ్రత్తగా మందులు వేళకి యిస్తార్టండీ"

"నిజమే కానీ బోలెడు డబ్బయిపోదూ"

మధు మాట్లాడలేదు.

ఆ మధ్యాహ్నం. గుర్నాథంని కలుసుకుని పరిస్థితి చెప్పాడు. తల్లి ప్రాణాపాయం అని మాత్రం చెప్పకుండా ఆయన దగ్గర డబ్బు తీసుకున్నాడు,

"మీ అమ్మ నాదగ్గర రెండు వేలువుంచింది. ఇప్పుడో వెయ్యి తీసుకో- అవసరాన్నిబట్టి మళ్ళీ తీసుకుందువుగాని" అంటూ గుర్నాథం వెయ్యి రూపాయల కట్ట అందించాడు.

సరిగ్గా అప్పుడే అక్కడికొచ్చిన భాగ్యవతి "అయ్యో! ఏదో సామాన్యజ్వరానికే వెయ్యెందుకండీ, మీకు అసలు డబ్బు విలువే తెలీదు. పైగా చిన్న పిల్లాడు అటూ యిటూ కర్చుపెట్టేస్తే?

"అలా చెయ్యనండి"

"మరీ కుర్రాడేం కాదులే మేజరు కూడా అయ్యాడు" అంటూ కండువా వేసుకుని బయటకి బయలుదేరాడు గుర్నాథం.

★ ★ ★

మత్తులోంచి ఒక్కసారి బయటపడిన సుభద్రమ్మ కొడుకుతో- "మధూ! నాయనా! నేనింక బతకనేమో అనిపిస్తోందిరా" అంది.

"అలా అనకమ్మా- నీకేం ఫర్వాలేదని డాక్టరుగారు చెప్పారు" అన్నాడు.

"ఏమో నాయినా నేనీ బాధ, ఈ మంట భరించలేకుండా వున్నాను"

మధు కళ్ళల్లో నీళ్ళూరి నెమ్మదిగా జారాయి.

"పిచ్చి నాయనా! నా బాధ చెప్పి నిన్ను కంగారు పెడుతున్నాను కదూ. మరేం భయం లేదులే" అంది. మధు మాట్లాడలేదు.

"అన్నం ఎక్కడ తింటున్నావూ? అసలు తిన్నావా"

"హొటల్లో తిన్నాను"

సుభద్రమ్మ బాధగా మూల్గింది "నాకు తెలుసు ఆ భాగ్యవతి అస్సలు మనసు లేనిది. నేను పని చెయ్యకుండా నీకు అన్నం పెడుతుందా"

"వాళ్ళు ధనవంతులమ్మా, వాళ్ళ పొగరు, వాళ్ళ స్వార్థం వాళ్ళ వ్యాపారం మామూలే. వాళ్ళు మనుషులతో కూడా వ్యాపారమే..."

"వుద్రేకపడకు... మన దురదృష్టం అనుకుంటే పోలేదూ. వాళ్ళ ననుకోవడమెందుకు?"

"నువ్వు రెక్కలు ముక్కలు చేసుకున్నావే ఇన్నాళ్ళూ, నీ మంచి చెడ్డలు చూడాల్సిన బాధ్యత వాళ్ళకి లేదా?"

"మంచి మాట చెప్పావు. పనిచేశాను డబ్బు యిచ్చారు. పని మానేస్తే ఎందుకిస్తారు?"

"నీకు తెలీదమ్మా వాళ్ళు పరమదుర్మార్గులు"

"అసలు ఒక మాట చెప్దామని మొదలుపెట్టాను" అంటూనే, మధ్యలో మూలిగింది సుభద్రమ్మ.

"అమ్మా... నెమ్మదిగా చెప్పు. ఏమిటి?"

"నేనేమైపోయినా నువ్వేం అధైర్యపడకు"

"ఇప్పుడా సంగతి ఎందుకు?"

"కాదు... చెప్పనీ నన్ను"

"సరే చెప్పు"

"నువ్వు ఈ గుర్నాథం ప్లీడరుని పట్టుకు వేలాడకు"

"ఛస్తే వుండను"

"కంగారుపడకు గుర్నాథం ఆయన గోలలో ఆయన వుంటాడు. అక్కడ పెత్తనం అంతా భాగ్యవతిదే. ఆమె డబ్బు మనిషి"

"నాకు తెలుసు"

"అందుకే నువ్వు బండివాండ్లపల్లికెళ్ళు. అక్కడ రాఘవేంద్రరావుగారని వున్నారు. ఆయన మనకి చాలా దూరపు బంధువు. చాలా మంచివాడు, పెద్దమనిషి. ఆయన భార్య కూడా మంచి మనిషి. నన్ను రెండు మూడుసార్లు రమ్మన్నా, నేనే వెళ్ళలేదు ఏదో ఇక్కడవున్నాం కదా అని" ఆగింది సుభద్రమ్మ.





''వాళ్ళు శ్రీమంతులా''

''చాలా డబ్బున్నవాళ్ళు. ఆయనకి ఒక రైస్‌మిల్లు, ఒక సామిల్లు ఉన్నాయి''

''అమ్మా! నాకు ధనవంతులంటే అసహ్యం. నేను వెళ్ళను''

''తప్పు... అలా అనకూడదు''

''తప్పయినా నాకు వాళ్ళని చూస్తే అసహ్యం, కోపం, కసి''

''చెప్పాను కదా! వాళ్ళు మంచి వాళ్ళు''

''నా కనవసరం. నేను ఏ డబ్బున్న వాడినీ ఆశ్రయించను'' అన్నాడు ఖచ్చితంగా.

''మధూ- నా తండ్రీ! నా మాట విను. డబ్బు వున్నవాడే ఎవరికైనా ఏదైనా పెట్టగలడు, పెట్టడానికి వాడిదగ్గర వుంటుంది కనుక. బీదవాడికి పెట్టాలనివున్నా వాడి దగ్గరేం లేనప్పుడు ఏం చెయ్యగలడు?''

''అది కాదమ్మా... డబ్బున్నవాళ్ళంతా దుర్మార్గులమ్మా''

సుభద్రమ్మ నీరసంగా నవ్వింది. ''దుర్మార్గులు ధనవంతులలోనూ వుంటారు. పేదవాళ్ళలోనూ వుంటారు. మంచి వాళ్ళు గొప్పవాళ్ళలోనూ వుంటారు. బీదలలోనూ వుంటారు. మంచి చెడ్డలు, వారివారి మనస్తత్వాల మీద ఆధారపడి వుంటాయి. నామాటవిను''

''సర్లే, ఇప్పుడేం కంగారొచ్చింది'' అన్నాడు మధు.

''అదికాదు... నువ్వు స్థిరంగా వెళ్తానని చెప్పకపోతే ఇక్కడే ఏదో యిస్తామంటూ నీచేత గొడ్డుచాకిరీ చేయించుకుంటారు'' అంది.

మధు తల్లివంక ఆశ్చర్యంగా చూశాడు.

''అమ్మా! ఇన్ని విషయాలు తెలిసి, ఇంత కాలం ఎలా వున్నావమ్మా''

''ఏం చెయ్యను? ఆడదాన్ని''

''అదిగో అమాట అనకు. ఆడదానివైనంత మాత్రాన నీ బాధ్యతలు ఏమైనా మానేశావా? నాన్నపోతే నెలల గుడ్డుని నన్ను పెంచడం మానేశావా'' అన్నాడు.

సుభద్రమ్మ నిట్టూర్చింది.

కొంతసేపు యిద్దరూ నిశ్శబ్దంగా వున్నారు. నర్సు వచ్చి ఏదో మందు యిచ్చివెళ్ళింది.

''ఆయన ఎడ్రను అంటూ లేదు. రాఘవేంద్రరావు ఇంటిపేరు అదీ అక్కరలేదు ఆ వూర్లో ఆయన్ని ఎరుగనివాళ్ళెవరూ లేరు''

మధు తల్లి మాటలకేమీ సమాధానం చెప్పలేదుగానీ, ఆమె చెప్పిన పేరు, వివరాలు గుర్తుపెట్టుకున్నాడు.

★ ★ ★

కాలిపోతున్న తల్లి శవంవైపు చూస్తున్నాడు మధు తదేకంగా. ఏడ్చిఏడ్చి అతని కళ్ళు ఎర్రబారిపోయాయి. ఎర్రని ఆ కళ్ళల్లో ఈ చితి మంటలు ప్రతిఫలిస్తున్నాయి కానీ, ఆ ఎర్రదనంలో ఏదో కసి, కోపం, వుక్రోషం వున్నాయి. వాటికి అర్థంవుందా లేదా, అంటే చెప్పడం కష్టం, ఊహ తెలిసినప్పటినుండి తననీ, తన తల్లినీ ఎవ్వరూ ఆదరించలేదనే కసి, రెక్కలు అమ్ముకున్నా సరైన ప్రతిఫలం యివ్వలేదనే కోపం, తనేం చెయ్యలేని అసహాయస్థితిలో వున్నాననే వుక్రోషం, ఈ ప్రపంచాన్ని నమిలి మింగేయాలన్నంతకసి, అవసరాన్ని అదనుగా చూసుకుని పేదవాడ్ని ధనవంతుడు పీక్కు తింటున్నాడని కోపం.

ఎలాగైనా డబ్బు సంపాదించాలి. దాని కోసం ఏదైనా చెయ్యాలి? తనని పేదవాడిగా చేసి అవమానించిన వారిని, తనొక ధనవంతుడిగానే వెళ్ళి పలకరించాలి.

ఏదో వూహకందని ఆవేదన. రకరకాల ఆలోచనలతో స్మశానం బయటకొచ్చాడు.

అనుకున్నట్లే, గుర్నాథం అన్నాడు

''నా దగ్గరే వుండు. చిన్న పని, పెద్ద పనీ చేస్తూ, మా కళ్ళముందు పెరిగినవాడవు'' అని.

మధు ఆయనకేం జవాబు చెప్పలేదు.

★ ★ ★

''మధు చాలా బుద్ధిమంతుడు. నిజాయితీ గలవాడూను. నడన్‌గా ఓ ఉదయం వచ్చాడు. తనెవరో చెప్పాడు. ముఖం చూస్తే చాలా కష్టాల్లో, దిగులుగా వున్నాడనిపించింది. ఇక్కడుండు నాకు సాయంగా అన్నాను. వున్నాడు'' ఆగాడు రాఘవేంద్రరావు.

''సిన్సియర్‌గా వుండే మనుమలు దొర

కడం కష్టమే ఈ రోజుల్లో. మీకూ చేదోడువాదోడుగా వుంటాడు'' అన్నాడు రాజా.

''పైగా మనవాళ్ళ అబ్బాయే''

''చుట్టరికం వుందా?''

''వుంది అంటే వుంది. చాలా దూరం. ఇప్పుడు మీ పిన్ని వుందా, ఆమెకి నలుగురు పినతల్లులు, వారిలో మూడోఆమెకి ఒక కూతురుండేది. ఆమెకి పెళ్ళిచేసిన మూడు నెలలకే విషజ్వరం వచ్చిపోయింది. ఆమె మొగుడు మళ్ళీ పెళ్ళిచేసుకున్నాడు. ఆ చేసుకున్నామెకి చెల్లెలి కొడుకు ఈ మధు.

''అబ్బ! ఏం చుట్టరికమండీ'' నవ్వాడు రాజా. ఇద్దరూ నవ్వుకున్నారు. అంతలోనే రావు సీరియస్‌గా-

''చుట్టరికానిదేముందిగానీ, మనం సాయం చేస్తామని ఎంతో ఆశతో వచ్చాడు. వాళ్ళమ్మ పోతూ పోతూ నాపేరూ, ఎడ్రను యిచ్చిపోయిందట. ఆ మాట వింటే నాక్కాస్త ఇదిగానే అనిపించింది. పైగా మనకేం లేదా పోదా.



"నిజం... ఏం చదివాడు"

"టెన్త్‌క్లాసు పరీక్షలు మూడు నెలలుండగా ఈ గొడవలన్నీ జరిగాయిట. పరీక్షకెళ్ళమని చెప్పాను. వెళ్తున్నాడు. కానీ చదువుకి మించిన తెలివుంది సుమా"

"మీకు సాయంగా వున్నాడుకదా!"

"సాయమేమిటి. మొన్న నాకు నుస్తీ చేసినప్పుడు మధుయేగా అన్నీచూశాడు"

"పోన్లెండి - నాక్కొంత శాంతిగా వుంటుంది"

ఇద్దరూ అనేకరకాల కబుర్లలో పడ్డారు. కలప వ్యాపారం, వ్యవసాయం, ధాన్యం కొనుగోలు, మిల్లువనివారు.

"వదినా! ఓ... వదినా, ఈ బుజ్జిముండ ఒక్క గుక్కెడు పాలు కూడా తాగటంలేదు" అంటూ అరిచింది అనుపమ.

నళిని పరుగెట్టుకొచ్చింది. "ఏదీ అసలు తాగలేదా? కాస్సేపుండి తాగుతుంది" అని దాన్ని ఎత్తుకుని గుండెలకదుముకుని దానితో నానారకాల సంభాషణలు చేయడం మొదలు పెట్టింది.

"ఏంరా నాన్నా! ఆకల్లేదా? నామీద కోపమా? నేను కనిపించలేదని బెంగా? అనూ, నేనూ ఒకటేరా కన్నా. అనూ నిన్ను ముద్దుగా ప్రేమగా చూస్తుందిరా నాన్నా" అటూ ఆ కుక్కపిల్లని ముద్దుచేస్తూ ఇల్లంతా తిరుగుతోంది. అవన్నీ వింటూ అనుపమ కూడా నళిని వెనకాలే తిరుగుతోంది.

"అవునూ బాబయ్యా! యాదగిరి ఏడీ, కనిపించడేం?" అన్నాడు రాజా.

"ఎరువులకెళ్ళాడు. రాత్రికొస్తాడు"

యాదగిరి లేకుండా ఆ యింట్లో క్షణం గడవదని రాజారావుకి తెలుసు. యాదగిరి తాతతండ్రులనుంచీ యీ యింటిని అంటిపెట్టుకుని వున్నవాళ్ళు. ఇంట్లో మనుమల్లాగే వాళ్ళు మసలుకుంటారు. వాళ్ళ యిళ్ళల్లో పెళ్ళిళ్ళకీ, పేరంటాలకీ సొమ్ములన్నీ ఈ యింట్లోవే. ఈ ఇంట్లో శుభకార్యాల పెత్తనమంతా వాళ్ళదే. వాళ్ళమధ్య కులాల అంతరాలు, అంతస్థుల భేదాలు ఎప్పుడూ రాలేదు. ఒకళ్ళంటే మరొకళ్ళకి ఎంతో ప్రేమా, మరెంతో గౌరవం.

యాదగిరికి అనుపమంటే వల్లమాలిన అభిమానం. సరిగ్గా వారంరోజుల తేడాలో అతనికీ కూతురే పుట్టింది. ఆమె పేరు బతకమ్మ అని పేరు పెట్టుకున్నా అనుపమని బతకమ్మని, బతకమ్మని అనుపమని తడబడి పిలుస్తూ వుంటాడు యాదగిరి. నిజానికి అనుపమ అతని చేతులమీదుగానే పెరిగింది.

భోజనాలు, విశ్రాంతులు, కాలక్షేపాలు అయ్యాక రాజారావు, రాఘవేంద్రరావు పొలంవైపు నడక సాగించారు. వర్షం కురిసి వెలసింది. సన్నగా నీరెండ పరుచుకుంది. అస్తమించేముందు సూర్యుడు తన అందాలన్నీ వన్నెచిన్నెలుగా వెదజల్లుతున్నాడు. అప్పుడు నెమ్మదిగా మాటల్లో మొదలుపెట్టాడు రాజారావు.

"బాబయ్యా! అనుపమ పెళ్ళి గురించి మీరు ఏమైనా ఆలోచిస్తున్నారా?" అన్నాడు.

"అదేమిటి రాజా! ప్రత్యేకం ఏదైనా ఆలోచన వుంటే ముందు చెప్పేది నీకే. మనకి అన్నివిధాలా అనుకూలంగా వుండే సంబంధమేమైనా వుంటే చూద్దాం"

అదే చెప్దామనుకుంటున్నా. మన నళిని పినతల్లి కొడుకు రాహుల్ వున్నాడు. మెరైన్ ఇంజనీర్ చేశాడు, అమెరికాలో. అతనొక నెల్లాళ్ళలో ఇండియా రాబోతున్నాడు. మనం మాట్లాడదామంటే..."

"రాజా! నాకలాంటి దూరదేశాలకు వెళ్ళే సంబంధాలు యిష్టంలేదు. మనకి కాస్త దగ్గరలో పిల్ల మూడు నాలుగు గంటల ప్రయాణంలో వుండాలి. మరి మీ పిన్నయితే ఇల్లరికమే కావాలంటోంది" అన్నాడు గంభీరంగా.

"ఇల్లరికం...?" నసిగాడు రాజారావు.

"వద్దులే... నాకిష్టంలేదు. ఎందుకంటే ఇల్లరికం అని మనం ముందే కమిట్ అయితే వాళ్ళకి మన పిల్లమీదకన్నా ఆస్తిమీద ఎక్కువ మోజు వుంటుంది. రెండోది... పిల్లాడికి స్వశక్తి వుండదు. అది నాకిష్టంలేదు"

"కరెక్ట్ బాబయ్యా! కచ్చితంగా చెప్పావు"

"అంతేకదా! మన ఆస్తిపాస్తులన్నీ అనుపమవే కానీ ఆమెని జాగ్రత్తగా, అపురూపంగా




చూసుకునే భర్త కావాలికదా!''

అంతా బాగానేవుందిగానీ మీకున్న హోదాకి తగ్గట్టుగా అల్లుడి స్టేటస్ గురించి మీరు ఆలోచించడంలేదు. నేను చెప్పిన సంబంధం కుర్రాడు రాజకుమారుడిలా వుంటాడు. చదువు, తెలివి, ఠీవి అన్నీ వున్నాయి. మరీ ఏమీలేనివాళ్ళేమీ కాదు. వాళ్ళకీ కాస్తో కూస్తో వుంది నీతో పోలిస్తే''

''అది సమస్య కాదనుకో''

''అదీ సమస్యే బాబయ్యా! వియ్యానికి సమవుజ్జీ వుండాలి. మనకి దగ్గరగా వుంటాడని ఏమీలేనివాడికివ్వలేంకదా!'' అన్నాడు.

''ఛా! ఛా... అలా ఎప్పుడూ జరగదు. డబ్బేకాదు. పదిమంది బలగం కూడా వుండాలి'' అన్నాడు రాఘవేంద్రరావు.

''మీరూరుకోండి. అసలు పిల్లని చూపిస్తే నచ్చితే అదే... ఇద్దరికీ ఒకరికొకరు నచ్చితే, అప్పుడు మిగిలినవి తర్వాత చూద్దాం''

అబ్బే మాకు నచ్చిందన్నాక యింక మనం ఆలోచించేదేముంటుంది. బాగుండదుకూడా'' రావు ఆలోచనల్లో పడ్డాడు.

''పెళ్ళయి, కొన్నాళ్ళు వుద్యోగరీత్యా వరాయిచోటవున్నా, తర్వాత వచ్చి యిక్కడే స్థిరపడకూడదని ఎక్కడుంది?''

''ఎక్కడుంది? లేదు. కానీ స్థిరపడాలని కూడా ఎక్కడా లేదు''

''చాల్లే బాబయ్యా నీ వాదన. మంచి చదువు, స్టేటస్‌వున్న సంబంధం దూసిపోతే అన్నివేళలా దొరకదు. నాకు చెల్లెళ్ళు లేరనే కొరత అనూతో తీరుతుందని...''

''అలాగేలే. ఒకసారి సావిత్రితో కూడా మాట్లాడి, ఆ తర్వాత నిర్ణయిద్దాం''

''నీకంటే పిన్నిని ఒప్పించటం ఈజీ...'' అన్నాడు కొంటెగా రాజా.

రాఘవేంద్రరావు గలగలా నవ్వాడు.

★ ★ ★

చదువుతున్న పుస్తకం పక్కకు పెట్టి, మంచంమీద ఒరిగాడు మధు.

అతనిలో రకరకాల ఆలోచనలు ముసురుతున్నాయి. ఇప్పుడిప్పుడే తల్లి జ్ఞాపకాలనుండి దూరంగా మళ్ళీ కాస్త కోలుకుంటున్నాడు.

మొదట్లో తల్లి మాటలు విని ఈ వూరు రావాలని అనుకోలేదు. 'ఎక్కడో శ్రీమంతులున్నారు. వారు నీకు ఆశ్రయమిస్తారు వెళ్ళు' అని తల్లి చెప్తే తనకి నమ్మకం కుదరలేదు. ఎక్కడో కూలీ నాలీ చేసుకుని బతికేద్దాం అని ఎన్నోసార్లు అనుకున్నాడు. కానీ తల్లి చనిపోతూ చెప్పిన మాటలు కావడంవల్ల వాటిని మర్చిపోవడం అతని తరంకాలేదు. పైగా చదువుకోవాలనే తీవ్రమైన కోరిక కూడా అతన్ని లొంగదీసింది. అయిష్టంగా, మొక్కుబడిగా యిక్కడికొచ్చాడు. ఇక్కడ మనుషులు ఏమాత్రం అనాదరణ చూపించినా వెనక్కి వెళ్ళిపోవచ్చు. అయితే తల్లి మాటలు మన్నించాననే సంతృప్తి మిగులుతుంది. ఇదేవిధంగా మధు ఎన్నో ఆలోచనలు చేశాడు.

శ్రీమంతులు, చిన్నతనంనుంచీ తన యందు చూపించిన అనాదరణ అతనంత త్వరగా మర్చిపోలేదు. అప్పుడప్పుడు ముళ్ళలా కొన్ని జ్ఞాపకాలు బయటకొచ్చి బాధిస్తూనే వున్నాయి.

అయితే మధు రాఘవేంద్రరావు యింటికొచ్చిన చాలా కొద్దిరోజులకే అతని అభిప్రాయాలు మారడం మొదలుపెట్టాయి. మంచిచెడ్డలు బీదగొప్పలు మీద ఆధారపడి వుండవు. మనుషుల స్వభావాలమీద ఆధారపడి వుంటాయని తల్లి చెప్పిన మాటలు అతనికి గుర్తుకొస్తున్నాయి. అందులో కొంత నిజముందేమోనని అతనికనిపిస్తోంది.

రాఘవేంద్రగారు మంచివారనుకుంటే ఆయనకంటే సావిత్రమ్మగారు మరీ మంచివారు. లాయరు గుర్నాధంగారిని, భాగ్యవతిగారిని చూసిన కళ్ళతో వీళ్ళని చూస్తే విచిత్రంగా వుంటుంది.

సావిత్రమ్మగారు తనకి వాళ్ళతోబాటుగానే టేబులుమీద టిఫిను, భోజనం ఎంతో మర్యాదగా, ప్రేమగా పెడతారు. తరిచి తరిచి పెడతారు. రాఘవేంద్రరావుగారి పలకరింతలో ఎంతో ఆత్మీయత వుంటుంది.

అన్నిటికీ మించి, అనుపమని ఒక్కసారి చూసి, తను విచిత్రమైన అనుభూతి పొందాడు. గుండ్రటి ముఖం, బొద్దుగా, ముద్దబంతిపు

వ్వులా, ఎంతో ఆకర్షణీయంగా వుంటుంది. అన్నిటికీమించి ఆ కళ్ళలో వుండే అమాయకత్వం - అందర్నీ కళ్ళెంవేసి లాగుతుంది. ఇక్కడే వుండిపోతే రోజూ అనుపమని చూడచ్చు అనేది మధు ఊహల్లో మెదలిది.

తన ఆలోచనలకి తనే సిగ్గుపడ్డాడు మధు. ఆశపడటానికి కూడా అర్హత వుండాలి. ఆశకి అంతువుండాలి అనుకున్నాడు. అలా అనుకోగానే అతనికి ఎక్కడలేని దుఃఖం వచ్చేసింది. తనలోని అనర్హత ఏమిటి? తన పేదరికమే కదా! అవును. డబ్బులేనితనమే. ఈ శ్రీమంతులందరూ డబ్బుతోనే అర్హతని నిర్ణయిస్తారు. లేకపోతే తనకొచ్చిన లోటేమిటి?

మధుకి నిద్రపట్టలేదు. పక్కకి ఒత్తిగిల్లి దుప్పటి సర్దుకున్నాడు. మెత్తని పరుపు, మెత్తని తలగడ మళ్ళీ అతని ఆలోచనల్ని మొదటికి తెచ్చాయి.

ఊహలు సాగుతూనే వున్నాయి. ఆశలు కోటలు కడుతున్నాయి. ప్రతీ వూహలోనూ అనుపమ తన పక్కన, తనకంత దగ్గరగా, అత్యంత చేరువగా, అలా అలా వూహిస్తూ, ఆనందిస్తూ, అంతలోనే ఎవరినో ద్వేషిస్తూ, వుక్రోషపడిపోతూ, భగవంతుణ్ణి నిందిస్తూ ఎప్పుడో నిద్రలోకి జారుకున్నాడు.

బాగా తెల్లవారాక యాదగిరి వచ్చి లేపితే లేచాడు. కంగారుగా - ''టైమెంతయింది'' అన్నాడు.

''ఎంతో కాలేదులే ఏడున్నర'' అన్నాడు యాదగిరి.

''అబ్బో! అంతయిందా''

''రాత్రి బాగా చదివినట్టున్నావు. పరీక్షలెన్నాళ్ళున్నాయి?'' అన్నాడు యాదగిరి దుప్పటి మడతెడుతూ.

''పదేరోజులు యాదగిరీ! ఈ పదిరోజులూ కష్టపడితే'' అన్నాడు రాత్రి ఆలోచనలు నెమరేసుకుంటూ.

''షురే... బాగా రాసి ప్యాసవ్వు. అయ్యగారు బంగారం, నదువుకుంటానంటే డబ్బుకేం సూసుకోరు'' అంటూ వెళ్ళిపోయాడు యాదగిరి.

''మధూ'' అంటూ పరుగెత్తుకొచ్చింది అనుపమ.

''ఇదిగో నిన్నంతా వెదికాను ఈ నోట్సుకోసం. నేను సైన్స్, మాథ్స్ శ్రద్ధగా మెయిన్‌టెయిన్ చేశాను చూసుకో. ఈజీగా రాసేయొచ్చు పరీక్ష'' అంది నోట్‌బుక్స్ మధుకిస్తూ.

మధు ఆ క్షణాన్న తన స్వప్నసుందరి ఒక్కసారి ప్రత్యక్షమైనట్లు మైమరచిపోయాడు. కానీ తన భావాలు బయటపడకుండా జాగ్రత్తపడ్డాడు.

''ఏమిటీ ఇప్పుడే లేచావా. సర్లే స్నానం చేసి వస్తావని చెప్తాలే అమ్మతో'' అంటూ వెళ్ళిపోయింది.

అనుపమ పరుగులాంటి నడకతో వెళ్తుంటే దూరమైన మువ్వల సవ్వడి మధు మతిపోగొట్టింది.

తను నిద్రలేస్తూండగానే అనుపమ కనిపించడం ఆనందంగా అనిపించినా, తన పాచిముఖం ఆమెకి చూపించటం బాధగా అనిపించింది. వెంటనే వెళ్ళి అద్దంలో చూసుకున్నాడు. చాలాసేపు వివిధ కోణాల్లో చూసుకున్నాడు. ఏదో అసంతృప్తి అతన్ని చుట్టేసింది. అనుపమని ఆకర్షించి, ఆకట్టుకోగల అందం తనకి లేదనిపించింది. ఆ వూహ అతనికి నరకప్రాయం అయింది. నిజమే. తను సామాన్యంగా వుంటాడు. చామనఛాయగా, అయిదడుగుల మూడంగుళాల ఎత్తుగా, సాదాసీదా రూపంతో వుంటాడు. తను పదిమందిలో ఒకడు. అంతేగానీ పదిమందిలో ప్రత్యేకంగా ఒకడుకాడు. పోషణలేని శరీరం. దారిద్ర్యంవల్ల వచ్చిన దైన్యం ఇవన్నీ కలిసి తనని ఆకర్షించగల శక్తిని కోల్పోయేలా చేశాయి.

మధు తల విదిలించి కాలకృత్యాలు తీర్చుకునేందుకు బయలుదేరాడు.

యాదగిరి ఎదురుపడి, ''అమ్మగారు టిఫిను చెయ్యడానికి రమ్మంటున్నారు బాబూ'' అన్నాడు.

''ఇదిగో! అయిదు నిముషాల్లో వచ్చేస్తున్నానని చెప్పు'' అంటూ బాత్‌రూమ్‌వైపు పరుగు తీశాడు.

★ ★ ★

తెల్లతెల్లవారుతుండగా వచ్చిన పేపర్లో తన పరీక్షా ఫలితాలు చూసుకుని ఒక్కసారి




ఆనందంతో వుక్కిరి బిక్కిరయ్యాడు మధు. మరుక్షణం పరుగెట్టుకెళ్ళాడు ఆ వార్త అనుపమకి చెప్దామని. కాని ఆమె ఇంకా నిద్ర లేవలేదని తెలిసి నిరుత్సాహపడ్డాడు. ఆమెని నిద్రలేపి చెప్పే చనువూ ధైర్యం అతనికి లేవు. ఇంతలో అప్పుడే లేచి అటువస్తున్న రాఘవేంద్రరావుగారు కనిపించటంతో మళ్ళీ ఉత్సాహం పుంజుకుని-

"నేను ప్యాసయ్యానండీ, ఫస్టుక్లాసు వచ్చింది" అన్నాడు.

ఆయన ముఖం ఆనందంతో వెలిగింది.

"బాగుంది నాయనా! చాలా శుభవార్త. ఇప్పుడే వచ్చిందా పేపరు?"

"అవునండీ"

"ఏమిటి చాలా బాగుందంటున్నారు" అంటూ అక్కడికొచ్చింది సావిత్రి.

"మన మధు టెన్త్‌క్లాసు ఫస్టుక్లాసులో ప్యాసయ్యాడు"

"బాగుంది నాయనా! చాలా బాగుంది. పాపం మీ అమ్మవుంటే ఎంతో సంబరపడేది"

అవన్నీ ఇప్పుడెందుకుగానీ, ఏదీ, ఏదైనా మంచి స్వీటు చేయించు.

"ఓ... దానికేం భాగ్యం" సావిత్రి వెళ్ళింది పెరటివైపు. రాఘవేంద్రరావు తోటలో పచార్లు చేస్తున్నాడు. వెనకాలే యాదగిరి నడుస్తున్నాడు.

"మధు మంచి తెలివైన కుర్రాడు" అన్నాడు రావు.

"మరేనండి. అయితే మాత్రం చదవడం ఎలా చదివారనీ... ఓయబ్బో! రాత్రి పన్నెండయినా దీపం ఎలుగుతూనే వుండేది"

"కష్టపడితేనేకదా! ఫలితం దక్కేది"

"మరేనండి"

"మధూ... కంగ్రాచ్యులేషన్స్" అంది అనుపమ.

మతిపోయినవాడిలా చూస్తూండిపోయాడు మధు.

"థాంక్స్! అయినా ఇందులో గొప్పేముంది?"

"భలేవాడివే ఫస్టుక్లాసులో ప్యాసయి"

"ఏ క్లాసయినా లాభమేముంది?"

"ఎందుకంత నిరాశ. క్లాసు రావడం గొప్ప తెలుసా?" అంది.

"నీకూ వచ్చిందిగా"

అనుపమ పకపకా నవ్వింది- "నాకెన్ని ట్యూషన్లు పెట్టుకున్నానో" అంది.

మధు లోపల్లోపల ఆనందించాడు. అనుపమ తనకంటే నన్నే ఎక్కువగా భావిస్తోందనే ఊహ అతనికెంతో ఊరట నిచ్చింది.

"సరే... నాకో చిన్నపని చెయ్యాలి" అంది.

"చెప్పు... ఏదైనా సరే చేస్తా" అన్నాడు.

"మరీ అంత కష్టమైందేవీఁ కాదులే"

"చెప్పు మరి"

"గొబ్బిచెట్టుకి ఎన్నో పూలు పూశాయి. ముందువైపు కోశాను. వెనకంతా గోడవైపు చాలా వున్నాయి- కానీ ముళ్ళు. గోడెక్కి కాసిని కోసిపెడుదూ" అంది.

ఆమె నోట్లోంచి మాట ఊడిపడకుండానే మధు గోడమీద వున్నాడు. ఆ గోడమీంచి గొబ్బిపూల చెట్టుమీదికి వంగి పూలు కోసేసరికి అతనికెన్నో ముళ్ళు గుచ్చుకున్నాయి. కానీ అతనికాముళ్ళ బాధ ఏం తెలీదు. తెలిసిందల్లా ఒకటే ఆనందం. అనుపమ అడిగినందుకు పూలు కోసిచ్చానే అని.

కాళ్ళకి, వంటికీ బురదైంది. అది కడుక్కుని తువ్వాలుతో తుడుచుకుంటూ వుండగా, రాఘవేంద్రరావు, సావిత్రి తీరిగ్గా కూర్చుని మాట్లాడుకోవడం మధు చెవిని పడింది.

"విశాఖపట్నం సంబంధం నాకంత నచ్చలేదు" అన్నాడు రావు.

"ఏం? ఎందుకనీ, పిల్లాడు బాగానే వున్నాడుగా"

"పిల్లాడు బాగానే వున్నాడుగానీ, వాళ్ళు అన్నదమ్ములు అయిదుగురు. ఈ అబ్బాయి మూడోవాడు. అందరికీ మనకున్న ఆస్తిమీదే కన్నుందనిపిస్తోంది"

"అయితే మీ ఉద్దేశం ఏమిటీ?" సావిత్రి సాగదీసింది.

"చూడు సావిత్రీ... నా అభిప్రాయం చెప్ప

న్నా మనకి డబ్బు వుందికదా అని ఏమీ లేనివాడికి నా కూతుర్ని చస్తే ఇవ్వను. వాడికీ మంచి ఆస్తి హెూదా వుండాలి. మంచి గుణ వంతుడవ్వాలి. డబ్బుముఖం ఎరుగని వాడ యితే వాడి ధ్యాస డబ్బుమీదే వుంటుంది. అది నా కిష్టంలేదు. అందుకనీ... నెమ్మదిగా చూద్దాం''

రాఘవేంద్రరావు మాటలు విన్న మధుకి ఒళ్ళు మండిపోయింది. ఎందుకో అతనిలో అసహనం కట్టలు తెంచుకుంది.

''హు! డబ్బున్నవాడే గుణవంతుడట. డబ్బు లేనివాడికి డబ్బుమీదే ధ్యాస వుంటుందట. అవునులే ఆయనలో వున్న ధన అహంకారం అలాగే ఆలోచింపచేస్తుంది. ఏం? ఒక్క డబ్బు లేదనేవంక తప్పిస్తే తనకున్న లోటేమిటి? తనకి అనువమనిచ్చి పెళ్ళి చెయ్యొ వచ్చుగా''

మధు తనకి తెలీకుండానే విసురుగా తన గదిలోకి వెళ్ళిపోయాడు.

ఇది గమనించిన యాదగిరి ఏదో స్ఫురించి నట్లు వెనకాలే వెళ్ళాడు.

మధు మంచంమీద వెల్లకిలా పడుకుని చేత్తో కళ్ళు కప్పుకుని పడుకునివున్నాడు.

అతను పడుకున్న తీరు యాదగిరికి బాధగా, అనుమానంగా అనిపించింది. కానీ ఆ సమయంలో అతని ఏకాంతాన్ని పాడుచె య్యడం ఇష్టంలేక పక్కకి తప్పుకున్నాడు. కానీ యాదగిరి మనసులో ఏదో అర్థంకాని ఆవేదన చోటుచేసుకుంది. తల్లిదండ్రీ లేని మధుపట్ల అతని మనసు ఆర్ద్రమైంది. పైగా నా అన్నవా ళ్ళు లేక ఆ పసివాడు ఏదో మధన పడుతున్నా డనిపించింది. సమయం చూసి మధు మన నులోని బాధలను, భావాలను బయటికి రాబ ట్టాలని అనుకున్నాడు యాదగిరి.

★ ★ ★

ఆటోదిగి ఇంట్లోకొచ్చి అలసటగా సోఫాలో వాలిపోయింది నళిని. అక్కడే వున్న బంటీ తోకాడిస్తూ వచ్చి నళిని పక్కలో చేరి చేతులు, కాళ్ళూ, మెడా, ఆప్యాయంగా నాకడం మొద లుపెట్టింది.

రెండు చేతులతో దాన్ని దగ్గరకి తీసుకుని ముద్దెట్టుకుని, సోఫా కిందకి వదిలేసింది. అది గదిలో అటూ ఇటూ తిరుగుతూ కుయ్యి కుయ్యి మంటోంది. నళిని మనసులో ఒక రకమైన తీవ్ర అసంతృప్తి చోటుచేసుకుంది. నిజానికి పిల్లలు లేకపోవడం అనే విషయం తనెప్పు డూ ఆలోచించనేలేదు. అటు భర్తవైపుగాని, ఇటు తనవైపుగాని బొత్తిగా పిల్లలు లేకపో వడం అంటూ లేదు. మరి ఈ పదేళ్ళకాలంలో తనకసలు అలాంటి సూచనేలేదు, గర్భం రాలే దు. మొదట్లో తామిద్దరూ, హాయిగా జల్సాగా కాలక్షేపం చేసినా ఇప్పుడిప్పుడు ఏదో లోటు ఫీలవుతున్నారు.

నళినికి చిన్నప్పటినుండీ కుక్కపిల్లలంటే ఇష్టం. కానీ ఈమధ్య ఆ ఇష్టం ఒక పిచ్చిగా మారింది. అక్కడక్కడ జోక్‌గా అన్నట్లు ఒకరిద్ద రు 'మీకు పిల్లలు లేరుగా, అందుకే కుక్క లంటే అంత ఆపేక్ష' అన్నారు.

అప్పట్లో ఆ మాటలకి నవ్వేసినా, పోనుపోను ఆ మాటలే శల్యాలై బాధిస్తున్నాయి. కానీ తనేం చెయ్యగలదు? తన చేతిలో ఏమీలేదు కదా! ఎన్నో డాక్టరు టెస్టులు జరిగాయి. ఎన్నో మందులు వాడటం జరిగింది. కానీ ఫలితం కనిపించలేదు. చివరిగా ఈరోజు పేరుమోసిన గైనకాలజిస్టు స్వర్ణలతని కలిసింది. ఆమె ఓ చిన్న ఆపరేషన్ చేస్తానని డేట్ ఇచ్చింది.

నళిని అన్నం కూడా తినకుండా అలాగే సోఫాలో నిద్రపోయింది.

కాలింగ్‌బెల్ మోగితే వులిక్కిపడి లేచేసరికి మూడుగంటలైంది.

తలుపుతీసి చూస్తే ఎదురుగా భర్త రాజా రావు.

''ఏమిటీ ఏదీ కానివేళ వచ్చారు'' అంది.

''ఏంలేదు... అదేమిటి ముఖమలా వుంది. వంట్లో బాగాలేదా? డాక్టరు దగ్గరకి, అదే స్వర్ణ లత దగ్గరకి వెళ్ళావా?''

''ఆ... వెళ్ళాను. అంతా బాగానే వుంది''

''ఆమె ఏమన్నారు?''

''ఓ చిన్న ఆపరేషన్ చేస్తానంది''

''ఎప్పుడు?''

''శనివారం- మీరారోజు శలవు పెట్టండి. ఎక్కడికీ ప్రోగ్రామ్ వేసుకోకండి''




"ఛ... ఏమిటా బేలతనం? నేనెక్కడికీ వెళ్ళను. శలవు ఒక్కరోజు కాదు రెండురోజులు పెడతా" అన్నాడు ధైర్యం చెప్తూ.

"మరే పాపం! మర్నాడు ఆదివారంగా- అందుకనీ" అంది.

ఆమె ముఖంలో కనిపించిన చిన్న చిర్నవ్వు చూశాక రాజారావుకి మనసు కుదుటపడింది.

"మా సావిత్రి పిన్నికి ఫోను చేస్తాను. నీకు ధైర్యంగా వుంటుంది" అన్నాడు.

"అబ్బే ఎందుకూ. అయినా నాకేం భయంలేదు. వాళ్ళందరికీ చెప్పకండి. సిగ్గుగా వుంటుంది" అంది.

"ఇందులో సిగ్గుపడాల్సిన విషయంమేం లేదు. సరే... నీ ఇష్టం. ఆలోచించు. కావాలంటే ఒకరోజు ముందుగా చెయ్యాలి. పైగా సావిత్రి పిన్ని అందరిలాంటిదీ కాదుగదా!"

"అబ్బే అదేంకాదు. ఆమెంటే నాకెంతో ఇష్టం, కానీ..."

"పోనీ నీ ఇష్టం"

"మళ్ళీ వెళ్తారా ఆఫీసుకి, కాస్త కాఫీ కలిపి ఇవ్వనా"

"ఆ... ఏమిటీ టేబుల్‌మీద అన్నీ అలాగే వున్నాయి. నువ్వు భోజనం చెయ్యలేదా" అన్నాడు భార్య ముఖంలోకి నిశితంగా చూస్తూ.

"లేదు... హాస్పటల్‌నుంచి వస్తూనే పడుకుండిపోయాను. నిద్రపట్టేసింది. మీరొచ్చాకేలేచాను"

"పిచ్చీ! బెంగపెట్టుకున్నావా? చూడూ- మనకి పిల్లలు లేకపోయినా ఏంఫరవాలేదు. మరీ నీకు కావాలంటే ఏ అనాథ శరణాలయంనుంచో ఒక పసిగుడ్డుని తెచ్చుకుందాం. కంటేనే పిల్లలా. నో... నో. అలాంటి పిచ్చి పిచ్చి ఆలోచనలతో మనసు పాడుచేసుకోకు" అంటూ నళినిని దగ్గరకి తీసుకుని ముద్దుపెట్టుకున్నాడు. అతని గుండెల్లో తలదూర్చి వుండిపోయిందామె. అప్పుడామె కళ్ళల్లో వుబికిన కన్నీళ్ళని అతని హృదయమే తుడిచింది. ఓదార్చింది-

వారిద్దరూ అలా కొంతసేపు ఒకరినొకరు ఓదార్చుకుంటూ వుండిపోయారు. ముందుగా రాజా కదిలి,

"ముందు కాస్త అన్నం తిను. ముఖం చూడు ఎలా నీరసంగా వుందో, వాడిపోయినట్లు. ఆరోగ్యం చెడితే ఎంతో కష్టం" అంటూ ఆమెను డైనింగ్ టేబులు దగ్గర కుర్చీలో కూర్చోబెట్టాడు.

నళిని చంటిపిల్లలా అతను చెప్పినట్లుగా చేసింది.

రాజా ఆమెకి కంచంలో అన్నం, కూరా వేసి తినమన్నాడు. ఆమె బుద్ధిగా తింది. పెరుగు కూడా వేసి- "ఇంకెప్పుడూ పిచ్చి పిచ్చి ఆలోచనలు పెట్టుకోకు. మనిద్దరం ఒకరికొకరు తోడుగా వున్నంతవరకు మనకి లోటేమీలేదు" అన్నాడు.



ఏమోయ్ మధూ... నువ్వు చదువుకోవాలంటే కాలేజీలో చేరు. డబ్బు గురించి ఆలోచించాల్సినవసేం లేదు. నేను చదివిస్తాను" అన్నాడు రాఘవేంద్రరావు.

"అబ్బే! వద్దండి. మీదగ్గర పనిచేస్తానండి" అన్నాడు నమ్రతగా.

"అదినరే... పని ఎప్పుడూ వుండేదే. నువ్వు చదువుకుని, బి.య్యేనో, బియ్యస్సీనో అయివచ్చినా, వుద్యోగంకోసం అగచాట్లు పడాల్సినవని లేదు. నాదగ్గరే నీకు వుద్యోగం రెడీగా వుంటుంది. కానీ... నువ్వు యిప్పుడు కాలేజీలో చదువుకోవాలనుకుంటే...

"లేదండీ, నేను మీదగ్గర పనిచేస్తూ, ప్రయివేట్‌గా చదువుకుంటాను"

"అది నీకు కష్టమవదా"

''లేదండీ... నాకు తృప్తిగా వుంటుంది''

''సరే... నీయిష్టం''

అప్పుడే అక్కడికొచ్చిన అనుపమ వీరి సంభాషణ విని - ''అదేమిటి మధూ! హాయిగా కాలేజీలో చేరి చదువుకోమంటే, రంపంపొట్టు మధ్యలోనూ, బియ్యం ఊక మధ్యలోనూ కూర్చుని చదువుతానంటావేమిటి?'' అంది.

'ఎక్కడ కూర్చున్నా, ఈ కళ్ళతో ఏం చూసినా, నా మనసుకి కనిపించేది ఎప్పుడే నువ్వే అనూ' అంది అతని మనసు లోలోపల-

పైకిమాత్రం చిర్నవ్వు నవ్వి వూరుకున్నాడు.

''అతనికి ఆత్మాభిమానం ఎక్కువ. దయా ధర్మాలమీద ఆధారపడకుండా స్వశక్తిమీద ఆధారపడాలని అతని కోరిక. మంచిదే, అలా వుండేవారెంతమందీ ఈ రోజుల్లో? ప్రతివాడికీ ఈజీ మనీ కావాలి'' అన్నాడు రావు.

మధు గుండెలు పొంగిపోయాయి. ఛాతీ వెడల్పయింది.

''అవునే అనూ, ఇదిగో ఈ ఫొటో పంపాడు రాజా అన్నయ్య. వుత్తరం రాశాడు. నళినికి చిన్న ఆపరేషన్ చేశారట. క్షేమమేనట''

''ఆపరేషనా?''

''అదేం ప్రమాదం కాదులే - పిల్లలు పుట్టేందుకు''

అనుపమ అన్నయ్య వుత్తరం చదువుతున్నట్లు చదువుతూ క్రీగంట ఫొటో చూసింది. అందులో వున్న యువకుడు చాలా అందంగా, దర్జాగా, సినిమా హీరోలా వున్నాడనుకుంది మనసులో.

''ఇదిగోనోయ్ మధూ... ఈ ఫొటో చూడూ'' అంటూ ఆ ఫొటో మధుచేతికిచ్చాడు రావు.

మధు ఆ ఫొటోనందుకున్నప్పుడు అతని చేతులు వణికాయి. క్రోధం మనసులో బుసకొట్టినా, కళ్ళల్లో ఏ భావమూ కనబడకుండా జాగ్రత్తపడ్డాడు.

''బాగుందండీ'' అంటూ యిచ్చేశాడు.

''కుర్రాడు మంచి సినిమా హీరోలా వున్నాడుకదూ?'' అన్నాడు రావు కూతుర్ని వుడికిస్తూ. మధు సమాధానమేం చెప్పలేదు. మళ్ళీ రావు- ''మా అమ్మాయికేం తక్కువ. దాని ముఖంలో వున్న లక్ష్మీకళ చాలామంది అందగత్తెల్లో కనిపించదు'' అన్నాడు.

''నాన్నా! చాలించండి. ఇలా మాట్లాడితే నాకు కోపమొస్తుంది'' అంది గారంగా.

''ఈ సంబంధం చాలా మంచిది. కుదిరితే బాగానే వుంటుంది''

మధుకి అక్కడ నిప్పులమీద నిలబడినట్లుగా అనిపించింది. ''నేను మిల్లుకెళ్తున్నానండి'' అని చెప్పి బయలుదేరాడు.

''ఎప్పుడూ పనిధ్యాసే. ఏమాట్లో పెట్టినా తన డ్యూటి మర్చిపోడు'' అన్నాడు రావు.

ఈ మాటలు మధు విన్నాడు. కసిగా వళ్ళు కొరుక్కున్నాడు. ఈ సమయంలో అనుపమని వదిలి వెళ్ళడం యిష్టంలేక కాలేజీ చదువు వద్దన్నాడు తను. కానీ, ఇదేమిటిలా జరుగుతోంది?

'అన్నీ మంచిలక్షణాలేరా ముసలివాడా. అయినా నీ కూతుర్నివ్వడానికి నీకు కావల్సింది డబ్బుమూటలేగా' అనుకున్నాడు రోషంగా.

★ ★ ★

రాత్రి పదకొండుగంటలయింది. మంచంమీద పడుకున్న మధు నిద్రపట్టక అటూ యిటూ దొర్లుతున్నాడు. యాదగిరి మనసులో రకరకాల అనుమానాలు కదులుతుండగా మధు పడుకున్న గదివైపు వెళ్ళాడు. అలికిడి అవ్వగానే మధు లేచి లైటువేశాడు.

''ఏంటయ్యా మధూ... నిద్రపట్టలేదా'' అంటూ చతికిలబడ్డాడు.

''ఏంటో యాదగిరీ... నిద్రరావడంలేదు'' అన్నాడు.

''అయినా, నాకు తెలీకడుగుతాను, నీకేంటి సమస్యలు. ఎనకా, ముందూ పోషించాల్సినవాళ్ళెవరూ లేరు. తల్లి పోయిందంటే జబ్బుచేసింది, పోయింది. ఏంటీ కలత?'' అన్నాడు.

మధు గుండెలు ఒక్కసారి గుబగుబలాడాయి. తన కడుపులో బాధ చెప్పుకోవడానికి ఒకే ఒక్క వ్యక్తి యాదగిరి అనిపించింది. కానీ తన మనసులో మాట చెప్పగానే, ఇతను అది బట్టబయలు చేస్తే, తను వాళ్ళకి విరోధి అవుతాడు. తనకి వున్న ఆసరా కాస్తా పోతుంది.

కానీ, తన మనసులో మాట చెప్పకపోతే ఎలా? ఈ మంట చల్లారే మార్గం ఎలా? ఒకవేళ వాళ్ళకింతవరకు యిలాంటి ఆలోచన రాకపోతే సూచనద్వారా తెలుపగలవాడు యాదగిరి. తనా అవకాశం జారవిడుచుకోవడం తెలివితక్కువతనమౌతుంది. తను మనసులో మధనపడుతున్నాడేగానీ, ప్రయత్నం చేయడంలేదుకదా!

"ఏంటయ్యా... నాలుగు కబుర్లు చెప్తావని వచ్చానుగానీ, నన్నీడ కూకోబెట్టి, నీ ఆలోచనలో నువ్వుండేందుకా" అన్నాడు యాదగిరి.

"యాదగిరీ... నా మంచిచెడ్డలు చెప్పుకునేందుకు నువ్వుతప్ప ఎవ్వరున్నారు? ఎవ్వరూ లేరు. అయితే నువ్వు నా చేతిలో చెయ్యేసి నా ఈ మాటలు ఎవ్వరితోనూ చెప్పనని మాటియ్యాలి" అన్నాడు.

"అదేంటయ్యా! నాకు కొడుకంటోడివి. నాతో కష్టం, సుఖం చెప్పుకో. నాతో మాటంటే, అది నూతిలో ఏసిన రాయిలాంటిదే" అన్నాడు యాదగిరి.

"నా గురించి నువ్వేమనుకుంటున్నావు. నిజంగా మొహమాటం లేకుండా చెప్పు" అన్నాడు.

యాదగిరి నిశితంగా మధువైపు చూశాడు. మధు దేనిగురించి బాధపడి, మధనపడుతున్నాడో కొంతవరకు అర్థమైంది. అయితే ప్రశ్న అతనిచేతనే వేయించి, సమాధానం రాబట్టాలి అని నిర్ణయించుకున్నాడు. అందుకు కొంత తను లౌక్యంగా వుండాలనుకున్నాడు.

"నీకేంటి బాబూ... బంగారమంటోడివి" అన్నాడు.

"అలా నన్ను పొగడమనికాదు. నేను బంగారంలాంటివాడినైతే నాబతుకిలా ఎందుకుంటుంది?"

"నీబతుకెలా వుందనుకుంటున్నావు?"

"ఏముంది? నాకంటూ ఓ కోరిక లేదు. ఒక అర్హత లేదు. నాలో ఎంత తెలివి వున్నా, ఎంత మంచివున్నా ఏం లాభం. డబ్బు లేదుకదా! డబ్బులేనివాణ్ణి ఎవ్వరూ లెక్కచేయరు. ఎవ్వరూ ఖాతరుచెయ్యరు" అన్నాడు.

"నీ మాటలు బాగానే వున్నాయిగానీ, నీ బాధ నాకు తెలవకుండా వుంది. ఏంటి, నిన్నెవరు లెక్కచెయ్యలేదూ? నీకు డబ్బు లేదన్నావు. నిజమే... కానీ డబ్బులేకపోవడం నీ తప్పుకాదుగానీ, అది లేదు లేదు అనడం తప్పు. డబ్బుకంటె గొప్పది మంచితనం, తెలివితేటలు. పక్కవాళ్ళకి సాయంచేసే గుణం" ఆగాడు.

మధు అసలు చెప్పదల్చుకున్నదానికి, చిలవలు పలవలు చేర్చి ఏదో దాస్తున్నాడని యాదగిరికి అర్థమైంది. ఆ దాస్తున్న సంగతి కూడా కొంతవరకు అర్థమైంది. అందుకె ఆ మాట బయటికి లాగాలని ప్రయత్నం మొదలుపెట్టాడు.

"నీకిప్పుడు అయ్యగారు కొండంత అండ. ఆయనకిప్పుడు నువ్వంటే ఎంతో యిష్టం. నిన్ను సదూకోమన్నారు. ఆయన వ్యవహారాలు చూసిపెట్టమన్నారు. డబ్బుకి నీకేమీ లోటుచెయ్యరు. ప్రేమకి లోటులేదు. సావిత్రమ్మ నిజంగా చల్లని తల్లి. నీకొచ్చిన కష్టం?"

"ఏం కష్టమా? డబ్బుకి లోటులేదా? ప్రేమకి లోటులేదా?"

"అవును. నువ్విలా వారి తలలో నాలికలా వుంటే మంచి పిల్లనిచ్చి పెళ్ళిచేసి దగ్గరెట్టుకుంటారు"

"ఆ... పెట్టుకుంటారు. వారిపిల్లనిచ్చి దగ్గర పెట్టుకోరుకదా" అని నాలుక జారాడు మధు.

యాదగిరి వులిక్కిపడ్డాడు. వెంటనే దొరికావుకదా దొరా అనుకున్నాడు మనసులో. ఒక్క క్షణం వెంటనే ఏం మాట్లాడలేకపోయాడు. గంభీరంగా అయిపోయాడు. మధు కూడా మాటజారినందుకు కంగారుపడ్డాడు. ఆ మాటని ఎలా దిద్దుకోవాలా అని తాపత్రయపడుతున్నాడు. అయితే తన మనసులో మాట బయటపడటమే మంచిదైందని ఓపక్కన అనిపిస్తూనేవుంది. భయంభయంగానూ వుంది.

"మధుబాబూ, నువ్వు చాలా చిన్నవాడవు కానీ చాలా పెద్ద ఊహలు వున్నాయి. ఊహలు పెద్దగా వుండటం మంచిదేకానీ మనకి తగని ఆలోచనలు మంచివి కాదు. అయ్యగారి మంచితనం నువ్వెంతవరకు తీసుకోవాలో




అంతవరకే తీసుకో. ఆదరించటం, ఆదుకోవడం వేరు. పిల్లనివ్వడం వేరు''

''ఇవ్వాలని కాదు. ఇస్తారా అని అన్నాను''

''నువ్వేమన్నా, నీ అభిప్రాయం నాకర్థమైంది. నామాట పూర్తిగా విను. మనింటికి తెచ్చుకునే పిల్లని పేదపిల్లని తెచ్చుకోవాలనీ, మన పిల్లని అయినింటిలో యివ్వాలనీ పెద్దలంటారు. తమ అల్లుడు గొప్పవాడు, బాగా చదువుకున్నవాడు, హొదాగలవాడూ అవ్వాలని కోరుకుంటారు. ఇవన్నీ కాకుండా...''

''నాలాంటి ఏమీ లేనివాడికెలా యిస్తారా? అంటావు. అంతేగా...?'' అన్నాడు మధు.

యాదగిరి నిశ్శబ్దంగా వూరుకున్నాడు.

''అవున్లే... నాకు డబ్బులేదు. పెద్ద చదువు లేదు. పెద్ద అందగాడినీ కాను. మరి నాకింత ఆశ వుండటం తప్పే'' అన్నాడు.

లేచి వెళ్ళబోతూ, ''మధుబాబూ... ఒక్కమాటమాత్రం చెప్తాను'' అన్నాడు.

మధు యాదగిరివైపు చూసి- ''ఏమాట ఎలా వున్నా మనమధ్య జరిగిన ఈ సంభాషణ ఎవ్వరికీ చెప్పకు. బాగుండదు'' అన్నాడు.

''ఆ భయం నీకు వద్దుగానీ, నీ అభిప్రాయం నా అభిప్రాయంగా అదనుచూసి అయ్యగారిచెవిలో వేస్తాను''

''వద్దు... వద్దు... అలాంటి పనిమాత్రం చెయ్యకు''

''లేదులేదు. నీవన్నట్లుగానీ, నీకా వూహ వున్నట్లుగానీ కాదు. లోకంలో ఎన్నో సంగతుల్లో ఇదీ ఒకటి అన్నట్లు. అయ్యా... ఈ యాదగిరి అంత తెలివితక్కువవాడనుకుంటున్నారా? ఎప్పుడు, ఎక్కడ, ఎలా మాట్లాడాలో తెలీదనుకుంటున్నారా?'' అన్నాడు.

''అబ్బే... నాకదేంలేదు. అయినా ఏమీ జరగనిదానికి ఎందుకీ రభస. ఏదో మనం మాట్లాడుకున్నాం... దాన్నలా సరిపెట్టేసుకుంటే పోతుందికదా అని'' నసిగాడు.

''అలాగే సరిపెట్టుకుందాము. నాకు వీలుచిక్కితే అప్పుడా మాట అనే వీలుంటేనే అంటాను. మీ మాటగానీ, మీ ఊసుగాని రాదు. సరేనా''

యాదగిరి లేచాడు.

మధు మనసులో ఒకరకమైన అలజడి మాయమై మరోరకమైన అలజడి మొదలైంది. పశ్చాత్తాపం అతన్ని మరింత కృంగదీయడం మొదలుపెట్టింది.

'అయ్యో! అనవసరమైన విషయం ఎత్తాను. యాదగిరి ఎంత మంచివాడైనా తరాలుగా రాఘవేంద్రరావు కుటుంబాన్ని, వంశాన్ని నమ్ముకుని, అంటిపెట్టుకుని వున్నవాడు. నిన్నగాక మొన్న వచ్చిన తనమీద అతనికేదో అభిమానం వుంటుందనుకోవడం తన తెలివితక్కువతనం.

అసలు యాదగిరి తనున్న గదిలోకి ఎందుకొచ్చినట్లు. గూఢాచారిలా వచ్చాడా? వచ్చి తనకి కావలసిన సమాచారం సంపాదించుకుని వెళ్ళిపోయాడా? అయితే తన తెలివి, సామర్థ్యం అన్నీ ఏమయ్యాయి?

యాదగిరి వచ్చి కదలించగానే మనసులోని బాధంతా చెప్పేశాడు తను. ఆ మాటలన్నీ రావుగారితో చెప్తే ఎలా? తననెలా చూస్తాడాయన? వెంటనే బయటకి గెంటేస్తాడు. ఇంట్లో తిని ఇంటివాసాలు లెక్కపెడతావా అని అడిగితే తనేం చెప్పగలడు?

తను నిజంగా అనుపమని అంతగా యిష్టపడుతున్నాడా? లేక నిజంగానే ఆమె వెనుకనున్న డబ్బుమీద వ్యామోహమా?

మధుకి తెల్లతెల్లవారుతుండగా నిద్రపట్టింది.

★ ★ ★

మూడు రోజులుగా మధు ఇంట్లో అందర్నీ తప్పించుకు తిరుగుతున్నాడు. ముఖ్యంగా రాఘవేంద్రరావు ఎదురు పడితే కుంచించుకుపోయి, భయంతో, తడబాటుతో పక్కకి తప్పుకుంటున్నాడు. యాదగిరి వంటరిగా కనిపిస్తే మరోసారి ఈ సంగతులు ఎత్తవద్దని హెచ్చరించుదామనుకున్నాడు. కానీ యాదగిరి అతనికి దొరకలేదు. కానీ, నెమ్మదిగా అందర్నీ పరిశీలించాక, అవాంఛనీయ పరిస్థితులు లేవని గ్రహించాడు. తను మాట్లాడిన విషయాలు వారికి తెలిసివుంటే వారలా వుండేవారుకాదు. కాబట్టి నిజంగా యాదగిరి ఆ మాటలు మనసులోనే పెట్టుకున్నాడు. అతను బయట

పెట్టలేదనే సంగతి నిర్ధారణవగానే మధు మనసులో మళ్ళీ ఆశ మొలకెత్తింది. ఒకవేళ వాళ్ళకలాంటి ఊహ రాలేదేమోనని. కానీ డబ్బు లేనివాడికి పిల్లని ఛస్తే యివ్వను అని ఆయన నోరారా అనడం తనే విన్నాడు కదా! మరింక ఆశ ఎందుకు?

మధులో చెలరేగుతున్న ఆలోచనలకి అర్థంపర్థంలేకుండా వుంది. అనుపమని పెళ్ళి చేసుకుని ఈ సామ్రాజ్యానికి రాజు నవ్వాలనే కోర్కె అతనికి క్రమక్రమంగా పెరుగుతోంది. అతనిలోని మనశ్శాంతిని హరిస్తోంది. అందని అందలాలకోసం అర్రులుచాస్తే, అది అశాంతే అని అతనికనిపించటంలేదు.

"మధూ...ఏమోయ్ మధూ!" కాస్త గట్టిగానే పిలిచాడు రావు. ఆ పిలుపులో ఆనందం, సంబరం వున్నాయి గానీ, అధికారం లేదు. మధు వచ్చి ఆయన ఎదురుగా నిలబడ్డాడు.



''ఇదిగో ఓ అరగంటలో మనం బస్తీ వెళ్తున్నాం. చాలా పనుంది'' అన్నాడు రావు, చేతిలోని వుత్తరం మళ్ళీ మళ్ళీ చదువుతూ-

''ఏమిటీ'' అంటూ సావిత్రి వచ్చింది.

''వాళ్ళు ఎల్లుండి వస్తున్నారు. నేను బస్తీవెళ్ళి తేవాల్సినవి తెస్తాను. ఏం కావాలో చెప్పు''

ఇద్దరూ అవనీ యివనీ, ఏవేవో చర్చించుకుని జాబితా తయారు చేసుకున్నారు ఇంతలో యాదగిరి వచ్చాడు.

''ఆ... వచ్చావా! కారు రెడీ చెయ్యమను. బస్తీ వెళ్దాం''

''అంతే? అయ్యా!''

''మరే. వాళ్ళు ఎల్లుండి అమ్మాయిని చూడటానికొస్తున్నారు. ఏర్పాట్లు ఘనంగా వుండాలి. అంటే మన సంప్రదాయంబద్ధంగా. అబ్బాయి వుంటున్నది అమెరికాలో అయినా, అన్నీ మన పద్ధతులేనట'' అన్నాడు రాఘవేంద్రరావు.

మధు మౌనంగా వుంటడం గమనించి, యాదగిరి కల్పించుకున్నాడు, ''ఏంటో మధు బాబుకి అర్థంకాలేదనుకుంటా మన అనుపమ్మకి పెళ్ళి వారొస్తారు'' అన్నాడు.

మధు ముఖంమీదకి నవ్వుతెచ్చుకున్నాడు.

''అదే... నాకు పూర్తిగా అర్థంకాలేదు'' అన్నాడు.

''అదే అనుకున్నా లేకపోతే అలా తెల్లమొగమేసేవాడివే కాదూ'' అంటూ చమత్కరించాడు యాదగిరి.

''నలుగురం వెళ్దాం''

బస్తీ వెళ్ళి, రకరకాల బుట్టలతో పళ్ళు, పువ్వులు ఎన్నో రకాల స్వీట్లు, ఇంకా ఇతరవస్తువులూ కొని చీకటిపడ్డాక ఇల్లు చేరారు.

అవన్నీ యాదగిరితోబాటు మధుకూడా జాగ్రత్తగా మోసి ఇంట్లోకి చేర్చాడు.

ఏదో జరిగిపోతున్న బాధ- ఏదీ ఆపలేని అశక్తత మధుని క్షణక్షణం క్రుంగదీస్తున్నాయి. ఇప్పుడు యాదగిరిమీద కూడా అతనికి గుర్రుగా వుంది. ''ఏం? ఆ విషయంలో రావుగారితో ఓ మాట అనిచూస్తేనేమి?'' అని.

తన సొంత అభిప్రాయంగా రావుగారితో అనొచ్చుకదా అని.

కానీ, ఏదీ చెప్పలేక మామూలుగా అన్ని పనులు చేసేస్తున్నాడు మధు.

★ ★ ★

చిన్నసైజు పెళ్ళిలాగే జరిగాయా పెళ్ళిచూపులు. ఇదే మొదటిసారి యిలాంటి ప్రయత్నం చేయడం రాఘవేంద్రరావుకి.

రాహుల్ తల్లి మాలతి, తండ్రి రఘురాం ఈ సంబంధానికి ఎంతో మోజు చూపించారు. దానికి తగినట్టుగా పిల్లాడికి పిల్ల నచ్చింది. అనుపమని అడిగితే 'మీ యిష్టం అంది' అంతే! అంతా నిశ్చయమైపోయింది.

ఒక్కరోజులో మధు ఊహసౌధాలు కూలిపోయాయి.

ఆ రాత్రి ఆ పెళ్ళికొడుకు రాహుల్‌తో తనను పోల్చిచూసుకున్నాడు. అతను రాజకుమారుడైతే తను సేవకుడిగా కూడా తగనని అతని ముఖం చెప్పినా, లోపలి అహంకారం ఎగిరెగిరి పడింది. మనిషికి కావలసింది రూపమేనా? గుణం కాదా?

గుణమే- కానీ రాహుల్ గుణంలేని వాడని ఎవరనగలరు?

ఓవారం రోజుల్లో ముహూర్తాలు పెట్టుకుంటారు. పదిహేను రోజుల్లో పెళ్ళి అయిపోతుంది. అతను నలభై రోజులు సెలవుపెట్టి వచ్చాడు.

మధు బరువుగా నిట్టూర్చాడు.

★ ★ ★

అనుపమ తోటలో పూలు కోస్తోంది. కనకాంబరాలు శ్రద్ధగా కోస్తోంది. ఆమె మనసు వుల్లాసంగా వుంది. సామాన్యమైన వూహలున్న శ్రీమంతుల ఏకైక బిడ్డ ఆమె. తల్లీదండ్రీ అన్నీ చూసి, ఆనందంగా, ఆర్భాటంగా కుదిర్చిన పెళ్ళి. పైగా రాహుల్ రూపం ఆ మనసులో మధురమైన ముద్రవేసుకుంది. కూనిరాగంతీస్తూ కులాసాగా పూలు కోస్తోంది. దూరంగా వున్న మధు అనుపమను చూశాడు. చకచక ఆమె దగ్గరకి వచ్చాడు.

ఏమిటన్నట్లు చూసింది అనుపమ.

''గొబ్బిపూలు కోసి పెట్టనా'' అన్నాడు.

''వద్దులే... ఈవేళ కనకాంబరాలు చాలా వున్నాయి. మరువం కలిపి మాల అల్లిపెట్టు




కుందామనీ'' అంది.

మరేం మాట్లాడటానికి మధుకి అవకాశం లేదు. కానీ ఆలస్యంచేస్తే, దొరికిన ఆ ఏకాంతం మళ్ళీ జన్మలో దొరకదు. అందుకే-

''పెళ్ళి కొడుకు నచ్చాడా!'' అన్నాడు.

ఆ మాటని చాలా మామూలుగా తీసుకుంది అనుపమ. అందుకే సమాధానం ఏమీ చెప్ప కుండా సిగ్గుపడింది. అతను చనువుకొద్దీ అడు గుతున్నాడని సరిపెట్టుకుంది. మధు మాత్రం అంతటితో ఆగలేదు.

''ఇష్టంలేకపోతే స్పష్టంగా చెప్పేయి. నిన్నె' వరూ బలవంతం చెయ్యరుగా'' అన్నాడు.

అతనొక వున్మాదిలా వున్నాడాక్షణంలో. అను పమ ఆశ్చర్యంతో నిశ్చేష్టురాలైపోయింది. ఆమె తేరుకునేసరికి అయిదు నిముషాలు పట్టింది.

''నాకలాంటివేమీలేవు. అమ్మా, నాన్నా యిష్టమే నా యిష్టం'' అంది. అప్పుడామె గొంతు జీరబోయింది.

''అయితే సరే గానీ...'' మధు మాటపూర్తికా కుండానే దూరంగా యాదగిరి వస్తూ కని పించాడు.

మరింక మధు మాట్లాడలేదు. కానీ అప్పటి కే అనుపమ ముఖం కళావిహీనమైంది. అంత కుపూర్వం ఆమె ముఖంలో తాండవిస్తున్న ఒక అందం, ఒక ఆనందం, ఒక మధురమైన భావం చటుక్కున స్విచ్ ఆఫ్ చేసినట్లు మాయమయ్యాయి. అది మధు గమనించా డు, కానీ అతనందుకు బాధపడలేదు. తప్పే ముంది? అడిగిన దానిలో పొరబాటేముంది? అనే ధోరణిలో ఏమీ జరగనట్లు అక్కణ్నించి కదిలి వెళ్ళిపోయాడు. అనుపమ మొదటిసా రిగా మధు గురించి ఆలోచించటం మొదలు పెట్టింది. మధుని చూసిన మొదటిక్షణంలో అతనిమీద జాలి కలిగింది. తమింట్లో ఆశ్రయం కోరివచ్చిన పేద కుర్రాడిగానే ఆమె మనసులో ముద్రపడింది. ఎప్పుడూ అతన్ని తమ వ్యవహారాలు చూసే గుమాస్తాగానూ, తాను యజమానురాలిగానే చూసిందిగానీ, మరో ఊహలేదు, రాలేదు.

మధు రూపం గురించి కూడా ఆలో చించింది. చూస్తే, మళ్ళీ చూడాలనిపించే రూపం కాదు అతనిది. మరి తనే విధంగా అతని యందు ఆకర్షితురాలవుతుందనుకు న్నాడు?

అనుపమ ఎవ్వరితోనూ యీ సంభాషణ చెప్పలేదు. ఒక్కరోజు కాస్త ఆలోచించి ఆ తర్వాత మర్చిపోయి, మామూలు హడావిడిలో పడిపోయింది.

★ ★ ★

పదిహేను రోజులవ్యవధిలో అనుపమ, రాహుల్‌ల వివాహం అత్యంతవైభవంగా జరి గిపోయింది. గొప్ప చదువు, మంచి హోదా, రూపమూ, గుణమూ వున్న అల్లుడు దొరికి నందుకు రాఘవేంద్రరావు- సావిత్రి ఆనంది స్తూనే తమ పిల్ల దూరంగా వెళ్ళిపోతుందనే దిగులు కూడా పెట్టుకున్నారు. అల్లుడు కూతు రూ ఆనందంగా యింట్లో తిరుగుతుంటే ము సలి తల్లిదండ్రులు మురిసిపోయారు. పెళ్ళి హడావిడి అంతా రాజారావూ, నళినీ చేశారు. శ్రమంతా యాదగిరి, మధూ పడ్డారు. ఆ ఏర్పా ట్లకు సావిత్రీ రావుగారూ పొగుడుతూనే వున్నా మధుమాత్రం గంభీరంగా వుండిపోయాడు. మనసులో ఏర్పడిన బాధని మరో మానవుడికి తెలియకుండా కప్పెట్టేశాడు.

★ ★ ★

ఆరోజు రాహుల్ అమెరికా ప్రయాణం బొంబాయిమీదుగా. అతను మరొక మూడు నెలల్లో వచ్చి అనుపమను తీసుకెళ్ళిపోతాడు.

అయితే రాజారావు, రాఘవేంద్రరావు అత నికి శాశ్వతంగా ఇండియా వచ్చేవిషయం ఆలో చించమని చెప్పారు. అతనూ ఆలోచిస్తానన్నా డు. ఇక్కడైనా అతనికి వుద్యోగం రావడం, సెటిల్ అవడం కష్టమేమీ కాదు.

నెల్లాళ్ళ దాంపత్యజీవితంలో రాహుల్, అనుపమలు ఒకరికొకరు ప్రాణంగా అయిపో యారు. అతను వదిలివెళతాడంటే అనుపమ తట్టుకోలేకుండా వుంది. ఆమెకి అంత తొంద రలో వీసా దొరకనందువల్ల అతనొక్కడూ వెళ్ళ క తప్పలేదు.

భర్తని వదల్లేక విలవిల్లాడింది అనుపమ.

అల్లుడు అమెరికా వెళ్తున్నా అప్పుడే కూతురు తమని వదిలి వెళ్లడం లేదని కాస్త వూరటచెందారు సావిత్రి, రాఘవేంద్రరావు.

బొంబాయివరకు వెళ్ళి వీడ్కోలు చెప్పి వచ్చింది అనుపమ.

★ ★ ★

మనసు ప్రేమించేటప్పుడు అర్హత గురించి, అవకాశం గురించి ఆలోచించదు. ఒక వ్యక్తి మీద విచిత్రంగా ఏర్పడే మోజుకి అర్థం వుండదనడానికి మధు పెంచుకున్న ఆశలు- అతను వాటిని చంపుకోలేక బాధ పడటమే నిదర్శనాలు.

అనుపమకి పెళ్ళయినప్పటినుండి అతనిలో ఒక రకమైన కసి, ద్వేషం, ఈర్ష్య, అసూయ తలెత్తుతూనే వున్నాయి. వాటికి అర్థంలేదని అతనికప్పుడప్పుడు అనిపించినా, వాటినుండి బయటపడటం అతని వల్ల కాలేదు.

అనుపమ నిజానికి మధుని, అతని ప్రవర్తనని సీరియస్‌గా ఎప్పుడూ పట్టించుకోలేదు. అతను తన వివాహానికి ముందు అన్నమాటలు కూడా ఆమె క్రమంగా మర్చిపోయిందే గానీ, గుర్తుంచుకోలేదు. వీటన్నిటినీ మరపింపజేసే గొప్ప మధురమైన ఊహల్లో ఆమె మునిగివుంది. అందమైన అనుపమ రూపం రోజురోజుకీ మరీ అందంగా తయారవసాగింది.

కూతురు ముఖంలో కొట్టవచ్చినట్లు కనిపించిన కొత్త అందాలు చూసి సావిత్రి మురిసిపోయింది. వారూహించినట్లే అనుపమకి నెల తప్పింది. వారం రోజులు గడిచేసరికి రాఘవేంద్రరావు, సావిత్రి పొందిన ఆనందం ఇంతా అంతా కాదు. ఆమెను డాక్టరు దగ్గరకి తీసుకెళ్ళారు. ఆమె నిర్ధారణ చేస్తూ ఏవో మందులు యిస్తూ, కొన్ని జాగ్రత్తలు చెప్పింది. రాహుల్ రాసిన వుత్తరాలు చదువుకుని, తన భావాలు లేఖలలో రాస్తూ గడిపేస్తోంది అనుపమ.

మధు మానసిక స్థితి మరీ అధ్వాన్నమైంది. అతను నిజంగా అనుపమని ప్రేమించాడా అనే ప్రశ్నవేస్తే, సమాధానం చెప్పడం కష్టం. ఎందుకంటే ప్రేమించిన వ్యక్తి యొక్క సుఖసౌఖ్యాలను కోరుకోవడం నిజమైన ప్రేమ లక్షణం, కానీ అదేం దురదృష్టమోగానీ, మధుకి అనుపమని చూస్తే విచిత్రమైన కలగాపులగమైన భావాలు వస్తాయి. వాటిలో ప్రధానమైనది కసి. కానీ ఆ భావాలు ఎవ్వరికీ తెలియవు. అతనెవ్వరికీ చెప్పడు! చెప్పడానికి అవి బావకి అందే విషయాలూ కావు. అందుకే పైకి అంతా సజావుగానే సాగిపోతోంది కాలం. నళిని, రాజారావు వచ్చి కొన్నాళ్ళు అక్కడే వున్నారు. ఇల్లంతా ఆనందనిలయంలా వుంది.

★ ★ ★

అనుపమ భర్త దగ్గరనుండి వచ్చే ఉత్తరాల ద్వారా ఎంతో ఆనందం, తృప్తీ పొందుతోంది. అతను ఇంకో మూడునెలల్లో వస్తాడు. వచ్చి తనని తీసుకెళ్తాడు. ఆకాశంలో హంసల్లా తామిద్దరూ ఎగిరి దూరతీరాలకు వెళ్ళిపోవచ్చు. ఏ ఆంక్షలు లేని స్వర్గలోకాల్లో విహరించవచ్చు. ఆ దేశం ఎంతో అందంగా, భోగభాగ్యాలతో తులతూగుతుందట! ఎత్తయిన భవంతులు, చిత్ర విచిత్రాలు, అద్భుతాలు అక్కడెన్నో వున్నాయట. అవన్నీ రాహుల్ ఎంత అందంగా రాస్తున్నాడు? ఆ లేఖ చదువుతుంటే కన్నుల ముందున్నట్లే వుంది. అక్కడ తమకున్న ఇల్లు, ముందున్న లాన్, కారు - అవన్నీ ఫోటోల్లో ఎంతో అందంగా వున్నాయి. తనకే రెక్కలుంటే ఎగిరివెళ్ళిపోయేదే!

అనుపమ రాత్రిళ్ళూ పగలూ కూడా కలలు కంటూ జీవిస్తోంది.

ఇప్పుడు అనుపమకి నాలుగునెలలు నిండి అయిదోనెల వచ్చింది.

"పురిటిముందు ఎలా పంపుతామండీ?" అంది సావిత్రి.

"నిజమే కానీ, అతనొస్తున్నది అనుపమని తీసుకెళ్ళేందుకే"

"మరెలాగూ?"

"అతను ఉత్తరం రాశాడు చూశావుగా... భయపడాల్సిందేమీలేదుట. ఇక్కడకంటే అక్కడే ఎక్కువ వైద్యసదుపాయాలుంటాయి"

"అయినా మొదటిసారి..."

"అయితే ఏమంటావు?"

"ఏకంగా పురుడొచ్చాక పంపిస్తే"

"చాల్లే నీ తెలివి. అల్లుడు వస్తున్నది అమెరికా నుండి. ఆకిరిపల్లినుంచి కాదు. ఒక్కసారి వచ్చి వెళ్తే ఎంత ఖర్చు అవుతుందో తెలుసా?"




రాఘవేంద్రరావు గదమాయించేసరికి సావిత్రి మారుమాట్లాడలేదు.

ఆరోజు అనుపమ మరింత ఉత్సాహంగా వుంది. ఒళ్ళు బరువుగా వున్నా మనసు ఆనందంతో దూదిపింజలా తేలిపోతోంది.

తెల్లారేసరికి రాహుల్ ఇండియా చేరుతాడు. మద్రాసునుండి ఇక్కడికి రావడానికి ఓహ్... ఎన్నిగంటలు తను ఎదురుచూడాలో...??

మేడమీద గదిలో పట్టీపట్టని నిద్రలో మత్తుగా పడుకుంది అనుపమ.

ఒక్కసారి వులిక్కిపడి లేచింది. డొక్కలో కలుక్కుమంది. కింద హాల్లో గోలగా ఏదో మాటలు. ఏడుపు స్వరం. చకచక గది బయటకొచ్చి కిందికి చూసింది. తల్లి గుండెలు బాదుకుంటూ అయ్యో అయ్యో నాయనో... ఇదేం ఘోరం అంటోంది. తండ్రి కండువా ముఖాని కడ్డు పెట్టుకుని భోరున బొంగురు కంఠంతో దుఃఖిస్తున్నాడు. అనుపమకి గుండె ఆగినంత పనైంది.

''అమ్మా!'' అది పిలుపో, అరుపో చెప్పడం కష్టం.

''అయ్యో నా తల్లీ... అంతా అయిపోయిందే'' అంటూ గట్టిగా ఏడుపందుకుంది సావిత్రి. అనుపమకేమీ అర్థం కాలేదు. గుండెలు దుఃఖంతో గుబగుబలాడాయి. కాళ్ళు తడబడ్డాయి. గబగబా మెట్లుదిగి కింద కొచ్చింది. అక్కడే విషాదంగా నిల్చున్న రాజారావుని చూసి, ''అన్నయ్యా'' అంది.

కళ్ళ నీళ్ళు ఆపుకుంటూ ''నీకింత అన్యాయం జరుగుతుందని కలలో కూడా అనుకోలేదమ్మా అనూ'' అంటూ ముఖం దాచుకున్నాడు.

''ఏమిటన్నయ్యా! ఏమైంది'' అంది అయోమయంగా.

''అమెరికాలో బయలుదేరిన విమానం మధ్యలో సముద్రంలో కూలిపోయింది తల్లీ... మన రాహుల్ మనకి దక్కకుండా సముద్రం మింగేసింది తల్లీ'' అన్నాడు రాఘవేంద్రరావు.

''నాన్నా...'' అంటూ తండ్రిని చుట్టుకుపోయింది అనుపమ.

సోఫాలో వాలిపోతున్న సావిత్రి ఎడంచెయ్యి ఎడంకాలు దడదడ లాడుతూ, మూతి వంకర్లు తిరిగిపోవడం, అప్పుడే అక్కడికొచ్చిన మధు చూశాడు. ఒక్క పరుగున ఆమెదగ్గరకి చేరుకుని గట్టిగా పట్టుకున్నాడు, అంతలోనే రాజారావు చూశాడు.

సావిత్రికి పక్షవాతం వచ్చినట్లుంది. మాటపడిపోయింది, ఒకచెయ్యి ఒకకాలు చచ్చుపడిపోయాయి.

ఊరు ఊరంతా అప్పుడా ఇంటివాకిట్లోనే వుంది. ఆకాశమంత పందిరేసి, అపురూపంగా కూతురి పెళ్ళిచేసి ఇంకా ఆర్నెల్లు కూడా కాలేదు. అంతలోనే అల్లుడి అకాలమరణం అందర్నీ దుఃఖంలో ముంచేసింది. రాఘవేంద్రరావు అందరితోనూ మంచిగా వుండి, నలుగురికీ సాయంచేస్తూ, ఆపదలో వున్నవాళ్ళని ఆదుకుంటూ ఆ వూర్లో వున్న జనంలో మంచిపేరు పొందాడు.

''ధర్మరాజంటి ఆయనకేంటి ఇంత కష్టమొచ్చింది?'' అంటూ అందరూ విచారిస్తూనే ఆశ్చర్యపోతున్నారు.

చీమకైనా హాని తలపెట్టని ధర్మప్రభువు గుండె జారిపోయింది''

★ ★ ★

మూడురోజులైా అనుపమ పచ్చి మంచినీళ్ళు ముట్టలేదు. ఆమె ఏడుపుని ఎవ్వరూ ఆపలేకుండా వున్నారు. ఆమె దగ్గరకి వెళ్ళి ఏదైనా తినమని, తాగమని చెప్పడానికి ఎవ్వరికీ ధైర్యం చాలడంలేదు. నళినీ ఎంతో ఓదార్చడానికి ప్రయత్నించి చేతకాక వూరుకుంది.

మూడోరోజు, విమాన ప్రమాదంలో మరణించిన వారందరి పేర్లూ ధృవీకరించారు. రాజారావు మనసులో ఎక్కడో మినుకు మినుకుమంటున్న ఆశ ఆరిపోయింది. అతనా విమానంలో బయలుదేరలేదని వార్త వస్తే ఎంత బాగుండును అని అతనెంతో ఎదురుచూశాడు. కానీ రాజారావుకి నిరాశే ఎదురైంది.

రాత్రి ఎనిమిదిగంటలైంది.

సావిత్రిని పట్నం హాస్పటల్లో చేర్చారు. నళిని బాధని దిగమింగి అన్నీ తనే చూస్తోంది.

ఆమెకి అనుపమ గురించి మరీ బెంగగా వుంది. అప్పుడొచ్చి అడిగాడు మధు, "నళిని గారూ! ఒకచిన్న గ్లాసుతో పాలు ఇవ్వండి అనుపమకిస్తాను" అని.

నళినికి ప్రాణం లేచివచ్చినట్లనిపించింది.

"మా నాయనే! ఇదిగో, నీకు పుణ్యముంటుంది. ఈ గుక్కెడు పాలూ తాగించు నాయనా! నేను చచ్చి నీకడుపున పుడతాను" అంది ఆవేదనగా. ఆమె అలా నిరాశాగా మాట్లాడటం మధు ఎప్పుడూ వినలేదు.

"అదే నా బాధ. అలా వదిలేస్తే ఎంత కష్టం. అసలే వట్టిమనిషి కూడా కాదు" అన్నాడు. అతనంత ఆరిందాతనంగా మాట్లాడటం నళిని వినలేదు ఇంతకుపూర్వం.

వెంటనే ఒక గ్లాసుతో పాలు తెచ్చి ఇచ్చింది. నెమ్మదిగా అనుపమ గదిలో అడుగుపెట్టాడు మధు. ఆమె నీరసంగా సొమ్మసిల్లి పడివున్నట్లుగా వుంది. ఏడ్చేందుకు ఓపిక నశించిపోయింది. కళ్ళలో కన్నీళ్ళు ఇంకిపోయాయి. మధు ఆమె దగ్గరగా వెళ్ళి "అనుపమా" అని నెమ్మదిగా పిలిచాడు.

ఆమె నీరసంగా కళ్ళు తెరిచింది. ఆమె నిద్రపోవడంలేదని మధు గ్రహించాడు.

"ఈ కాసిని పాలు తాగు అనుపమా" అన్నాడు. అతని కంఠం మృదువుగా వుంది.

ఆమె ఏమీ మాట్లాడకుండా చేత్తో వద్దని సైగచేసి చెప్పింది.

అతనూరుకోలేదు. "నా మాట విను. ఎంత నీరసించిపోయావో చూడు" అన్నాడు లాలనగా.

"ఏం ఫర్వాలేదులే మధూ. నాకేం తాగాలనీ, తినాలనీ లేదు. ప్లీజ్! నన్ను ఇబ్బంది పెట్టకు" అంది అనుపమ. ఏడ్చి ఏడ్చి ఆమె రొంప భారంతో వుంది. గొంతు కూడా జీరబోయింది.

మధు నెమ్మదిగా అనుపమ పక్కనే కూర్చుని మరింత మృదువుగా అన్నాడు-

"నీ గురించే కాదు. నీ కడుపులో వున్న బిడ్డ గురించి కూడా నువ్వు ఆలోచించాలి" మానుతున్నగాయం రేగినట్లయింది. తన కడుపులో బిడ్డ గురించి వినగానే స్తబ్దుగా వున్న ఆమెలోని బాధ చైతన్యంపొంది, దుఃఖమై తెరలు తెరలుగా పైకి వచ్చి కుదిపేయడం మొదలుపెట్టింది. మధు తన చేతిలో పాలగ్లాసు అక్కడే వున్న టేబులుమీద పెట్టి "చూడు అనుపమా! ఈ దుఃఖానికి అంతం అంటూ వుందా" అన్నాడు.

అనుపమ అతని రెండు చేతుల్లో తల పెట్టి భోరుభోరున ఏడ్చింది.

అసహాయురాలైన అనుపమ తన చేతుల్లో వాలి అలా ఏడుస్తుంటే మధు మనసు గుబగుబలాడింది. ఒక విచిత్రమైన అనుభూతి అది. తనెంతో కోరుకున్న అనుపమ తనకెంతో దగ్గరగా, కానీ గుండెలుపగిలే దుఃఖం తలకు మించిన బరువైన బాధ.

అలా ఒక అయిదునిమిషాలు ఏడుస్తూండిపోయింది అనుపమ. ఆమె అలా ఏడుస్తున్నప్పుడు మధు మరేం మాట్లాడలేదు. తను చీమంత కదిలినా అనువమ తేరుకుంటుందనీ, అలా కొంతసేపు తన చేతుల్లో వుంటే బాగుండుననీ ఏవేవో తెలీని భావాలతో, మధు అలాగే వుండిపోయాడు.

నెమ్మదిగా అనుపమ తేరుకుంది. ముఖం వాచి, కళ్ళు వాచి వికృతంగా వుందామె.

"ఎందుకు మధూ, నాకు బతకాలనే లేదు. నేనెవ్వరి కోసమూ ఏమీ చెయ్యలేను. దయచేసి నన్ను చచ్చిపోనీ, వీలుంటే ఇంత విషం తెచ్చి నాకివ్వు" అంది ఏడుస్తూనే. మధు నెమ్మదిగా అనుపమ తలపై చెయ్యివేసి నిమిరాడు. ఆ ఓదార్పువల్ల మళ్ళీ కట్టలు తెంచుకుంది దుఃఖం. ఆమె తల తన గుండెల కానించుకుని ఆమెని ఓదార్చాడు. ఆమె అలాగే ఒదిగి మనసారా ఏడ్చింది.

మధు నెమ్మదిగా పాలు అందుకుని ఆమెకిచ్చి తాగమన్నాడు. ఏమనుకుందో... అందుకుని నెమ్మదిగా రెండు గుక్కలు తాగి "ఏమిటీ దారుణం? ఎవ్వరేమైపోయినా, మనిషి ఏలాగోలాగా బతకాల్సిందేనా" అంది.

"ఇది జీవితం అనుపమా!" అని మళ్ళీ బతిమాలి బతిమాలి, ఆ కాసిని పాలూ తాగించాడు. ఆమె మళ్ళీ మంచంమీద ఒరిగింది.




అప్పుడే వచ్చింది నళిని. మధు అనుపమ తలగడ సవరించాడు. 'తాగిందా' అని కను సైగ చేసింది నళిని. పూర్తయినట్లు చెప్పాడు. మధు మౌనంగా.

'హమ్మయ్య' అన్నట్లు ఊపిరిపీల్చుకుంది నళిని. మధు బయటకొచ్చాక అంది-

"నువ్వూ మూడునాళ్ళుగా పచ్చి మంచినీళ్ళు ముట్టలేదు. రా నాయనా... ఏదో రెండు మెతుకులు తిందువుగానీ"

మధు ఆమె వెంట నడిచాడు.



సావిత్రి పూర్తిగా మంచం పట్టేసింది. కాలూ, చెయ్యీ ఆడటం లేదు. నోట్లోంచి మాటరావడంలేదు. కళ్ళల్లోంచి నీరు మాత్రం ధారగా కారుతోంది. ఆమె పడుతున్న మూగవేదన చూసి ఇంట్లో అందరూ కుమిలిపోతున్నారు. రాహుల్ తరపువారు ఎవ్వరూ రాలేదు. వార్తాహరులు మాత్రమే వచ్చారు. అక్కడతని తల్లిదండ్రులు పుట్టెడు దుఃఖంలో కుమిలిపోతున్నారు. రాఘవేంద్రరావుకి ఒక్కసారి పది సంవత్సరాల వయసు మీదపడినట్లయింది. నలుగురు మనుషులు తోడురాగా మర్యాద కోసం వియ్యాలవారింటికి వెళ్ళాడు. కానీ ఎవరి దుఃఖం వారిది. చెట్టంత కొడుకుపోయిన వారి బాధని తీర్చేందుకు అతనికి శక్తి ఎక్కడిది? జీవచ్ఛవమైన తన కన్నకూతురు కళ్ళల్లో మెదులుతుంటే మరొకళ్ళని ఓదార్చే శక్తి ఎక్కడినుంచి తెచ్చుకుంటాడు?

కానీ అక్కడ వాతావరణంలో అతనికి మరింత బాధ కలిగించిన విషయం మరొకటి తటస్థపడింది. అది - అనుపమ జాతకఫలమే రాహుల్ మరణానికి కారణం అన్నట్లు వారు బాధపడుతున్నారని విని మరీ కృంగిపోయాడు రాఘవేంద్రరావు. తనింత దురదృష్టవంతుడయి, ఇంతమాట పడినందుకు విలవిల్లాడిపోయాడు. లేక లేక వయసు మళ్ళిపోయాక పుట్టింది అనుపమ. ఆమె అదృష్టవంతురాలనీ, తమ జన్మ తరించిందనీ అనుకున్నారేగానీ, ఇలాంటి దుర్ఘటన కనీసం కలలోకూడా వూహించలేదు.

అనుపమ అస్సలు వీధిముఖం చూడటమే మానేసింది. ఎప్పుడూ గదిలో చీకట్లో కూర్చుని వుండిపోయేది.

రాహుల్ చనిపోయాక వచ్చిన డబ్బంతా నేరుగా అనుపమకి వచ్చిచేరింది. ఎన్నిలక్షలు పెట్టినా ఒక్క మనిషిని కొనితేలేము కదా అని అందరూ దుఃఖపడ్డారు.

అనుపమకి నెలలు నిండుతున్నకొద్దీ, రోజుకొకసారి లేడీ డాక్టరు వచ్చి చూసివెళ్ళే ఏర్పాటు జరిగింది.

ఆమె శారీరకంగా ఆరోగ్యంగానే, సవ్యంగానే వున్నా మానసికంగా బాగా కృంగిపోయింది. ఆమెని అనునిత్యం అంటిపెట్టుకుని వున్న వ్యక్తి మధు. ఈ కష్టసమయంలో మధు ఆ ఇంట్లో ఒక ముఖ్యమైన సభ్యుడే అయ్యాడు గానీ దూరపుబంధువుగా, జీతానికున్న గుమాస్తాగా లేడు. అనుపమ మనసులో ఆలోచనలన్నీ అడుగంటిపోయాయి. ఒకనెల్లాళ్ళలో పెళ్ళిచూపులు, పెళ్ళి, భర్తతో విడదీయరాని బంధమూ అన్నీ ఏర్పడి అంతలోనే అన్నీ తెగిపోయాయి. కానీ బరువుగా, కడుపులో కదిలే ప్రాణి తన వునికినీ తన గతాన్నీ గుర్తుచేస్తూ వుంది. ఆ బిడ్డని తాకినట్లు తన పొట్టమీద నిమురుకుని ఏదో అనిర్వచనీయమైన తృప్తిని పొందుతూ వుంది అనుపమ.

అనుపమ తన అలంకరణలన్నీ తీసేసింది. చేతులకున్న మట్టిగాజులు తీసేసి చెరో బంగారు గాజూ మాత్రం వుంచుకుంది. ఆడంబరంగా వుండే బట్టలు కట్టుకోవడం మానేసింది. జుట్టు దువ్వుకునే శ్రద్ధలేదు. నళిని అప్పుడప్పుడు కొప్పడి తనే కూర్చుని చిక్కుతీసి తల దువ్వేది. అంతే ఆ తర్వాత

అనుపమ వేలిముడి వేసుకుని పడుకునేది. ఇదంతా గమనిస్తున్న రాఘవేంద్రరావు గుండె మండే కుంపటిలా భగభగలాడేది. ఏం చెయ్యాలి? ఏం చెయ్యాలి?

ఒకరోజున అనుపమతో లాలనగా చెప్పాడు. తల్లీ! నువ్విలా కళాహీనంగా యింట్లో తిరిగితే నేను చూడలేనమ్మా! జరిగిందేదో జరిగింది నువ్వు మామూలుగా చీర కట్టుకో బొట్టుపెట్టుకో, గాజులేసుకో, అంతే నే కోరేది'' అన్నాడు కన్నీళ్ళతో.

అనుపమ తండ్రిమాటలకి కదలిపోయింది. ఆమె మనసు విలవిల్లాడిపోయింది. కానీ ఏం చెయ్యలేకపోయింది.

ఆరోజు డాక్టరమ్మ దగ్గరకి మధు వెళ్ళాడు. అతని మనసు, ఆలోచనా, విచిత్రధోరణిలో పరుగెడుతున్నాయి. అనుపమ దుఃఖం చూస్తే బాధ, ఆమె తనకంతదగ్గరగా వుందనే ఆనందం. అనుపమకిలా అవడం ఒకవిధంగా మంచిదే లేకుంటే తనిలా ఆమె సాన్నిహిత్యాన్ని పొందేవాడేకాదు, అనే వూహ అతనికి తరుచు వచ్చేది.

రాఘవేంద్రరావుకి నమ్మకమైన సాటివాడిగా ఇప్పుడు మధు ఒక్కడే మిగిలాడు. రెండునెలలు శలవుమీద ఇక్కడవున్న రాజారావు, నళిని ఆ క్రితం రోజునే వెళ్ళారు. ఇంట్లో నౌకర్లు వంటామె వున్నా నిజంగా ఆ ఇంట్లో రోగిష్టి సావిత్రి, శోకదేవతలా అనుపమ, నలిగిపోయి చిక్కి సగమైన రాఘవేంద్రరావు వీరందరకీ పెద్దదిక్కు అండ మధు ఒక్కడే.

''అనుపమకి ఏడో నెల వచ్చింది. అంతా నవ్యంగా వుంది. ఆమె నీరసపడకుండా ఆహారం తీసుకునేలా చూడండి'' అని చెప్పింది డాక్టర్.

మధు వస్తూ రెండు డజన్ల ఎర్రటి గాజులు, మిలమిల మెరిసే ఎర్రటి గాజులు- జరీ అంచున్న ఆకు పచ్చని వెంకటగిరి చీర పట్టుకొచ్చాడు. అవి అనుపమకివ్వాలి. కానీ ఇచ్చినప్పుడు అనుపమ ఎలా ప్రతిస్పందిస్తుందో వూహించలేని విషయంకాదు. కానీ... ఆమెకవి యివ్వాలి. ఆమె వాటిని ధరించేలా చెయ్యాలి. తన గదిలో బల్లమీద పెట్టి వాటివంకే చూస్తూ ఆలోచిస్తున్నాడు. ఏం చెయ్యాలి? అసలు ఎటువైపునుండి మొదలుపెట్టాలి. మార్గమేటు వుంది? అసలు మార్గమంటూ వుందా? ఏమో? కానీ... మనసుంటే మార్గమదే కనిపిస్తుంది.

సరిగ్గా అప్పుడే వచ్చాడు యాదగిరి. అతన్ని చూసి మధు వులిక్కిపడ్డాడు. ఎందుకో కొంత చిన్నతనంగా కూడా అనిపించింది. ఆ గాజులు, చీర లోపల దాచేద్దామనిపించింది. కానీ అసహ్యంగా వుంటుందని వూరుకున్నాడు.

''మధుబాబూ ఏమిటలా ఆలోచనలో కూర్చున్నారు?'' అంటూనే బల్లమీదవున్నవి చూసి, ఏమీ అర్థంకాక ప్రశ్నార్థకంగా మధు వైపు చూస్తూండిపోయాడు.

''యాదగిరీ!'' అన్నాడు.

''చెప్పండి'' అన్నాడు యాదగిరి.

''అనుపమ మళ్ళీ మనుమల్లో పడాలి'' అన్నాడు మధు.

యాదగిరి మౌనంగా తలొంచుకున్నాడు. మధు కూడా వెంటనే మాట్లాడలేదు. అతనేం చెప్పాలనుకున్నాడో స్పష్టంగా అతని మనసులో లేదు. అందుకే ఎలా మొదలుపెట్టాలో అర్థంకావడంలేదు. తటపటాయిస్తూ కూర్చుండిపోయాడు. అప్పుడు యాదగిరి-

''అవును బాబూ! ఏదో ఒకటి చెయ్యాలి. అనుపమమ్మని మామూలుగా చెయ్యాలి'' అన్నాడు.

మధుకి ధైర్యం వచ్చింది.

''యాదగిరీ, ఇవి అనుపమకి యివ్వాలని ఆమె వేషం మళ్ళీ పూర్వంలా మార్చాలని ఆలోచిస్తున్నా'' అన్నాడు. యాదగిరి కళ్ళల్లో మెచ్చుకోలు, ఆనందం ఒకేసారి మెరిశాయి.

''తప్పకుండా చెయ్యి, కానీ ఆయమ్మ ఒప్పుకుంటుందా?''

''నిజమే ముందు ఒప్పుకోదు- కానీ వొప్పించాలి. ఎవరో ఒక బాటసారిలా వచ్చి కొన్నాళ్ళు మజిలీచేసి వెళ్ళిపోయిన వారికోసం జీవితమంతా మోడులా వుండిపోవాలనడం న్యాయమా?'' అతని మాటల్లోని ఆవేశం యాదగిరికి అర్థమైంది. అసలు అనుపమ ఈ విధంగా అయిపోవడానికి తనూ కారణమా! తను రావుగారితో మధుగురించి గట్టిగా అని




# క్యాప్సూల్స్‌తో బికినీ!




## సచిత్ర విచిత్రం

అందమె ఆనందం అన్నారు పెద్దలు. "మరి ఆ అందాన్ని పొందాలంటే ఆరోగ్యంగా ఉండాలిగదా?" అంటోంది అమెరికాకు చెందిన నౌరాహేడెన్ అనే అందాల సుందరి. ఆరోగ్యాన్నీ బలాన్నీ చేకూర్చే టానిక్కులు, విటమినైజ్డ్ క్యాప్సూల్సు తయారు చేసే కంపెనీకి చెందిన నౌరా తమ ఉత్పత్తుల ప్రచారంలో భాగంగా కేవలం క్యాప్సూల్స్‌తో తయారైన 'బికినీ'ని, 'బ్రా'ని ధరించి పబ్లిసిటీరంగంలో సంచలనం సృష్టించింది. ఆ సమయంలో తనని ఇంటర్వ్యూ చేసిన జర్నలిస్టులతో- "ఆరోగ్యం కోసం అంటూ నా బికినీని ఇప్పుడే ఊడబీకి తలొక క్యాప్సూలు మింగేయకండయ్యా బాబూ" అంటూ జోకులేసిందట ఆమె.

తమ ఉత్పత్తుల్ని కొన్నవారికి క్యాప్సూల్ బ్రా, బికినీలతోనున్న 'నౌరా' పోస్టర్‌ని ఉచితంగా ఇస్తున్నారట ఆ కంపెనీవారు.

వుంటే, అంటే- అంటే మాత్రం, మొన్నటిదాకా అనుపమ ఆకాశంలో ఎగిరే రాజహంస. ఈనాడది రెక్కలు తెగి నేలకొరిగింది. కానీ అది రాజహంసే, తనెలా ఈఘోరం ముందుగా వూహించగలడు? ఇప్పుడేదైనా చెయ్యాలంటే సాయంచెయ్యగలడు. అతని ఆలోచనలు ఊగిసలాడుతున్నాయి.

"సరే... నువ్వు ఆమె దగ్గరకెళ్ళి మాట్లాడు అంటే ఏమీ వద్దు- ఈ కోక కట్టుకోమని, ఈ గాజులు తీసుకోమని చెప్పు- చూద్దాం"

మధు లేచాడు. అనుపమ గది తలుపులు వోరవాకిలిగా వేసివున్నాయి. నెమ్మదిగా తెరుచుకుని లోపలికి అడుగుపెట్టాడు.

అనుపమ కళ్ళెత్తి అతన్ని చూసింది. కానీ వెంటనే పలకరించలేదు. ఆమె కళ్ళు గాజుకళ్ళలా వున్నాయి. అవి ఎక్కడో లోకాల్లో విహరిస్తున్నాయి. వాటిలో వున్న ఏ భావమూ ఎవ్వరికీ అర్థంకాదు.

మధు నెమ్మదిగా అనుపమ దగ్గరగా వెళ్ళాడు. ఆమె వుత్సాహంగా లేకపోవడం అతనికి నిరుత్సాహంగా అనిపించింది. కానీ వెంటనే తమాయించుకున్నాడు. ఇప్పుడు అనుపమ వున్న స్థితిలో ఆమెనుండి ఏమీ ఆశించకుండా తనే ముందుకు వెళ్ళాలి.

ఆమె అంతక్రితమే వేడి నీళ్ళ స్నానంచేసి వచ్చి మంచంమీద ఒరిగింది. కడిగిన ముత్యంలా, తడిసిన పారిజాతంలా వుంది. కానీ ఉత్సాహంలేనట్లు పక్కకి వొత్తిగిలింది. కళ్ళు మూసుకుంది.

"అనుపమా!" మధు గొంతు ఎంతో మార్దవంగా వుంది.

అనుపమ మళ్ళీ కళ్ళు తెరిచి చూసింది. మధు గుండెలు దడదడలాడాయి.

"నే చెప్పిన మాట వింటావా" అన్నాడు నెమ్మదిగా.

"ఏమిటి" అని సైగచేసింది.

"నీ చెయ్యి ముందుకు చాపు" అన్నాడు.

అనుపమ కుడిచెయ్యి ముందుకు చాచింది. అతను తన చేతిలోకి ఆమె మృదువైన చేయిని తీసుకుని రెండు ఎర్రని గాజులు ఎక్కించాడు.

ఆ చెయ్యి మెత్తగా మృదువుగా వుంది. అప్పుడే వేడినీళ్ళస్నానం చెయ్యడంవల్ల గాజులు క్షణంలో ఆమెకి అమరి తళతళ మెరిసాయి. ఆమె ఒక్కక్షణం నివ్వెరపోయింది. అందమైన గాజులవంక అయోమయంగా చూసింది. ఆమె ఆలోచన పూర్తవకముందే, ఆమె తేరుకోకముందే ఆమె రెండు చేతులనిండా ఎర్రటి మెరిసే గాజులు.

అప్పుడామె ఒక్కసారి నిద్రలోంచి మేలుకున్నట్లు "ఏమిటిది మధూ" అంటూ కన్నీళ్ళు పెట్టుకుంది.

"తప్పు... ఏడవకూడదు. అసలు నీ మనసు యిప్పుడు వుల్లాసంగా వుండాలి తెలుసా" అన్నాడు.

అనుపమ విషాదంగా కళ్ళు దించుకుంది. మధు తీసుకున్న చొరవ ఆమెనేమీ కదల్చలేదు. ఏమీ తప్పుగానూ అనిపించలేదేమో, అదే మధుకి వెయ్యి ఏనుగుల బలాన్నిచ్చింది.

"చూడు అనుపమా! నాన్నగారు నువ్వు కళకళ్ళాడుతూ కనిపించాలని కోరుకుంటారు" అన్నాడు.

"అదెలా సాధ్యం మధూ" అంది.

"ఏమో నాకు తెలీదు. నువ్వు అన్నీ మర్చిపోయి, మామూలు మనుమల్లో పడాలి" అన్నాడు.

అనుపమ ఏం మాట్లాడలేదు.

"ఇదిగో ఈ చీర కట్టుకో" అని చెప్పి చీర ఆమె వడిలో పెట్టి నెమ్మదిగా అక్కడ్నించి బయటపడ్డాడు.

మధుని చూసి యాదగిరి చాలా ఆనందించాడు. "మధుబాబూ! అనుపమమ్మ ఏం రాద్ధాంతం చేస్తుందోనని భయపడ్డాను" అన్నాడు గునగునగా.

అనుపమ చీర కట్టుకోలేదు. గాజులు తీసేసి దిండుకింద పెట్టేసింది.

మధు ఒకందుకు ఆనందించాడు. ఆమె అవన్నీ తన ముఖాన కొట్టి అల్లరిచెయ్యలేదు




అదేచాలు అనుకున్నాడు.

★ ★ ★

రోజులు గడుస్తున్నకొద్దీ నళినికి కుక్కపిల్లల పిచ్చి మరీ ఎక్కువైంది. మూడు రకాల కుక్కపిల్లల్ని తెచ్చిపెంచడం మొదలుపెట్టింది. రోజంతా వాటి పనితోనే సరిపోతుంది. వాటికి పాలు పట్టడం, స్నానం చేయించడం, వాటిని ముద్దుచేయడం, బయటకి తీసుకెళ్ళడం ఒక టేమిటి? ఆమె సమయమంతా కుక్కపిల్లల తోనే. ఒక్కొక్క రోజు రాజారావు తన అన్నం తనే వడ్డించుకుని తినాల్సిన పరిస్థితి ఏర్పడు తోంది. కానీ అతను నళినిని విసుక్కోడు. సరిపెట్టుకుంటాడు. ఆమె మానసికంగా బాధ పడకూడదని అతని తాపత్రయం.

తనకి తెలీకుండానే నళిని ఒక పిచ్చిదానిలా తయారైంది. అది రాజారావు గమనిస్తున్నా, అతనేం చెయ్యలేకపోయాడు. ఎందుకంటే ఇప్పుడామె హాయిగా స్వేచ్ఛగా వుంది. ఆనందంగా తిరుగుతోంది. అదే తనకి చాలు అనుకున్నాడు రాజారావు.

రాజారావుకి ఒక వుత్తరం వచ్చింది రాఘవేంద్రరావు నుండి. అది చదువుకుని కళ్ళనీళ్ళు పెట్టుకున్నాడు.

ఈ ప్రపంచంలో ఒక్కొక్కరికి ఒక్కొక్కబాధ. ఎవరి బాధ ఎవరు తీర్చగలరు? కొందరికి దారిద్ర్యం బాధ, కొందరికి సంసార భారం, కొందరికి ఆరోగ్యం, కొందరికి కీర్తికాంక్ష, కొందరికి వున్న డబ్బు ఏం చెయ్యాలో తోచని బాధ. ఎన్నో రకాల బాధలలో తనకి పిల్లలు లేని బాధ. బాబయ్య బాధ వర్ణనాతీతం- అల్లారు ముద్దుగా పెంచుకున్న ఒక్కగానొక్క కూతురు మోడైపోయి యింట్లో వుంది. నాలుగు తరాలకి సరిపడినంత డబ్బువుంది. కానీ ఆ డబ్బువున్న ఆనందం ఆ ఇంట్లో ఎవ్వరూ అనుభవించలేక పోతున్నారు.

"నాయనా రాజా! ఆడదిక్కులేని కొంప. అమ్మాయికి తొమ్మిదోనెల వచ్చింది. నువ్వూ కోడలు వచ్చి ఇక్కడుంటే నాకు కొండంత ధైర్యంగా వుంటుంది. నీరాకకోసం ఎదురుచూస్తుంటాను" అని రాశాడాయన.

పిచ్చిగీతల్లా వున్న రాఘవేంద్రరావు సంతకం, అస్తవ్యస్తంగా వున్న రాత చూసి రాజారావు మనసు కరిగిపోయింది. వెంటనే రెక్కలు కట్టుకుని వెళ్ళాలనిపించింది. కానీ ఒకప్పుడు ఇల్లు కదలాలంటే ఇప్పుడంత కష్టం వుండేది కాదు. వున్న ఒక్క కుక్కని చంకనేసుకుని బయలుదేరి వెళ్ళేవీలుంది. కానీ యిప్పుడు కుయ్యోకుయ్యోమంటున్న నాలుగు కుక్కపిల్లల్ని తీసుకెళ్ళాలి.

రాజారావు యింటికొచ్చేసరికి నళిని విచారంగా కూర్చుంది. కారణం జిమ్మికి జ్వరంగా వుందిట. అదీ సంగతి, హాస్పటల్‌కి తీసుకెళ్ళింది. అక్కడి డాక్టర్ ఫ్రెండ్ దాని బాధ్యత స్వీకరించిందని, ఇంటి కయితే తిరిగి వచ్చిందిగానీ, నళిని మనసు బాధగావుంది. అదే చెప్పింది రాజారావుతో.

అతను నెమ్మదిగా బుజ్జగించి, నళిని ఆ మూడుకుక్కపిల్లల్ని మాత్రం తీసుకుని బయలుదేరడానికి సిద్ధపడేలా చేశాడు.

★ ★ ★

సావిత్రి కొంచెం కోలుకుంది. చెయ్యీ కాలూ పూర్తిగా ఆడకపోయినా, చాలావరకు నయమైంది. మాట ముద్దముద్దగా వస్తోంది. ఆమాత్రం దానికి అంతా ఎంతో సంబరపడ్డారు.

అనుపమ కూడా మరీ అంత విషాదంగా వుండటంలేదు. కానీ చలాకీతనంపోయింది. దానికి తోడు నెలలు నిండాయి.

నళిని, రాజారావు రాకతో యింట్లో అందరూ కాస్త ఊపిరి పీల్చుకున్నారు. మధు మాత్రం కాస్త గుర్రుగా చూశాడు. కారణం మరేం లేదు. రాజారావు వున్నప్పుడు రాఘవేంద్రరావుకి తన అవసరం మరీ అంతగా వుండదు. తన ప్రాముఖ్యాన్ని కోల్పోగల శక్తి అతనికి లేదు. అందుకే అసూయగా ఫీలవుతాడు.

కానీ అనుపమకి కావలసిన కాఫీ దగ్గర నుండి అన్నీ మధు పర్యవేక్షణలోనే జరుగుతున్నాయి. మధు ఆవిధంగా అనుపమని అంటి

పెట్టుకుని వుండి, ఆమెని మళ్ళీ మామూలు మనుషుల్లో పడేలా చేసినందుకు అంతా ఎంతో ఆనందిస్తున్నారు.

"మధు చాలా మంచివాడు. అతనే కనుక అనుపమని ఆదుకోకపోతే పిచ్చిపిల్ల ఏమైపో యేదో" అంది నళిని.

రాఘవేంద్రరావు, రాజారావు కూడా నళిని మాటల్ని కొట్టిపారేయలేకపోయారు. అక్కడే వున్న యాదగిరి అందుకున్నాడు.

"ఆ బాబు, అనుపమమ్మ అన్నం ముట్టేదా కా నీళ్ళన్నా తాగలేదు" అన్నాడు.

"అవును నిజమే. అనుపమ ఒక గుక్కెడు పాలు తాగాక నేనే పిలిచి, బలవంతం చేసి అన్నం పెట్టాను" అంది నళిని.

రాఘవేంద్రరావు గాఢంగా నిట్టూర్చాడు. రాజారావు ఏమీ మాట్లాడలేదు.

రాఘవేంద్రరావుకి తన పరిస్థితి చెప్పి, నాలుగురోజులు మాత్రం వుండి, నళినిని అక్క డే వదిలేసి వెళ్లిపోయాడు రాజారావు.

ఇక్కడికొచ్చాక నళినికి పనిబాధ్యత పెరి గింది. సావిత్రికి సేవలు చెయ్యడం, అనుపమ కి అన్నీ చూడటంతో రోజులు వేగంగా గడిచిపో తున్నాయి. కుక్కల బాధ్యత యాదగిరి చూసు కుంటున్నాడు.

అనుపమ ఓపలేకుండా, బరువుగా తిరుగు తుంటే నళిని విచిత్రమైన అనుభూతి పొందు తోంది. అలా నిండుగా, ఒక బుజ్జిపాపాయిని తన కడుపులో కూడా మోస్తే బాగుండును అని ఆమెకి అనుక్షణం అనిపిస్తోంది. కానీ అంత లోనే తనకీ జన్మలో అలాంటి అదృష్టం లేదనే నంగతి గుర్తుకొస్తే, ఎంతో బాధ కలుగుతోంది. అపురూపమైన అనుపమ రూపాన్ని నళిని ఆరాధిస్తోంది. అసలు చిన్నప్పటినుండి చను వుగా ఇద్దరూ కలిసి మెలిసి నెరిపిన స్నేహం వుండనేవుంది. ఆ ప్రేమ ఇప్పుడు అనుపమ స్థితికి వల్లమాలిన జాలి. ఇవన్నీ కలిసి నళిని ఒక్కక్షణం కూడా అనుపమని వదలడంలేదు.

★ ★ ★

మధు ఆలోచనలు చిత్రవిచిత్రంగా సాగు తున్నాయి. అనుపమ తనకెంతో సమీపంలో వుందనే ఆనందం ఒకవైపు వున్నప్పటికీ తనకే మిటి సుఖం? అనే నిరాశ మరొకవైపు అతన్ని ఊపేస్తున్నాయి.

అతని మనస్తత్వం తెలుసుకోవడం చాలా కష్టం. తనకి డబ్బులేదనే బాధ దినదిన ప్రవర్ధ మానమవుతోంది. నిజంగా తనూ, డబ్బూ, హోదా వున్నవాడయితే ఈనాడు తనస్థితి ఇలా వుండేదికాదని అతను దుగ్ధపడి పోతు న్నాడు. ఏదో పోగొట్టుకున్నట్లూలేదు, ఏదో పొందగలిగినట్లూ లేదు.

అతని మనసు అనుపమని చూసిన వెంటనే ప్రేమతో ఉప్పొంగదు. సరిగదా చిత్ర మైన ప్రతీకారం చేసిన తృప్తినే పొందుతున్నా డు. బాహ్యప్రపంచానికి అతని ప్రవర్తన విభి న్నంగా వుంటుంది. ఎక్కువ మాట్లాడడు. పగ లబడినవ్వడు. ఆనందోత్సాహాలు ప్రదర్శించ డు.

లోపల అగ్నిపర్వతాలు రగులుతున్నా పైకి శాంతంగా, నిరాడంబరంగా, అణకువగా వుంటాడు. అందుకే అందరికీ అతను తలలో నాలుకలా వుంటాడు. ఆరోజు తెలతెలవారు తుండగా అనుపమ హాస్పిటల్లో మగపిల్లవాడ్ని కంది. చిమ్మచీకట్లు కమ్మిన దట్టమైన అడవిలో ఒక్కసారి సూర్యకిరణాలు చొచ్చుకుని వచ్చిన ట్లు అందరూ భావించారు. కానీ ఎంతోసేపు ఆనందం నిలవలేదు ఆ ఇంట్లో. సావిత్రి మూగబోయిన బొంగురు గొంతుతో దయనీ యంగా విలపించింది.

అనుపమ నిశ్శబ్దంగా రోదించసాగింది. ఆమె కళ్లల్లోంచి నీరు ధారాపాతంగా కారిపో తుంటే లేడీడాక్టరు ఆమెను ఎంతో ఓదా ర్చింది, బుజ్జగించింది. పచ్చివంటిమీద ఏడి స్తే మంచిది కాదనీ నచ్చచెప్పింది. నీకే పిల్లాడే ఆశాజ్యోతి అంటూ సముదాయించింది. అయినా అనుపమకి దుఃఖాన్ని దిగమింగడం సాధ్యంకాలేదు. డాక్టరు బయటకెళ్ళి అక్కడే ఆతృతగా ఎదురుచూస్తున్న మధుని చూసి-

"మీరు కొంచెం ఆమెని ఊరుకోబెట్టండి. మరీ ఏడిస్తే కళ్లకీ మంచిది కాదు, ఒంటికీ మంచిది కాదు" అంది.

అలా లేడీ డాక్టరు ఎందుకందో మధుకి అర్థంకాలేదు. కానీ మొదటినుంచీ అనుపమ




సంరక్షణ చూస్తున్నందుకు చనువుగా చెప్పి వుంటుందని అనుకుని నెమ్మదిగా ఆ రూము తలుపు తెరిచాడు. అది స్పెషల్‌రూము. శుభ్రంగా, కొంచెం చల్లగా, ప్రశాంతంగా వుంది. అతను తల లోపల పెట్టి తొంగిచూశాడు. తెల్లని బట్టలమధ్య, ఉయ్యాలలో కళ్లు మూసుకుని పడుకున్న అప్పుడే పుట్టిన శిశువు కనిపించింది. అదొక కదిలికవున్న మాంసపు ముద్ద. మధు మరికొంత వంగి లోపలికి చూశాడు. అప్పుడు అనుపమ కనిపించింది. వెల్లకిలా పడుకుని వున్న ఆమె చెంపలమీదుగా కన్నీరు కారడం కనిపించింది. అతనొకక్షణం అలా చూస్తూండిపోయాడు. కానీ చూస్తూండిపోతే లాభమేమీలేదు. ఏదో ఒకటి చెయ్యాలి.

అతను లోపలకి అడుగుపెట్టిన శబ్దానికి అనుపమ పక్కకి తిరిగి మధుని చూసింది. అయితే అతన్ని చూసిన క్షణంలో, అంతవరకు నిశ్శబ్దంగా ఏడుస్తున్న ఆమె ఒక్కసారి వెక్కివెక్కి ఏడ్వసాగింది. మధు ఆమె దగ్గరగా వెళ్ళాడు.

''అనుపమా! ఏమిటిది?'' అన్నాడు లాలనగా.

''ఏముంది మధూ! నాకు చచ్చిపోవాలని వుంది'' అంది.

''తప్పు తప్పు. అలా మాట్లాడకూడదు''

''ఏం మాట్లాడమంటావు?''

''ఏమీ వద్దు. ఇంకా కళ్ళుతెరిచి ఈలోకాన్ని చూడని ఆ పసిగుడ్డును చూడమంటాను'' అన్నాడు.

అనుపమ నిర్లిప్తంగా పక్కకి తిరిగి చూసింది. అప్పుడే అక్కడికొక నర్సు వచ్చింది.

''సిస్టర్! బాబుని ఒక్కసారి ఆమె దగ్గర పడుకోబెట్టండి'' అన్నాడు మధు. సిస్టర్ పిల్లాడ్ని తెచ్చి అనుపమ పక్కన పడుకోబెట్టింది. అనుపమ పిల్లాడ్ని చేతుల్తో నిమిరి వెక్కివెక్కి ఏడ్చి ఆగిపోయింది.

అప్పుడు నెమ్మదిగా అనుపమతో కబుర్లు మొదలుపెట్టాడు. ఆమెలో దుఃఖం చాలావరకు తగ్గింది. భారం తీరింది. మధు చెప్తున్న కబుర్లు విని మనసు కుదుటపర్చుకుంది. అప్పటికి బాగా ఎండ వచ్చేసింది. పిల్లాడు ఒకటి రెండుసార్లు కుయ్‌కుయ్‌మంటే నర్సు వచ్చి చూసి వెళ్ళింది.

అనుపమకి కాఫీ ఇప్పించి తను నెమ్మదిగా అనుపమకి చెప్పి వచ్చేశాడు.

ఆమె వెళ్లిపోతున్న అతనివైపు చూస్తూండిపోయింది. ఇతనేమిటి? ఇతనికెందుకీ ఆపేక్ష? ఎప్పుడూ తన గురించీ, తమ బిడ్డగురించీ, తన తండ్రి గురించి ఆలోచిస్తాడేగానీ తనని గురించి తను ఆలోచించుకోడేం?

ఎప్పుడూ ''ఈ బిడ్డని చూడు'' అంటాడు. మొదట్లో ''నీ కడుపులో వున్న బిడ్డని గురించి ఆలోచించు'' అన్నాడు.

''మీ నాన్నగారిని గురించి ఒక్కక్షణం ఆలోచించు'' అన్నాడు.

ఇతని ధోరణే వింతగా వుంది అనుకుంది.

''యాదగిరీ'' మధు పిలుపు విని యాదగిరి వులిక్కిపడ్డాడు.

''ఏంటి మధుబాబు, బాగా పొద్దుపోయింది. ఇంకా నిద్రపోలేదా'' అన్నాడు.

''రేపు తెల్లారకుండానే బస్తీ వెళ్తున్నా. ఏమైనా పనుంటే నువ్వు చూసుకో''

''తెల్లబోయి మధువంక చూశాడు యాదగిరి.

''దానికింత రాత్రివేళ చెప్పడమెందుకు బాబూ'' అన్నాడు.

''లేదులే... రేపు అనుపమని హాస్పిటల్ నుండి తీసుకొస్తారు''

''అవునుకదూ! పోనీ...''

''లేదు... నాక్కొంచెం అర్జంట్ పనివుంది. నేను లేను అనే సంగతి రాకుండా చూసుకో'' మధు మాటలు విని మౌనంగా తలూపాడు యాదగిరి.

ఎంతసేపో ఏవేవో ఆలోచించాడు. ఏమిటీ... ఈరోజు మధులో ఏదో కొత్తదనం కనిపిస్తోంది అనిపించింది. కానీ అదేవిటో అతనికి అంతు పట్టలేదు. యాదగిరి కలత నిద్రలోంచి మేల్కొనేసరికి తెలతెలవారుతోంది. అనుపమని ఇంటికి తీసుకురావడం సావిత్రి దుఃఖపడటం.

''ఏమిరా నాయనా! కడుపులో పడీపడగానే తండ్రిని మింగేశావుకదరా'' అంటూ పిల్లాడ్ని

పరామర్శించింది సావిత్రి. అనుపమకి శాస్త్రోక్తంగా స్నానం చేయించారు. ఆనందం, ఆర్భాటం లేకపోయినా అన్నీ యధావిధిగా జరిగాయి. బ్రాహ్మడు వచ్చి పుణ్యవచనం చేయించి, పురిటిశుద్ధి చేయించాడు.

నళినిమాత్రం ఆ పసికందుని చూసి మురిసిపోతోంది. మెత్తగా దూదిపింజలా వున్న ఆ బిడ్డని చూస్తే ఆమెకి చిత్రవిచిత్రమైన అనుభూతులు కలుగుతున్నాయి. ఇంట్లో నౌకర్లు వున్నా నళినే పిల్లాడి బాధ్యత స్వీకరించింది. వాడు కుయ్‌మంటే ప్రాణం ఎగిరిపోయినట్లు బాధపడి, వాణ్ని ఒళ్లోపెట్టుకుని కూర్చునేది. అనుపమ పరధ్యానంగా పడుకుని, గత స్మృతుల తవ్వకాల్లో పడిపోయేది. అందువల్ల ఆమె ఇరవైనాలుగు గంటలూ పిల్లాడి ధ్యాసలో కాకుండా ఎటో ఆలోచనలో వుండేది.

ఆరోజు మధు ఇంటికి చేరేసరికి మధ్యాహ్నం రెండు దాటింది. అతను వస్తూనే కొంత ముభావంగా తన గదిలోకి వెళ్లిపోయాడు. అతన్ని మొదట గమనించింది నళినే.

సావిత్రి చూసిందిగానీ పట్టించుకోలేదు. రాఘవేంద్రరావు మనసంతా కలతగా వుంది. తమ జాతకం ఇలా వుండకపోయి వుంటే ఈ రోజెంత సందడిగా, ఆర్భాటంగా వుండేది. తన కూతురూ, అల్లుడూ కళ్ళ ఎదురుగా వుండే ఆశే లేకుండాపోయింది. దూరం వెళ్ళే సంబంధం చేయవద్దు అనుకుంటూనే ఎందుకో ఈ పెళ్ళికి మోజుపడ్డాడు. తన కూతురు ఎప్పుడూ కళ్ళెదుట వుండాలనే తన కోరిక తనకింత ఘోరశాపంగా మారుతుందని కలలో కూడా అనుకోలేదు.

కానీ అలా 'గతజలసేతు బంధనం' రాఘవేంద్రరావు [illegible]. పదేపదే ఒకటే [illegible] ప్రస్తుతం ఏం చెయ్యాలి [illegible]. భోగభాగ్యాలకి లోటులేదు. అంగబలానికి లోటులేదు. కానీ అనుపమ జీవితంలో ఇంతలోటు తనెలా భర్తీ చెయ్యగలడు?

మధులో వచ్చిన మార్పును అందరికంటే ముందుగా పరిశీలించిన వాడు యాదగిరి. నిన్నటి మధుకి, ఈరోజు మధుకి ఒకవిధంగా పోలికలేదేమోనని అతను ఆశ్చర్యపడ్డాడు. అతనికి ఆశ్చర్యంతోబాటు ఆలోచనలు కూడా రేకెత్తుతున్నాయి. వాటికో దరీదాపూ లేకుండా వుంది. మధు ఇప్పుడు వేషభాషలు పూర్తిగా మార్చేశాడు. అంతవరకు అతను ధరించే ప్యాంట్లూ, షర్టులు, బుట్టలో చేరాయి. అన్నీ సరికొత్త రెడీమేడ్ దుస్తులు. కొన్ని సఫారీ సూట్లు, వాటికి తగిన అనువైన బూట్లు, ఒకటి రెండు జతలు మామూలు పాషన్ చెప్పులు, కళ్ళకి చలువ అద్దాలజోడు, ఖరీదైన రిస్ట్‌వాచ్, తళతళలాడే క్యాప్, కనిపిస్తూ జేబులో పెన్ను.

క్రాఫింగ్ మోడల్ కూడా మారిపోయింది. వీలయినంత అందంగా కనిపించే విధంగా దిద్దించాడు.

మనిషిలో తెచ్చిపెట్టుకున్న దర్జా, డాబుసరి కొట్టొచ్చినట్లు కనిపిస్తున్నాయి.

మూడేళ్ళుగా రాఘవేంద్రరావు ఇచ్చిన జీతంలో ఎప్పుడూ ఖర్చుపెట్టే అవసరమే లేకుండాపోయింది.

ఇప్పుడు ఆ డబ్బుతో ఈ హంగులు ఏర్పరచుకున్నాడు.

మాటలో, నడకలో కూడా మెతకతనం దైన్యం పోయి దర్జా, దర్పం చోటుచేసుకున్నాయి. రాఘవేంద్రరావు ఇవన్నీ చూసి, "అమ్మయ్య! మధు ఇప్పుడు దర్జాగా వున్నాడు" అనుకున్నాడు.

సావిత్రి చూసి "పాపం, ఇన్నాళ్ళకి కాస్త మంచిగుడ్డ కొనుక్కున్నాడు. పోన్లే... ఎప్పుడూ తన ధ్యాసే వుండదు" అనుకుంది. నళిని సహజంగానే కాస్త హారిసవడ్డాడు అనుకుందిగానీ అంతకుమించి ఆలోచించలేదు.

ఒక్క యాదగిరి మాత్రమే మధులో వచ్చిన మార్పుకి కారణం కోసం అన్వేషిస్తూ వున్నాడు.

ఎవరు ఎలావున్నా కాలం వేగంగా పరుగెడుతోంది. కాలం గడిచేకొద్దీ బాధ మరుగునవడినా, సమస్య మరింత భారంగా గుండెల్లో పేరుకొంది అందరి హృదయాల్లో.

అనుపమ మామూలుగా తయారైనా, ఇరవైనాలుగు గంటలూ పిల్లాడి ధ్యాసలో వుంటోంది. [illegible] ఎక్కువగా నళినే [illegible]

[illegible]




న్నప్పుడు అనుపమ తన పెళ్లినాటి ఫొటోలు, భర్త వున్న పదిహేరోజుల్లోనూ తీసుకున్న ఫొటో లు చూస్తూ, ఆ జ్ఞాపకాలు నెమరేసుకుంటూ గడిపేస్తోంది.

అంతకుమించి మరే ధ్యాసా ఆమె పెట్టుకో లేదు. అందుకనేనేమో మధులో కొట్టొచ్చినట్లు కనిపిస్తున్న మార్పును అనుపమ అసలు గమ నించనేలేదు.

పెళ్ళయిన ఏడాదిలో అన్నీ కోల్పోయి, ఒడిలో ఒక పిల్లాడితో, మోడువారిన బ్రతుకులో నిరాశగా నిలిచిపోయింది. అయితే రాఘ వేంద్రరావు ఆలోచనలు పరివరివిధాల పోతు న్నాయి. అతనికి వయసుకిమించిన వృద్ధాప్యం మీదపడింది. మంచంపట్టిన సావిత్రి పూర్తిగా కోలుకోలేదు. ఆమె మంచంలోనే కాలక్షేపంచే స్తోంది. ఇలాంటి పరిస్థితిలో రాఘవేంద్రరావుకి తాను చచ్చిపోతానేమోననే భయం పట్టు కుంది. తను పోతే, ఈ ఆస్తి, ఈ డబ్బు, ఇదంతా వంటరిదైన అనుపమదే అయినా, మగతోడు లేనందువల్ల, ఆమె ఎలా నెగ్గుకురా గలదా అని బెంగపెట్టుకోవడం మొదలు పె ట్టాడు.

★ ★ ★

సాయంత్రంవేళ వాతావరణం ఆహ్లాదక రంగా వుంది. తోటలో మామిడి చెట్టుకింద పడక్కుర్చీలో వెనక్కి వాలి మధు ఏదో ఆలోచి స్తున్నాడు. అతని వూహలు రకరకాలుగా సాగు తున్నాయి. తను చెయ్యాల్సిన ఏదో కార్య క్రమం ఆలస్యమైపోతున్నట్లు అనిపించసా గింది. ఇప్పుడున్న పరిస్థితుల్లో అనుపమ బిడ్డ మీద తప్ప మరి దేనిమీదా ఆసక్తిచూపడం జరిగే పని కాదని అతని కనిపించింది. అను పమ సంప్రదాయమైన పూర్వాచారపరాయ ణుల ఇంట్లో పుట్టింది, పెరిగింది. పెద్దపెద్ద ఆలోచనలు విప్లవాత్మకమైన భావాలు గల అమ్మాయికాదు. తన గురించి తను ఆలో చించకుండా పాత సంప్రదాయాలను నమ్మి, అదేత్యాగం అని భావించే సాధారణ స్త్రీ అని అతనికి అర్థమైంది. అయితే అతను కూడా అనుపమ గురించి సంస్కరణగా గానీ, ఆమెకి ఆసరా అనిగానీ ఆలోచించటంలేదు. కేవలం, తనకి అవకాశం లభిస్తుందా అని ఆలోచిస్తు న్నాడు. తన అభిప్రాయం వెల్లడి చేయడానికి సమయంకోసం ఎదురుచూస్తున్నాడు.

అప్పుడే వచ్చాడు యాదగిరి. యాదగిరి కూడా రకరకాల ఆలోచనలతో సతమవుతున్నా డు. మధుబాబు వేషభాషల్లో వచ్చిన మార్పుకి అతను భాష్యం చెప్పుకోగలిగాడు. ఆలో చించగా ఆలోచించగా అతనికి మధు వూహలో తప్పేమీ కనిపించలేదు. మధులో లోటేమిటి? సాటి కులం వాడు అన్నిటికంటే అదేకదా ముఖ్యం. పెళ్ళిచేసుకుంటే అయ్యగారి డబ్బంతా మధుదే కదా! మంచి తెలివైన వాడు. వ్యాపార మెలకువలన్నీ గ్రహించుకు న్నవాడు. ఇప్పుడు మధుని కాదన్నా, అనుపమ మ్మకి మరో మనువు చెయ్యడం సాధ్యమా!

"రా యాదగిరీ" అంటూ ఆహ్వానించాడు, మామిడి చెట్టుచుట్టూ కట్టించిన సిమెంటు దిమ్మపై తువ్వాలుతో తుడుచుకుని కూర్చున్నా డు.

"ఏంటి బాబూ! ఏదో చాలా ఆలోచిస్తున్నట్లు న్నారు"

"మరే, యాదగిరీ! మనసేం బాగోలేదు"

"ఏంటిబాబూ! నాతో చెప్పండి, ఏంటీ బాధ" అన్నాడు.

"ఏం చెప్పను? చెప్పుకున్నా తీరే బాధ కాదు"

"అలాగంటే ఎలాగా, చెప్పండి, చెప్పు కుంటే గుండెల్లో బాధ తీరుతుందంటారు" అన్నాడు.

"అనుపమ భవిష్యత్తు తలుచుకుంటే గుండె చెరువైపోతోంది" అన్నాడు మధు.

యాదగిరి గంభీరంగా మారిపోయాడు.

"నిజమేబాబూ! అది మనమెవ్వరం తీర్చేదీ కాదూ, ఆర్చేదీ కాదు. కళ్ళొట్టి చూ స్తూండటం, బాధ పడటం అంతే పని" అన్నా డు.

అలాగనుకుంటే ఎలాగూ, ఏదో ఒకటి చె య్యాలి. తలుచుకుంటే ఆర్చనూగలం, తీర్చ నూగలం" అన్నాడు.

"అంటే... ఏంటి బాబూ, మీ మాటలు నాకర్థంకావడంలేదు" అన్నాడు, యాదగిరి నిశితంగా మధునే చూస్తూన్నాడు. అతను



చెప్పబోయేది తను వూహించినా, బయటపడటం యిష్టంలేక నిశ్శబ్దంగా వూరుకున్నాడు.

మధు కూడా పదినిముషాలు ఏమీ మాట్లాడకుండా ఆకాశంకేసి చూస్తూవుండిపోయాడు. ఆ వాతావరణం క్షణమొక యుగంలా వుంది.

"మీ అయ్యగారు ఒప్పుకుంటే నేను అనువమని పెళ్ళిచేసుకుంటాను" అన్నాడు.

యాదగిరి వులిక్కిపడలేదు. అతను వూహించిన మాటే అది. అదే నిజమయ్యేసరికి ఒక్కక్షణం గుండెదడదడలాడింది. ఇది ఎలాంటి పరిణామానికి దారితీస్తుంది. అని ఆలోచనలో పడ్డాడు. ఏం మాట్లాడకుండా మధువైపే చూస్తూండిపోయాడు.

మధు మాత్రం సూటిగా అతనివైపు చూడకుండా ఎటో చూస్తూ కూర్చున్నాడు. కానీ అతను ఎంతో వుద్వేగంతో వున్నాడని యాదగిరి కనిపెట్టగలిగాడు. అయినా మధు చెప్పిన దానికి ఏవిదంగానూ తను వెంటనే స్పందించ

లేదు. తనేమిటి? అసలు ఈ ఇంట్లో తన స్థానమేమిటి? తనకంటూ హక్కు భుక్తాలేమీ లేవు. తనొకమాట చెప్పేస్థితి ఎక్కడుంది?. కానీ రాఘవేంద్రరావు మనిషి స్వతహా మంచిమనిషి కావడంవల్ల తను వున్నదానికంటే ఎక్కువగానే స్వేచ్ఛగా వ్యవహరిస్తూంటాడు. వాళ్ళ ఆంతరంగిక విషయాల్లోకూడా తను అప్పుడప్పుడు తలదూర్చి మాట్లాడటం జరుగుతూ వచ్చింది. కానీ- ఇది సామాన్యమైన విషయం కాదు. ఇలాంటి విషయం చటుక్కున అనేయదగ్గ విషయంకాదు. దానివల్ల ఎన్నో విపరీత పరిణామాలు వచ్చే అవకాశం వుంది. అయినా అనుపమ అస్సలు మానసికంగా కోలుకోలేదు. ప్రస్తుతం వున్న పరిస్థితుల్లో వీళ్ళుండే వాతావరణంలో మళ్ళీ పెళ్ళి అనే మాటే చాలా భయంకరంగా వినిపిస్తుంది. పైగా అనుపమ విడిమనిషికాదు. ఆమెకిప్పుడో కొడుకు కూడాను.

యాదగిరి తన ఆలోచనల్లో తనున్నాడుగానీ ఒక్క మాటా పలుకూ లేకుండా బెల్లంకొట్టిన రాయిలా వుండిపోయాడు.

మధు యాదగిరివంక చూశాడు. యాదగిరి అభిప్రాయం తెలుసుకోవాలని మధుకి మరీ ఆరాటంగావుంది. అతని అభిప్రాయం అంత ముఖ్యమా కాదా అనేది కాదు. అసలు యాదగిరి ఏమనుకుంటున్నాడు అనేది ముఖ్యం. ఎంత నౌకరుగా వున్నా ఆ యింట్లో యాదగిరి తన మంచితనంవల్ల చిరకాల సాంగత్యంవల్ల ఎంతో కొంత చనువు సంపాదించుకున్నాడు. అతని మాటకి విలువ వుంది.

మధు ఆలోచనలో పడ్డాడు. తన గురించి ఒక మాట, ఒక సిఫారును చేయడానికి యాదగిరి తనను నమ్మాలి. అతను నౌకరంటే నౌకరు కాదు. ఆ యింట్లో అందరికీ ఆంతరంగికుడు.

కానీ... ఎప్పుడో తన మనసులోని మాట యాదగిరికి చెప్పాడు. అతనప్పుడేం మాట్లాడలేదు. అప్పుడతను నోరు మెదపలేకపోవడానికి కారణం వుంది. కానీ ఇప్పుడు తనయందు, తన అభిప్రాయమందుకూడా బలముంది, ఇప్పుడు తనమాట ఎవ్వరూ తప్పుపట్టలేరు. ఈ అవకాశం తనకి వస్తే, ఈ ఆస్తికి, ఈ సామ్రాజ్యానికి తను తిరుగులేని మహారాజు. నిజమే డబ్బులేని మనిషి ఒక మనిషే కాడు. ఏలాగైనా డబ్బు సంపాదించగలగాలి, తన దగ్గర డబ్బు లేనందువల్ల తనని పక్కకి పెట్టేసినా, ఇప్పుడు ఏ ధనరాసులతోనూ కొనలేని అమూల్యమైన అర్హత తన దగ్గరవుంది.

"ఏమిటి యాదగిరీ! పలుకూ వులుకూ లేకుండా కూర్చుండిపోయావు?" అన్నాడు మధు.

ఒక్కసారి ఈ లోకంలోకి ఎక్కడినుంచో వూడిపడినట్లు వులిక్కిపడి-

"అదేం లేదుగానీ మధుబాబు! నువ్వు చాలా మంచోడివి. నీది పెద్ద మనసు. లక్షలు విలువచేసే మనసు, మంచితనం నీకున్నాయి" అన్నాడు.

"అవన్నీ వద్దులేగానీ, నేనన్నమాట తప్పా" అన్నాడు సూటిగా.

"మంచివాడి నోటిలోంచి తప్పుమాటెలా వస్తుంది? అయితే...?"

"అయితే..."

"మరేంలేదు ఒక్కొక్కసారి అది కఠినంగా వినిపిస్తుంది. అదీ కొంతసేపు మాత్రమే. నిదానంగా చూస్తే- నీ గొప్పతనం అర్ధమవుతుంది"

"నన్నేం చెయ్యమంటావు"

"తొందరపడవద్దంటాను. మనం మంచి మాట చెప్పినా, సమయం మంచిది కాకపోతే తప్పుగా వినిపిస్తుంది"

"అందుకని..."

"ఏం లేదు... నామీద వదిలేయ్- నేను మాట్లాడుతాను. అంటే ఓ మాట అని చూస్తాను. అప్పుడు అయ్యగారే నీతో మాట్లాడతారు"

"ఇదంతా నా కోసం కాదు. కేవలం అనుపమ జీవితం కోసం" అన్నాడు భుజాలు ఎగరేసి, కుర్చీలో సర్దుకుని కూర్చుంటూ.

ఒక్కక్షణం మధువైపు యాదగిరి పరిశీలనగా చూశాడు. చూసి ఊరుకున్నాడు. ఎంతో కష్టపడినా ఒక్కొక్కసారి మనిషిని తెలుసుకోవడం, అర్ధంచేసుకోవడం కష్టం అని యాదగి




రికి తెలుసు. కానీ అతను మరి గద్ద దృష్టితోనే చూస్తూవున్నాడు.



ఆరెల్లు గడిచిపోయాయి. ఇంట్లో చంటి పిల్లాడి ముద్దుచేష్టలతో అందరూ ఎంతో కొంత సంబరంగానే వున్నారు.

మధు మార్చిన వేషభాషలతో దర్జాగా, దర్పంగా మసులుతూనే వున్నాడు.

యాదగిరి సమయంచూసి, అయ్యగారి చెవిలో అసలు విషయం వడెయ్యాలని చూస్తూనే వున్నాడు.

పిల్లాడు అనుపమకంటే నళినికే ఎక్కువ చేరువయ్యాడు.

"అమ్మ ఏది నాన్నా" అంటే ఒక్కొక్కసారి నళినిని, మరోసారి అనుపమని చూపిస్తూ కేరింతలు కొడుతున్నాడు.

సావిత్రి నెమ్మదిగాలేచి నాలుగు అడుగులు వెయ్యలేకపోతున్నా- కాస్త నడుస్తోంది. ఆమె మనవడ్ని చూసుకుని మురిసిపోతోంది.

ఆరోజు రాజారావు వచ్చాడు. అప్పటికి ఆరు నెలలకిపైనే అయింది నళిని యిక్కడికి వచ్చేసి. అయినా ఆమెకి తిరిగి భర్తగారి వూరు వెళ్ళాలనే ధ్యాసేలేదు. యిరవైనాలుగు గంటలూ పిల్లాడి ధ్యాసే. వాడి ముచ్చటే వాడి ముద్దులే. రాజారావు తరుచూ వచ్చి వెళ్తున్నా ఎప్పటికప్పుడు నళిని పిచ్చిధోరణి చూసి, ఇన్నాళ్ళకి ఆమె ఆనందంగా వుందికదా అనుకుని, అక్కడే వదిలేసి వంటరిగానే తిరుగు ప్రయాణమవుతూవున్నాడు. కానీ ఎన్నాళ్ళు? దీనికి అంతమెక్కడిది? ఎప్పుడో ఒకరోజున నళిని బయలుదేరక తప్పదు కదా! అదేదో అనుబంధాలు మరీ బిగుసుకోకముందే చేయడం మంచిదని అతని కనిపించింది.

అందుకే వస్తూనే నళిని తిరుగుప్రయాణం గురించి ప్రస్తావించాలని నిర్ణయించుకున్నాడు.

అయితే అన్నీ అనుకున్నట్లుగా జరగవు. కొన్ని అనుకోనివీ జరుగుతూంటాయి. అంతక్రితమే యాదగిరి మధు అభిప్రాయం రాఘవేంద్రరావు చెవిలో వేసివుండటంతో, అతను రాజారావు రాకకోసం తహతహలాడుతూ ఎదురుచూస్తున్నాడు. ఎప్పుడు రాజారావు వస్తాడా? అతనికీ విషయం చెప్పి, భవిష్యత్తు కార్యక్రమం నిర్ణయించుదామా అనే వుత్కంఠతో ఎదురుచూస్తున్న సమయంలో రాజారావు యింట్లో అడుగుపెట్టాడు.

యాదగిరి, రాఘవేంద్రరావుగారితో మాట్లాడిన సంగతి తెలియగానే మధు మరింత రిజర్వుడుగా, దూరంగా వుండసాగాడు. అతనికి లోపల కొంత సంకోచం, కొంత భయం వున్నాయి. తను మరీ కలిసి మెలిసి తిరిగితే అపార్థం చేసుకోవచ్చు. ఈ ధనవంతులు అవమానపరచటంలో ఆవగింజంతైనా ముందూ వెనకా ఆలోచించరు.

ఒక్కసారిగా మధు ఆలోచనలు ఆగిపోయాయి. ఏమిటి? రేపు తనొక లక్షాధికారినయితే? అప్పుడు వేరు. ఎవరినెలా ఆడించాలో తను నిర్ణయించుకోగలడు.

రాజారావు విషయంవిని గంభీరంగా అయిపోయాడు. ఒక్కక్షణం అతని తల దిమ్మెక్కిపోయింది. ఎన్నాళ్ళనుంచో మధుని చూస్తున్నా గమనిస్తున్నా ఇలాంటి ఆలోచన తనకెప్పుడూ రాలేదు. అతని కులం తమ కులమే అయినా, ఆవిధంగా సాటివాడే అయినా, ఆర్థిక అసమానతవలన మధుని చూస్తే అతనెప్పుడూ తనను ఆశ్రయించిన అర్భకుడిగానే తోచాడుగానీ, మరోలా తోచలేదు.

మనిషికి మొదట కావాల్సిందీ, గణనీయమైనదీ డబ్బు. దానివలన వచ్చే హోదా. ఆ తర్వాతే ఈ కులాలు, మతాలు, వాటి ప్రాముఖ్యాలు.

అడ్డుపెట్టుకోడానికి అవతలకి విసిరేయడానికి ఈ కులమతాలు బాగా అక్కరకు వస్తాయి.

లక్షలకీ, కోట్లకీ పడగలెత్తినప్పుడు సాంఘిక ధర్మాలు, ఆచారాలు చాలా మారిపోతాయి. తారుమారవుతాయి.

అనుకున్నదానికన్నా రెండు రోజులు ఎక్కువే వున్నాడు రాజారావు. చిన్నాన్నతో మధు విషయంలో రకరకాల యోచనలు చేశాడు. ఎన్నో సమస్యలు చర్చించాడు.

"మనకళ్లముందు బాగుపడి, బట్టకట్టినవాడు మన మాటంటే విలువ యిస్తాడు"

"సాటి కులంవాడు! డబ్బా! అది మనకి లేదుకనుకనా"

"అన్నీ ఆలోచించి మళ్ళీ మొదటికొస్తే అసలు అనుపమకి మనం మరో పెళ్ళి చెయ్యగలమా?"

"ఇరవైఏళ్ళు నిండని అనుపమ మగతోడు లేకుండా మోడులా ఎన్నాళ్ళు బతగ్గలదు?"

"పిల్లాడ్ని ఎలా భరించగలదు"

"వాడికి విద్యాబుద్ధులెలా చెప్పించగలదు"

"ఈ పద్ధతిలో అయితే పిల్ల, మనవడు మన కళ్ళఎదురుగానే వుంటారు"

ఇలా రకరకాల ప్రశ్నలు వేసుకుని జవాబులు చెప్పుకుని తృప్తిపడ్డారాయిద్దరూ.

ఏది ఏమైనా మగతోడు లేకుండా ఆడది బ్రతకడం దుర్లభం అని తేల్చారు చివరికి.

"పైగా, అనుపమయందు జాలితో ఆమె జీవితానికి ఒక అండ కల్పించటంకోసం అతను నిజంగా త్యాగానికి సిద్ధపడ్డాడు. కాదనగూడదు" అని మధు సంస్కారాన్ని కొనియాడుకున్నారు.

చివరికి ఇద్దరూ కలిసి ఒక నిర్ణయానికొచ్చారు. అదేమంటే అనుపమనిచ్చి మధుకి నిరాడంబరంగా పెళ్ళిచేసేసి, బాధ్యత తీర్చుకోవాలి. ఆస్తిని, అమ్మాయినీ అతను అనుభవిస్తూ, మనకి అండదండగా వుంటాడు.

అదే వారివారి మాటల్లో, భావాల్లో ఏర్పరచుకున్న స్థిరనిశ్చయం.

ఎంతో మారుతున్నామనీ, అభివృద్ధిపథంలో పయనిస్తున్నామనీ బోర విరుచుకు తిరుగుతున్నా, సమస్య ఎదురైనప్పుడు చాలా ఛాందసంగా, చాలా అనాగరికంగా మాత్రమే ఆలోచించటం జరుగుతోందనీ వారిద్దరికీ అనిపించలేదు.

అనుపమ హృదయమున్న మనిషని, ఆలోచనవున్న అభాగ్యురాలని, ఇష్టాయిష్టాలువున్న ప్రాణి అని, దెబ్బతిన్న ఆ హృదయం ఈ గాయాన్ని మర్చిపోడానికి కొంత సమయం కావాలనీ,

అన్నిటికీమించి, ఇలాంటి జీవిత సమస్యగురించి ఒక నిర్ణయం తీసుకునేప్పుడు ఆమె అభిప్రాయం, ఆమె యిష్టం ముఖ్యమనీ వారికి అనిపించలేదు. అసలు నిర్ణయానికిముందే ఆమెతో సంప్రదించాలని వారికనిపించలేదు. ముందు తాము అన్నీ చర్చించి నిర్ణయిస్తే ఆ ప్రకారం ఆమెకు నచ్చచెప్పవచ్చునని వారి ఉద్దేశ్యం.

ఎంతో ప్రేమించే వారమ్మాయిని కూడా వారే మళ్ళీ ప్రాణం, హృదయంలేని వస్తువులాగానే భావించారు.

వారు చెప్పింది విన్న అనుపమ ఒక్కసారి తాచుపాములా బుసకొట్టింది. నేను మనిషినను కుంటున్నారా? లేక దొడ్లో కట్టేసిన పశువునను కుంటున్నారా?" అని నిలేసి అడుగుతూనే భోరున ఏడ్చింది.

రాజారావు బుజ్జగించాడు.

"అన్నయ్యా! నాకేమీ వద్దు. నన్నిలా బతకనీయండి" అని ప్రాధేయపడింది.

"అదికాదమ్మా అనుపమా! నా మాట పూర్తిగా విను. ఇప్పుడు నీకొచ్చిన బాధేమీ లేదు. నీకు పరాధీనతేమీ లేదు" అన్నాడు.

"నాకొద్దు... నేనెవరితోనూ మళ్ళీ మరో జీవితం ప్రారంభించలేను"

"అలాగంటే ఎలాగూ! భగవంతుడు నిర్దయగా చూశాడు. అంతమాత్రాన అడవిగాచిన వెన్నెలలా వుండిపోతావా?"

"మీరేంచేసినా, నా బతుకు పున్నమినాటి వెన్నెలేమీ కాదన్నయ్యా"

"కాదు. నువ్వలా అనడానికి వీలులేదు. చిన్నపిల్లవు. తోడులేకుండా నిండు నూరేళ్ళు బతకడం కష్టం తల్లీ"

"అన్నయ్యా..." భోరుమంది అనుపమ.




''ఈ సమాజం అండలేని ఆడదానిమీద ఎలాంటి అభాండాలు వెయ్యడానికి వెనుకాడదమ్మా''

''నా బిడ్డని వదిలి నేనొక్క క్షణం వుండలేను''

''నిన్నెవరలా వుండమన్నారు. నీ బిడ్డ నీ ఒడిలో పెరుగుతాడు. ఈ ఇంటికి మహారాణివి నువ్వు. నీ యిష్టానికి ఎదురుండదు. అతను నీకొక తోడు, నీ మంచిచెడ్డలు చూసే అంగరక్షకుడు... అంతే''

''నాకు మధుమీద అలాంటి భావమే లేదు అన్నయ్యా''

''ఇకముందు కలిగించుకో తల్లీ''

''అదంత సులభమా?''

''ప్రయత్నిస్తే, అసాధ్యమేదీ వుండదు. జీవనమార్గం, దారితప్పినప్పుడు సర్దుకుపోక తప్పదమ్మా''

ఏడుస్తూ కూర్చుంది అనుపమ. కొడుకుని గుండెలకదుముకుని మరీ ఏడుస్తూ కూర్చుంది.

''నాభర్తంటే నాకెంతో ప్రేమ. మేము కలిసి జీవించింది నెలే అయినా, అదే నాకీ జన్మకి చాలనిపిస్తుంది. నాకాయన అన్యాయం చేశారని ఏ ఒక్కక్షణమూ నాకనిపించదు. మా ఇద్దరికీ ఆ భగవంతుడే తీరని ద్రోహంచేశాడు''

''నిజమే... అతను చనిపోయాడు కనుక అతనికి సమస్యలేమీ లేవు''

''పోనీ... నేనూ చచ్చిపోతాను. ఎవరేనా నా బిడ్డని జాగ్రత్తగా పెంచి పెద్దచేయండి''

''తప్పు, తప్పు అనుపమా! ఏమిటా మాటలు? ఇలాంటి అశుభం మాటలు వినడానికా నిన్నింత బతిమాలుతున్నది?''

రాజారావు అక్కడితో ఆ సంభాషణ ఆపే యదల్చుకున్నాడు. అందుకే నెమ్మదిగా లేచి,

''ఏడవకమ్మా! ఆలోచించు. బాగా ఆలోచించు. నీ మంచికోరీ, మోడువారిన నీ జీవితం చిగురించాలనీ, ఈ ప్రయత్నాలన్నీ చేస్తున్నా నామటుకు నేను ఎంతో కుమిలిపోతున్నా నాద్వారానే నీకు పెళ్ళికుదిరింది. అంతా నా భుజస్కంధాలమీదే జరిగింది. అందుకని నేనే నీకు ఏదో ద్రోహంచేసినట్లు కుమిలిపోతున్నాను. పోనీ... ఇలాగైనా ప్రాయశ్చిత్తం చేసుకోగలనా? నిన్ను పచ్చగా చూడగలనా అని ఆశ. నీ యిష్టం. ఆలోచించి చెప్పు. నువ్వీ పెళ్ళికి ఒప్పుకుంటే నాన్నకి శాంతి, అమ్మకి ఆనందం, నాకు కొంత తృప్తి వుంటాయి''

రాజారావు ఆ మాటలు అని అక్కడ్నించి వెళ్ళిపోయాడు. అప్పుడే అక్కడికొచ్చిన నళిని పిల్లాడ్ని అందుకుని, ''మధుకి నువ్వంటే ఎంతో యిష్టం'' అంది.

అనుపమ ఏమీ సమాధానం చెప్పలేదు. పాతజ్ఞాపకం మనోవల్మీకంలో కదిలి కాటేసింది.

గొబ్బిపూలు కోస్తూ - ''నీకిష్టంలేకపోతే పెళ్ళికొడుకు నచ్చలేదని ధైర్యంగా చెప్పేయి'' అన్న మధు మాటలు గుర్తుకొచ్చాయి.

''నిజం అనూ! నువ్వు ఏడుస్తూ పడుకుంటే ఆ మూడురోజులూ పచ్చి మంచినీళ్ళు ముట్టలేదు మధు. నీచేత బలవంతంగా గుక్కెడు పాలు తాగించిగానీ వూరుకోలేదు''

అన్నీ నిజమే. కానీ అవన్నీ మనిషికీ మనిషికీ మధ్యనున్న మానవ అనుబంధం. అంతేగానీ, అదొక అనురాగ బంధంగా తను అనుకోలేదు. అతను చేతులకి తొడిగిన ఎర్రటి మట్టిగాజులు కళ్ళల్లో మెదిలాయి.

ప్రతి వ్యక్తికీ కొన్ని బలహీనమైన క్షణాలు వుంటాయి. వాటికి నిర్వచనాలు చెప్పడం కష్టం. వాటికి మనోభావాల రంగులు వేయడం కూడా కష్టం.

అనుపమ మనసు గందరగోళంగా వుంది. అతను తనయందు చనువుగా వుంటే తను ఆలంబన చేసుకుంది. అప్పుడు తన అలసిన మనసుకి ఓదార్పుకోసం పడిన తాపత్రయం. అంతేగానీ, అతన్ని తన జీవితంలోకి ఆహ్వానించే శక్తి తనకెక్కడిది?

ఇంట్లో వాతావరణం ఒక్కసారి పూర్తిగా మారిపోయింది. మధుని చూసేతీరులో విపరీతమైన మార్పు వచ్చింది అందరిలోనూ. ఇంట్లోని పనివాళ్ళు, పాలేర్లూ అతనికి దండాలు పెట్టడం మొదలుపెట్టారు. రాఘవేంద్ర

రావు, సావిత్రి మధుని పిలిచే తీరులో ఆప్యాయతా, గౌరవం పెరగాయి. తమపై దయదలచి దివినుండి దిగివచ్చిన దేవుడిగా అతను కనిపిస్తున్నాడు. ఆ యింట్లో ఏ మార్పూ లేకుండా స్థబ్దంగా, నిర్లిప్తంగా వుండిపోయింది ఒక్క అనుపమ మాత్రమే.

మధుకి ఎంతో వుత్సాహంగా వుంది. తనకి కొత్తగా వచ్చిన గౌరవ మర్యాదలు ఎక్కువ ఆనందాన్నిస్తున్నాయి. దారినపోతుంటే రాజ సింహాసనం అధిష్ఠించమని దేవాలయపుటేనుగు పూలమాల తెచ్చి వేసినట్లుగా వుంది మధు పరిస్థితి. రకరకాల వూహలు, ఆశలు అతన్ని ఊపేస్తున్నాయి. ఆ వూహల్లో అతనికి అనుపమ అందచందాలుగానీ, ఆమె అణకువగానీ, అమాయకత్వంగానీ, కనిపించటంలేదు.

రాఘవేంద్రరావుకి ఎక్కడెక్కడ పొలాలు వున్నాయి. రైసుమిల్లు ఆదాయం ఎంత? అక్కడెందరు పనిచేస్తున్నారు? సా మిల్లు ఇంకా ఏవిధంగా డెవలప్ చెయ్యవచ్చులాంటి వూహలే అతన్ని వుక్కిరిబిక్కిరి చేస్తున్నాయి.

రోజులు గడుస్తున్నకొద్దీ అనుపమలో రాజీధోరణి కనిపిస్తోంది. అప్పుడప్పుడు కాఫీ కలిపి తనే మధుకి ఇచ్చేంతవరకు వచ్చింది. కానీ అలాంటి సమయంలో ఆమె మనసు రాహుల్‌కి, మధుకి వున్న వ్యత్యాసం గమనించకుండా వుండలేకపోతోంది. కళ్ళు మూసుకున్నా హృదయఫలకంమీద ముద్రింపబడిన రాహుల్ బొమ్మ చెరపడం అనుపమకి అంత సులభసాధ్యం కాలేదు. ఎదురుతిరుగుతున్న మనసుని అనుక్షణం జోకొడుతూ, వర్తమానంలోంచి భవిష్యత్తుకి వంతెనవేస్తోంది.

ఆవేశంతో, ఆవేదనతో ఒక్కొక్క తుఫాను దెబ్బతగిలీ, ఒక్కొక్క వుప్పెనదెబ్బ కొట్టీ, కట్టిన వారధి కూలిపోతూనేవుంది. మళ్ళీ మళ్ళీ మొదలుపెడుతూనేవుంది అనుపమ.

సరిగ్గా ఆ రోజుకి రెండునెలల తర్వాత అదేరోజున తిరుపతి కొండమీద అనుపమ, మధుల పెళ్ళి జరిపేందుకు నిర్ణయమైంది.

అత్యంత ముఖ్యులికిమాత్రం వర్తమానం, ఆహ్వానాలు పంపాలనుకున్నారు.

మళ్ళీ నెల్లాళ్ళ తర్వాత తిరిగి వస్తామని రాజారావు, నళిని యింటికి ప్రయాణమయ్యారు. నళిని బయలుదేరుతూ వెక్కివెక్కి ఏడ్చింది పిల్లాడ్ని వదలలేక. అనుపమ ఆమెని ఎంతో సముదాయించింది.

''వదినా! వీడు నీకొడుకే అనుకో. ఒక్క నెల్లాళ్ళేగదా! వెళ్ళిరా'' అంది.

''అంతమాటన్నావు - అదేచాలు. కానీ అనూ! వాడికి పాలు జాగ్రత్తగా పట్టు. మరీ ఆకలేసినప్పుడు గబగబ తాగేసి, వుక్కిరిబిక్కిరైపోతాడు'' అంది కళ్ళనీళ్ళతో.

అనుపమ ఆశ్చర్యంగా నళినివైపు చూస్తూండిపోయింది. ఈ పసివాడికి తల్లిని నేనా? వదినా? అనుకుంది.

''అన్నం పెట్టినప్పుడు బాగా మెత్తగా కలిపి, ఎక్కువ నెయ్యివేసి, కొద్దిగా పప్పుతో కొంచెంకొంచెం పెట్టు. బుగ్గల్లో దాచేసి - రెండో ముద్దపెట్టగానే ఓక్ అంటాడు'' అంది నళిని.

అనుపమ నీళ్ళునిండిన కళ్ళతో ఒక్కసారి పిల్లాడ్ని ఆమెకి అందించింది. నళిని వాడ్ని ముద్దులతో ముంచెత్తి - 'వెంటనే వచ్చేస్తా నాన్నలూ' అంటూ తిరిగివ్వబోయింది. వాడు నళిని మెడచుట్టూ చేతులువేసి వెనక్కి చుట్టుకుపోయి అనుపమదగ్గరికి వెళ్ళనన్నాడు.

''దా నాన్నా! నా బంగారు కొండా, రారా! నువ్వు లేనిదే నేనొక్క క్షణం బతకలేనురా!'' అంటూ బతిమాలింది అనుపమ.

పసివాడు నెమ్మదిగా అమ్మదగ్గరకొచ్చాడు. నళిని, రాజారావు ఎక్కిన కారు కనుమరుగయ్యేవరకు చూస్తూండిపోయారంతా.

మధు వ్యాపార విషయాలు మాట్లాడుతున్న తీరు చూసి, రాఘవేంద్రరావు ఆనందం, ఆశ్చర్యంతో వుక్కిరిబిక్కిరయ్యాడు.

ఫిషరీస్ వ్యాపారం లాభసాటిగా వుంటోందనీ, చేపల్ని పెంచేందుకు చెరువులు ఏర్పాటుచేసి, దీన్నో పరిశ్రమలా చేపడితే గవర్నమెంటు కొంత పెట్టుబడి యిస్తుందనీ, అలాంటి వ్యాపారం ఈ చుట్టుపక్కల లేదనీ, అలా అలా చాలా విషయాలు చెప్పాడు. ఇవన్నీ విని రాఘవేంద్రరావు ఆనందపడుతూనే దుఃఖపడ్డాడు. ఇంట్లో వజ్రాన్ని పెట్టు




కుని గాజుపూసని వెదికి తెచ్చి, అది చేజారిపోయాక బాధపడుతున్నానుకదా అని లోలోపల కుమిలిపోయాడు.

రాజారావుకీ విషయాలన్నీ తెలిపాడు. అతను కూడా అలాగే అనుకుని బాధపడ్డాడు.

ఏది ఏమైనా ఇప్పటికైనా అనుపమ జీవితం సుఖమయమై, ఆనందంగా గడిచిపోతే బాగుండును! అని వారు దేవుడికి పదేపదే మొక్కుకున్నారు.

పెళ్ళికి రోజులు దగ్గరపడుతున్నకొద్దీ మధులో వుత్సాహం వురకలు వేయడం మొదలుపెట్టింది. అనుపమమాత్రం అలాగేవుంది.

ఈలోగా ఫిషరీస్ బిజినెస్‌కోసం సంప్రదించటానికని మధు రెండుసార్లు కలకత్తా వెళ్ళి వచ్చాడు. అతనిలో వురకలు వేస్తున్న వుత్సాహం చూసి యాదగిరి ఆనందపడ్డాడు. రాఘవేంద్రరావు సంతృప్తి పొందాడు. ఎంత దెబ్బతిన్నప్పటికీ అనుపమ అదృష్టవంతురాలే అనుకుని సావిత్రి సమాధానపడింది. ఇంట్లో నౌకర్లు చిన్నయ్యగారి చలాకీతనానికి మురిసిపోతున్నారు.

అనుకున్న ప్రకారం తిరుపతికొండమీద దేవుడి సమక్షంలో పెళ్ళి నిరాడంబరంగా, ఓ యాభైమంది ఆత్మీయులు అక్షింతలు వేయగా జరిగిపోయింది. అనుపమ చెక్కిన పాలరాతి బొమ్మలా కూర్చుంది గానీ, ఆమెలో ఎటువంటి కదలికా లేదు. ఆ సమయంలో పిల్లవాడిని ఎత్తుకుని నళిని అక్కడక్కడే తిరిగింది. కానీ వాడు ఒక్క క్షణం కూడా వూరుకోకుండా గుక్కపెట్టి ఏడవడం మొదలుపెట్టాడు. వాడిని సముదాయించటం కోసం దూరంగా తోటల్లోకి తీసుకెళ్ళింది నళిని.

కొడుకు ఏడుపు వినగానే రాయిలా వున్న అనుపమ గుండెలో కన్నీటి వాగులు పొంగాయి. అవి చెంపలమీద జారడం అందరూ చూశారు. ఆమె ఆ కన్నీళ్ళు దాచుకోడానికి కూడా పెద్దగా ప్రయత్నం చెయ్యలేదు. అయితే చూసిన అందరూ జాలిపడ్డారుగానీ మరోలా అనుకోలేదు. అదెంతో సహజమే అనిపించింది. మధు కనుబొమ్మలు ముడిపడటం మాత్రం ఎవ్వరూ గమనించలేదు. పెళ్ళి తతంగం పూర్తయ్యేసరికి పిల్లాడు ఏడ్చిఏడ్చి సొమ్మసిల్లిపోయాడు. ఆ కార్యక్రమం అయిందో లేదో, అనుపమ పిల్లాడిని తీసుకుని ఒళ్ళో పడుకోబెట్టుకుని ఓదార్చింది. క్షణంలో వాడు తల్లి పొట్టలో దూరి ఏడుపుమానేశాడు.

నుదుట కళ్యాణం బొట్టుతో, మధుపర్కాలతో, కొత్త మంగళసూత్రాలతో, జడలో పువ్వులు, చేతుల నిండా గాజులుతో ఆ పెళ్ళికూతురు అలా పసివాడిని లాలిస్తున్న తీరు చూసేవారికి విధివైపరీత్యాన్ని వెక్కిరిస్తున్నట్లుగా వుంది. చూసిన వాళ్ళ మనసులు బరువెక్కాయి. అంత అలంకరణలోనూ, అనుపమ ముఖంలో పెళ్ళి కళలేదు.

అది సాంఘికపరమైన సర్దుబాట్లకీ, అంతరంగిక అనుభూతులకీ మధ్య జరుగుతున్న మౌనపోరాటం.

ఆ రాత్రి పిల్లాడిని నళిని తన దగ్గరే వుంచుకోవాలని ఎంతో ప్రయత్నం చేసింది. కానీ ఆ పసివాడికేమర్థమైందో, వాడు తల్లిని వాటేసుకుని, బల్లిలా కరచుకుపోయాడు.

ఆ పసివాడిని బాధించి, వాడిని దూరంగా వుంచటం రాక్షసంగా అనిపిస్తోంది అనుపమకి. పైగా అప్పుడు మధుతో సంసార బంధాల నేర్పరచుకోవడంలో ఆమెకెంత మాత్రమూ బాగా లేదు. పైగా చాలా చిరాకుగా, జుగుప్సగా కూడా వుంది. అందువల్ల ఆమె కూడా పిల్లాడిని మరింతగా కరుచుకుపోయిపడుకుంది.

సావిత్రి కూతురి దగ్గర కూర్చుని ముద్దుముద్దుగా బుజ్జగించింది.

"నీ సుఖంకోసం, నీ సౌభాగ్యం కోసమేకదమ్మా! ఇదంతా చేసింది. ఎలాంటి ఆక్షేపణలు వచ్చినా ఫర్వాలేదు. నువ్వు ఆనందంగా వుంటే చాలని కదా, మేమింత గుండెరాయి చేసుకున్నాము. మధు అంటే ఎవరు? మన కళ్ళముందు మసిలే మనిషేకదా! మంచి పిల్లవు బాబుని నేను చూసుకుంటాను గానీ నువ్వెళ్ళు" అంది.

"అమ్మా! నన్ను బాధించకండి. విసిగించకండి. నాకేమాత్రం యిష్టం లేదు"

"తప్పు అలా అనకు. ఒక్కరోజు అదే మొదటిరోజు కొంచెం సర్దుకో.

"నాకేం బాగాలేదమ్మా"

''తప్పమ్మా నీకు ఎలావున్నా అతనికిది మొదటి రాత్రి ఈ ఒక్క రోజూ సర్దుకో. ఆడవాళ్ళం సర్దుకోవాలి, ఆ తర్వాత ఏముంది? అంతా నీ యిష్టమే''

అనుపమ అయిష్టంగా కదిలింది. ఒళ్ళో బాబు వులిక్కిపడి లేచి ఏడుస్తూ తల్లిని కౌగలించుకున్నాడు. సావిత్రి విసుక్కుంది, ''ఏం పిల్లాడే మా తల్లీ, ఏ ముహూర్తాన కడుపునపడ్డాడో, నా చిట్టితల్లి ప్రాణాలు లాగేస్తున్నాడు'' అంది చిరాకుగా.

''అమ్మా! నువ్వు మరొక్కమాట అన్నావంటే నా శవాన్ని చూస్తావు. వీడు నాకు ప్రాణం'' విసురుగా అంది అనుపమ.

సావిత్రి నోరు నొక్కుకుంది ''నెమ్మదిగా మాట్లాడే నా తల్లీ'' అంది ఏడుపు కంఠంతో.

అనుపమ చిన్నప్పటినుండీ అల్లారుముద్దుగా పెరిగింది. కొండమీద కోతి కావాలంటే క్షణాల మీద వచ్చేది. ఆమె వద్దన్న ఏ పనీ ఆ యింట్లో జరిగేది కాదు. కానీ ఇప్పుడు అంతా తారుమారైంది. దానికి ఆమె అర్ధాంగీకారం కూడా కొంతవరకు కారణమైనా, ఆమెకిప్పుడు చాలా విసుగ్గావుంది.

అప్పుడు నళిని వచ్చి అనుపమని సర్దింది. ''తప్పు... ఈ రోజునుండీ నువ్వు సర్దుకుపోవడం నేర్చుకోవాలి. అంతా నీ సుఖం కోసమే. నీ జీవితం కోసమే'' అంది.

''హూ! నా సుఖం! నా జీవితం! నిజంగా మీరంతా నా గురించి అంత శ్రద్ధ వహిస్తే, ఇప్పుడే ఇలాంటి పరిస్థితిలో ఇరికిస్తారా?'' అంది.

''చాల్లే వూరుకో, హాయిగా అన్నీ మర్చిపోయి సుఖంగావుండు. నిన్ను పూలతో పూజించేవాడు దొరికినందుకు ఆనందపడు'' అంది.

అనుపమ వెంటనే సమాధానమేమీ చెప్పలేదు. నళిని వొడుపుగా బాబుని ఎత్తుకుని, గుండెలకదుముకొని తీసుకెళ్ళిపోయింది.

చీకటి పడిపోయి చాలా సేపయింది. కొండమీద చల్లగా హాయిగా వుంది, అనుపమతో మొదట ఎలా మాటలు కలపాలా అని తీవ్రంగా ఆలోచిస్తున్నాడు మధు. అతనికొకపక్క ఆనందంగా ఆశ్చర్యంగావున్నా, మరోపక్క ఆందోళనగా, బెరుకుగా కూడా వుంది.

రకరకాల ఆలోచనలు అతని బుర్రలో రొద చేస్తున్నాయి. ఇంతకాలం కార్యార్థియై సాగించిన ఆలోచనల అడుగునుంచి ఒక్క మెరుపులాంటి అహంకారం అతన్నిచుట్టుముట్టింది. అదీ పురుషాహంకారం. తనకి ఎంతో అపురూపమైంది ఈ తొలి రాత్రి. కానీ... కానీ... కానీ... అనుపమకిది తొలి రాత్రికాదు. ఆమెకీ అనుభవం తొలి అనుభవం కాదు. ఆమె నెల్లాళ్ళు మరొకరితో సంసారసుఖాలు అనుభవించి, బిడ్డకి తల్లి కూడా అయింది. ఆమె యిప్పుడు...

అతని మెదడు ఒక్కసారి విచిత్రమైన బాధతో మూల్గింది. అయితే అతను ఒక్కసారి తెలివితెచ్చుకున్నాడు. ఆలోచన మళ్ళించుకున్నాడు. వెంటనే అతని కళ్ళముందు పొలాలు, మిల్లులు, డబ్బు మెదిలాయి. అతనొక అరగంట కళ్ళుమూసుకుని కూర్చున్నాడు. అనుపమ వచ్చిన అలికిడికి కళ్ళు తెరుస్తూ అనుకున్నాడు, తనలోవున్న అలజడి ఆమెకి కనిపించకూడదని.

అయినా కళ్ళెదురుగా కనిపించిన అనుపమని చూసి తనని తను నిగ్రహించుకోలేకపోయాడు. ఆమెలోవున్న బాహ్యసౌందర్యం వొంపులూ సొంపులూ పిచ్చెత్తించి వేశాయి.

అంతే అతను ఆబగా, ఆశగా ఆమెని వాటేసుకున్నాడు. ఆమె వుక్కిరిబిక్కిరైంది. మధు స్పర్శలో ఆమెకి తేళ్ళూ జెర్రులు వంటిమీద పాకుతున్న భావన కలిగింది. వెంటనే రాహుల్ గుర్తుకొచ్చాడు. కళ్ళల్లో చివ్వున నీరూరింది. ఆ రాత్రి, నిన్ననో మొన్ననో అన్నట్లుంది. అతనెంతో నెమ్మదిగా మాట్లాడి, ఎంతో స్నేహం చేశాడు. ఎన్నో కబుర్లు చెప్పి అలరించాడు. కానీ ఇలా, మీదకి వురికి వాటేసుకోలేదు.

అనుపమ ఆలోచనలు ఎక్కడోవున్నాయి. అన్యమనస్కంగావున్న ఆమె శరీరం స్పందనలేని కట్టెలా వుంది. అతను మాత్రం అది గ్రహించే స్థితిలో లేనట్లు వ్యవహరిస్తున్నాడు.

''హూ'' ఆమె అతని కౌగిలినుంచి విడిపించుకుంటూ నెమ్మదిగా మూల్గింది.

''ఏం? నేనంటే యిష్టంగా లేదా?''

మధు నోటినుండి వచ్చిన మొదటి మాట విని అనుపమ వులిక్కిపడింది, వెంటనే ఏం సమాధానం చెప్పాలో తెలీలేదు. కానీ ఏదీ చెప్పకపోతే అతనేమనుకుంటాడో... వదిన చెప్పిన మాటలు గుర్తుకొచ్చి తనకీ జీవితమంతా రాజీపడటమేనా అని బాధపడుతూనే "అదేమీ కాదు" అంది.

మరేమిటి? నీకు తొందరగా లేదా? నేను మాత్రం ఒక్కక్షణం ఆగలేకుండా వున్నాను" అన్నాడు వుద్రేకంతో తమకంతో. అతని కళ్ళనిండా కాంక్ష అనుపమ ఏదో అనబోయింది అంతలోనే బాంబు పేలింది.

"అవున్లే నీకిదే మొదటిసారి కాదుగా, మరి నా సంగతి ఆలోచించు"

అనుపమ హృదయంఒక్కసారి తునాతునకలైపోయింది. మనసునిండా అసహ్యం, జుగుప్స.

ఇతనా తనను ప్రేమించిన వ్యక్తి?

ఇతనా తన కోసం త్యాగం చేసినవ్యక్తి? ఇతని సంస్కారం ఇదా?

అనుపమ మనసు తూట్లుపడినట్లయింది. పందొమ్మిది సంవత్సరాల వయస్సులో మొదటిసారి సంసార జీవితంలో పాదం మోపిన అనుపమ ఇరవై రెండేళ్ళకి రెండోసారి వివాహ బంధానికి బంధితురాలైంది.

ఆ తర్వాత క్షణంలో మధు అనుపమ అజ్ఞకోసం, సహకారం కోసం ఎదురు చూడలేదు. బలంగా ఆమెని చుట్టుకుని, బలవంతంగా ఆమె మీదకి ఎగబ్రాకాడు. అతను ఆమెయందు సర్వహక్కులు పొందిన 'భర్త' అందువల్ల ఆమె అరిచినా, నోరెత్తినా, అప్రతిఘటనా, మాన రక్షణ జరగదు. గుండెలనిండా దుఃఖం. శరీరమంతా అశక్తత.

ఈ అనుభవం ఇంత చేదుగా, వెగటుగా కూడా వుంటుందా... అనుకుంది అనుపమ.

కోర్కెతీరిన అతను అలసటగా వొరిగాడు. అనుపమకాక్షణంలో ఎక్కడికైనా, ఎవ్వరికీ కనిపించని చోటుకి రెక్కలు కట్టుకుని ఎగిరిపారిపోవాలనిపించింది.

కానీ ఆమె ఏం చేయలేదు. నెమ్మదిగా లేచింది. అస్తవ్యస్తమైన చీర సర్దుకుంది, రేగిపోయిన జుట్టు సరిచేసుకుంది. మంచం దిగి, కిటికీ తలుపు తీసింది. చల్లని గాలి తల్లిలా అప్యాయంగా వచ్చి ఆమె ముఖాన్ని నిమిరింది. ఒక్కసారి ఎక్కడికోపోయిన ప్రాణం కూడదీసుకుంది శరీరం. ఆకాశంలో ఎదిగీ ఎదగని చందమామ సన్నగా వెలుగుపంచుతున్నాడు. దూరంగా ఎన్నో దీపాలు అంతకు మించిన వెలుగులతో జాబిల్లితో పోటీ పడుతున్నాయి.

అలాగే కిటికీలోంచి బయటకి చూస్తూ మనసుకుదుట పరచుకోసాగింది. ఆమె నెమ్మదిగా పరిసరాల శబ్దాలవైపు చెవులు వుంచింది. దూరంగా ఎక్కడో చంటిపిల్లాడు ఏడుస్తున్నట్లు వినిపించింది. ఆమె గుండె ఝల్లుమంది. అది బాబు ఏడుపే. ఆమె హృదయం గుబగుబలాడిపోయింది. ఒక్కసారి వెనక్కి తిరిగింది తలుపువైపు నడిచేందుకు, కానీ ఆమెకి అత్యంత చేరువలోనే నిలబడివున్నాడు మధు. ఆమె తత్తరపడింది.

"బాబు ఏడుస్తున్నట్లున్నాడు" అంది నంజాయిషీగా. అతనామెని గట్టిగా పట్టుకుని "మరేం ఫర్వాలేదు మీ వదిన చూస్తుందిలే" అన్నాడు.

ఆమె ఒక్కసారి విదిలించింది "వాడు చాలా సేపటినుంచే ఏడుస్తున్నట్లున్నాడు" అంది.

మధు ఆమెని కఠినంగా చూసి రెండు చేతులతో పట్టుకుని కళ్ళల్లోకి సూటిగా చూస్తూ,

"పిచ్చిపిచ్చి వేషాలు వెయ్యకు, నడు" అన్నాడు.

ఆమె దిమ్మెరపోయింది, ఆమెలో కోపంబుసకొట్టింది. పిల్లాడి కోసం మనసు ఏడ్వడమే మొదలుపెట్టింది "ఏమిటి మధూ" అంది గాద్గదికంగా

"అదే చెప్తున్నాను" అంటూ ఆమెని కాస్త వినురుగానే మంచంవైపు లాక్కెళ్ళి కూర్చోబెట్టాడు. ఆమె మధు ప్రవర్తనని అర్ధం చేసుకోలేకపోతోంది.

"జాగ్రత్తగా విను. మధూ, గిధూకాదు, నేను నిన్నటివరకు మధుని కానీ ఈ రోజునుండీ నీ మొగుడిని గౌరవంగా మర్యాదగా పిలవాలి" అన్నాడు. ఆమె సమాధానమేమీ చెప్పలేదు




"బాబూ గీబూ అంటూ గోలపెట్టకు. నా తర్వాతే నీకు అందరూ" అంటూ ఆమెను మళ్ళీ చుట్టేశాడు.

ఆమె ఏడుపు అప్పటికే ఆగిపోయింది. అసలు మధు లోపల ఇలాంటి మరో మనిషివున్నాడని ఆమె ఆ క్షణంలోనే గ్రహించగలిగింది. కానీ గ్రహించి చెయ్యగలిగిందేమీ లేదని కూడా తెలుసుకుంది. ఇంట్లో అందరూ ప్రస్తుతం తనని సముదాయించి మధుకి అర్పించారు. అది తన సుఖమే అంటారు. తనకి దిక్కెవరు? ఇది తనకి సుఖంకాదు నరకం అనుకుంది.

ఆమె కళ్ళనుండి ధారాపాతంగా నీళ్ళుకారుతున్నాయి. అయితే ఆమె దుఃఖంతో మధుకు సంబంధం లేదు.

ఎన్నోరకాల బానిసత్వాలు వుంటాయి. కానీ వాటన్నిటికంటే విభిన్నమైందిది. ఎన్నో రకాల మోసాలు వంచనలు వుంటాయి. వాటితో దేనితోనూ పోలికలేని మోసం, వంచన యిక్కడ వుంది. మనిషికి యిష్టం లేని పనిచేయిస్తూ స్వాతంత్ర్యాన్ని హరించే హక్కు ఎవ్వరికీ లేదు. కానీ, స్త్రీకి మొదటినుండి భద్రత పేరుతో బానిసత్వాన్ని అంటగట్టి అదే పరమార్థం అంటున్నారు. ఈ సంఘంలో స్త్రీవంటరిగా జీవించలేదని భయపెట్టి ఆమెని అశక్తురాలని చెయ్యడానికి అందరూ సిద్ధంగా వుంటారు.



రోజు రోజుకీ పరిస్థితులు అనూహ్యంగా మారిపోవడం బాగా పరిశీలించేవారికి స్పష్టంగా తెలుస్తున్నాయి. కొన్ని సందర్భాలలో యాదగిరి కేవలం ప్రేక్షకుడిలా వుండిపోతున్నాడు. అతను తన నిశితమైన దృష్టితో ఎన్నో విషయాలు అర్థం చేసుకున్నానని గర్వపడ్డాడు గానీ, తనింకా ఎంతో తెలుసుకోవాల్సింది వుండిపోయిందని భావించటం ఇపుడే మొదలుపెట్టాడు. మధు మారుస్తున్న రంగులు అతనికి అయోమయంగా తోస్తున్నాయి. పెళ్ళయి ఆ యింటి అల్లుడి హోదా పొందేవరకు మధు యాదగిరితో మసిలిన దానికీ, యిప్పుడున్న తీరుకీ తేడా గమనించి ఆశ్చర్యపోతున్నాడు.

ఇప్పుడు మధు ఎవ్వరితో కలవకుండా సీరియస్‌గా తన పనిచూసుకుంటున్నాడు. పనిలో కూడా హోదా పెంచుకున్నాడు. మొన్నమొన్నటిలాగా అతను గుమాస్తాపని చేయడం లేదు. అతను యజమాని ధోరణిలోనే మసులుకుంటున్నాడు.

నిజానికి ఇవన్నీ రావలసిన, కావలసిన మార్పులే అయినా, తీరా కళ్ళెదురుగా కనిపిస్తుంటే ఆశ్చర్యపోతున్నారందరూ.

ముఖ్యంగా డబ్బు వ్యవహారాలన్నీ మధు స్వయంగా చూస్తున్నాడు. ఇప్పుడు ఇంట్లో ఇనప్పెట్టి తాళాలు అతని దగ్గరే వుంటున్నాయి. ఇదంతా బాగానేవున్నా, అతనికి ఆ చంటి కుర్రాడిని చూస్తే ఎందుకో చిరచిరగా వుంటుంది. అది బయట పడీపడకుండా ఒక్క అనుపమకి మాత్రమే అర్థమవుతోంది. కానీ ఆమె ఆ బాధ ఎవరికి చెప్పుకుంటుంది?

ఆ రోజు నళిని బయలుదేరి రాజారావుతో వాళ్ళ వూరు వెళ్ళిపోయింది. ఇల్లు బోసిపోయింది. ఒక వంట మనిషి, ఇద్దరు పనిమనుషులు కాక కేవలం పిల్లాడిని ఎత్తుకునేందుకు ఆడించేందుకు ఒక పిల్లని కూడా అమర్చుకున్నారు. అయినా నళిని వెళ్ళిపోవడంతో అందరూ ఎంతో వెలితిగా బాధపడ్డారు.

ఆ రాత్రి అనుపమ పిల్లాడిని ఎత్తుకుని తెచ్చి, తన గదిలో మంచం మీద తనప్రక్కనే పడుకోబెట్టుకుంది. ఆమె మనసులో ఎన్నో ఆలోచనలు సుళ్ళు తిరుగుతున్నాయి. ఎల్లుండి బాబు పుట్టినరోజు. అర్భకంగా వున్నాడు. అందంగా, తెల్లగా వున్నా ఆరోగ్యంగా లేకపోవడంవల్ల చిరాకు పెడుతున్నాడు. వీడి

ఆరోగ్యం గురించి శ్రద్ధవహించాలి. రేపొకసారి డాక్టరు దగ్గరకి తీసుకెళ్ళాలి. తన జీవితంలో వీడొక్కడే ఆత్మీయుడు. ఆశాజ్యోతి. వీడే లేక పోతే తనకేముంది? తను బతకగలదా? ఇలా ఏవో ఆలోచనలు సాగుతున్నాయి. మధు లోప లికొస్తూనే పిల్లాడిని చూసి చిరాకుపడ్డాడు. అనుపమ ఎంతో అభిమానపడింది.

''ఈయనగారు యిక్కడికొచ్చారే'' అన్నాడు వ్యంగ్యంగా.

''ఏం? రావాల్సిన చోటికే వచ్చాడు'' అంది అనుపమ.

''ఓహో... చాలా శ్రుతిలోవుంది వ్యవ హారం'' అన్నాడు.

''లేకపోతే ఏమిటీ మీ మాటలు'' అంది.

''నా మాటలంతే... వాడు ఇక్కడుండటానికి వీల్లేదు'' అన్నాడు కర్కశంగా.

''అయినా ఈ పసివాడిని చూస్తే మీకేమిటి బాధ'' అంది.

''బాధే... నా మాటంటే మాటే! మన మధ్య వీడువుండటానికి వీల్లేదు'' చురచుర లాడిపో యాడు.

అనుపమ అవాక్కయి చూస్తుండిపోయింది. ఇదెక్కడి అన్యాయం. ఇదెక్కడి దురదృష్టం.

అనుపమ సమాధానం చెప్పలేకుండా కళ్ళ నీళ్ళు పెట్టుకుని పసివాడికేసి చూస్తూ కూర్చుంది.

''నువ్వనవసరంగా ఏడవకు. నిన్నేదో నేను బాధించినట్లు'' అన్నాడు కరుకుగా.

''ఇది బాధించడం కాదా''

''ఎలా అవుతుంది. వాడి దరిద్రముఖం కనిపిస్తే, నా మూడ్ పాడయిపోతుంది. నా బాధ నువ్వు అర్థం చేసుకోవేం?''

అనుపమ స్థాణువులా వుండిపోయింది.

''వాడు నోరులేనివాడు పసివాడు. ఎవరి దగ్గర వదలను?''

''ఏమో అది నాకనవసరం''

''నిన్నటి వరకు మా వదిన వుంది కనుక సమస్యలేకుండా పోయింది'' అంది.

''పోనీ ఆమెతోనే పంపేయకపోయావా''

అనుపమ కొరడాతో కొట్టినట్లు తుళ్ళిప డింది.

''ఏమిటీ... నాకన్న బిడ్డని ఎక్కడికీ పంప ను. వాడున్న చోటే నాకూ ఆనందం'' అంటూ పిల్లవాడిని ఎత్తుకుని గది బయటకొచ్చేసింది. వాడిగా మాట్లాడి బయటకైతే వచ్చేసిందిగానీ, ఆమెలో దుఃఖం, అవమానం పొంగిపొర్లాయి. ఏదో పెద్ద సమస్య పరిష్కరిస్తున్నట్లుగా, ఇంట్లో అందరూ కలిసి తన మెడలు వంచి, మరో గుదిబండలాంటి సమస్యని నెత్తిన పెట్టారు. తను అతన్ని పెళ్ళి చేసుకున్నంత మాత్రాన తన బిడ్డని తను లాలించుకుని, పెంచుకునే హక్కులేదా! అంటే అతనికి భార్య అయి నందుకు తన బంధాలు, బాంధవ్యాలు, అన్నీ వదిలేసుకోవాలా? ఏం? ఎందుకని? నిజానికి తన డబ్బుతో, ఒక మనిషిగా రూపుదిద్దుకున్న మధు ఈరోజు ఎంత అధికారం చలాయిస్తు న్నాడు? తన మీద సర్వహక్కులూ ప్రదర్శిస్తు న్నాడు. జీవితకాలం బానిసగా వుండటానికా తనితన్ని పెళ్ళాడింది? బయట వుయ్యాలలో పిల్లాడిని పక్కన పెట్టుకుని పడుకుంది.

ఆలోచిస్తూంటే ఎప్పుడో నిద్రపట్టేసింది.

★ ★ ★

నళిని 'బంటీ'ని నిమురుతూ, నోరులేని ఆ కుక్క పిల్లతో సంభాషణ మొదలుపెట్టింది.

''నాన్నలూ, బంటీ, ఇంక నిన్ను వదిలిపెట్ట నురా, మా నాన్నే కోపమొచ్చిందా? నిజమే నీ తప్పులేదు. ఏం చెయ్యను? పరిస్థితులలా వచ్చాయి. అవునూ, నిన్ను మా చంద్రుడు చూస్తే ఎంత మురిసిపోతాడో, నీతో బాగా ఆడుకుంటాడు'' అంది కుక్కపిల్ల బంటీని ముద్దుపెట్టుకుంటూ.

అనుపమ కొడుక్కి ఆ యింట్లో బాలసారె చేసి ఎవ్వరూ పేరుపెట్టలేదు. అనుపమ'కన్నా' అని, 'నాన్నా' అనీ ముద్దుగా పిలిచేది. రాఘ వేంద్రరావు 'తండ్రీ' అనేవాడు సావిత్రి 'బా బు' అనేది.

నళిని మాత్రం వాడిని 'చంద్రుడూ' అనేది. పోనీ చందూ అని కూడా అనేదికాదు. స్ప ష్టంగా, అందంగా తెలుగుదనం వుట్టిపడేలా చంద్రుడూ అంటూ పిలిచేది.

''బంటీగా, ఆ చంద్రుడితో నాకెంత అను బంధమో చెప్పలేను. కళ్ళుమూసినా వాడే




తెరిచినా వాడే. నిన్న మధ్యాహ్నం నిద్రపో తుంటే వాడొచ్చి నా మీదకి పాకుతూ ఆడుకు న్నట్లనిపించింది. కళ్ళు తెరిస్తే ఏముంది? ఏమీ లేదు. అయినా వాడు వాళ్ళమ్మ అల్లారు ముద్దుల కొడుకు. వాడు నాకెలా లభిస్తాడు. వాడెందుకులే బంటీ! ఓ బుజ్జిముండ బంటీ నువ్వూ నేనే జత. నువ్వే నాకు ప్రాణం'' ఇలా ఎంతో సేపు రకరకాల సంభాషణలు సాగిస్తూ కూర్చుంది.

ఎప్పుడూ అలా కుక్కపిల్లలతో మాట్లాడు తూ, కాలక్షేపం చేయడం ఆమెకి కొత్తేమీకాదు, అలవాటే. తన కడుపులో వున్న బాధంతా నోరులేని కుక్కపిల్లలతో చెప్పుకుని, అవి తన మీద సానుభూతి చూపిస్తున్నట్లు భావించు కుని తృప్తిపడుతుంది.

అప్పుడే ఇంట్లో అడుగుపెట్టిన రాజారావు భార్య సంభాషణని విని నవ్వుకున్నాడు.

''ఎప్పుడొచ్చారు'' అంటూ భర్తకి ఎదురొ చ్చింది.

''ఇదిగో ఇప్పుడే, ఏమిటీ నీలోనువ్వే మాట్లా డేసుకుంటున్నావు'' అన్నాడు.

''భలేవారే నాతో నేను మాట్లాడుకోవడమే మిటి బంటీతో మాట్లాడుతున్నాను''

''నర్లే... పిచ్చికుదిరింది రోకలి తలకి చుట్ట మన్నాట్ట వెనుకటికెవరో'' అన్నాడు నవ్వుతూ.

''అంటే నాకు పిచ్చిపట్టిందనా'' అంది రోషంగా.

''అబ్బే! అంతమాట నేననగలనా? సర్లేగానీ కాస్త మంచి కాఫీ యివ్వు. నీకో మంచి వార్త చెప్తాను'' అన్నాడు రాజారావు.

''ఓ... ఒక్క క్షణంలో యిస్తాను. ఫిల్టర్‌లో డికాక్షన్ రెడీగా వుందిగానీ, సంగతేమిటో చె ప్పండి''

''చెప్తానుగానీ ముందు కాఫీ సంగతి చూ డు''

''అబ్బబ్బ! కాఫీ యివ్వకుండానే వుంటానా''

''అబ్బబ్బ! నేను శుభవార్త చెప్పకుండానే వుంటానా''

నళిని వినవిసా లోపలికెళ్ళిపోయింది. ఆమె అర నిముషంలో కాఫీ తెస్తుందని అతని కి తెలుసు.

భర్త చెప్పిన మాటలు విని ఆలోచనలో పడిపోయింది నళిని.

''కానీ మా వదినతో వేగడం చాలా కష్ట మండీ. ఏదో మనకి కాస్త డబ్బు వుందని, ఆస్తివుందనీ పిల్లాడిని యిస్తానంటోంది. వాడి కిప్పుడు తొమ్మిదేళ్ళు. వాడికి డబ్బు మీదే ధ్యాసవుంటుంది. అందులో వాడు మహా గడు గ్గాయి. చిన్నప్పట్నించీ పెంచుకుంటే పిల్లలకి మన మీద కాస్తో కూస్తో అభిమానంవుంటుంది గానీ, ఎదిగిన పిల్లల్ని తెచ్చుకుంటే, వాళ్ళకి ప్రేమాభిమానాలు వాళ్ళమ్మ నాన్నల మీదా, డబ్బు అభిమానం మన దగ్గర, వద్దు లెండి''అంది నళిని.

నళిని అన్నయ్యకి నలుగురు మగపిల్లలు. వీళ్ళకి పిల్లలులేరు గనుక ఓ కుర్రాడిని పెంప కానికిస్తే బోలెడు ఆస్తి కలుస్తుందని వాళ్ళు అలా రాశారు.

రాజారావు నిశ్శబ్దంగా కూర్చున్నాడు. నళిన చెప్పిన వాదం కరక్టుగానే అనిపించింది. పిల్ల లకి చిన్నప్పటి నుండీ పెరిగితేనే ఆ ప్రేమాభి మానాలు, బాధ్యతలూ తెలుస్తాయి. లేకపోతే కేవలం డబ్బు భావనే వుంటుంది.

''సర్లేగానీ, నళినీ! నీకీ కుక్కల పిచ్చి తగ్గాలే. ఇది మరీ ఘోరంగావుంది. నీ మనసు కాస్త మరో ధ్యాసకి మళ్ళించుకోవాలి'' ఎంతో నేర్పుతో ముద్దుగా చెప్పాడు. నళిని కూడా సీరియస్సయిపోయింది.

''నాకూ తెలుస్తూనే వుంటుంది. కానీ ఏం చేయను? ఏదో కాలక్షేపం లేకపోతే మరీ పిచ్చిగా ఉంటుంది. చంద్రుడి దగ్గరున్నప్పు డు ఎంత హాయిగా వుండేదో'' అంది.

రాజారావు నిట్టూర్చాడు.

''ఇంతకీ మీ అన్నయ్యకి వుత్తరం రాసే యనా?''

''రాద్దాంలెండి. మా వదిన చాలా గడు గ్గాయి. తీరా మనం సరే అన్నాక ఎలాంటి గొడవలు పెడుతుందో''

''అదంతా వద్దు. నెమ్మదిగా చెప్తామని రాస్తా నులే''

"పోనీ కొన్నాళ్ళు ఏమీ రాయకుండా వూరు కోండి"

వీరిద్దరి మాటల్లో టెలిఫోను మోగింది. రాజారావు ఫోనులో మాట్లాడుతుండగానే అతని ముఖంలో ఆందోళన స్పష్టంగా కనిపించింది. నళిని లేచి అతని దగ్గరగా వెళ్ళి నిలబడింది.

"సర్లెండి వస్తాం"

"తీసుకొస్తా తప్పకుండా మీరు ఎక్కువ ఆందోళన పడకండి. వుంటాను సరే..." రాజారావు ఫోను పెట్టేసి తల పట్టుకుని కూర్చున్నాడు.

"ఏమిటి ఏమైంది?"

రాజారావు వెంటనే సమాధానం చెప్పలేదు. ఆలోచనలతో అలాగే కూర్చుండిపోయాడు.

"ఏమిటండీ... ఎక్కడినించి"

"బాబాయి చేశారు"

"అనూ బాగుందా? చంద్రుడెలావున్నాడు"

"అంతా బాగానేవున్నారు. కానీ ఒక్కొక్క సమస్య తీరిందంటే మరోటి తలెత్తుతోంది"

"ఏమైంది?"

"ఏముంది? బంగారు బొమ్మలాంటి పిల్లని, నాలుగు తరాలు తినగల ఆస్తినీ కట్టబెట్టి, నెత్తిమీద పెట్టుకుంటే ఆ మధు నానా రభసా చేస్తున్నాట్ట.

"దేనికీ?"

"ఏముంది? ఆ పిల్లాడు అక్కడుండకూడదంటాడుట"

నళిని ముఖం మాడిపోయింది ఆమెకా పసివాడు గుర్తుకొచ్చి ప్రాణం విలవిల్లాడిపోయింది.

"ఏం చేద్దామని"

"అదే తోచక, నిన్నూ నన్నూ రమ్మని ఫోను" అన్నాడు కొంతసేపు నిశ్శబ్దంగా వుంది నళిని.

"పోనీ చంద్రుడిని మనం తెచ్చేసుకుందాం"

"అనుపమ యివ్వద్దూ!"

"మీరు నచ్చచెప్పండి"

"ఏం చెప్పమంటావు"

"పరాయి పురుషుడివల్ల బిడ్డని ఏ భర్తా భరించలేడని చెప్పండి"

"ఏమిటా అర్థం లేని మాటలు. అనుపమేం ఇల్లీగల్‌గా సంతానాన్ని పొందలేదు. పాపం దాని దురదృష్టంవల్ల కట్టుకున్న మొగుడు పోయాడు. మరా పిల్లాడిని పెంచుకోవాలని ఆ స్త్రీకి వుండదా"

"మీరు కరెక్ట్‌గా ఆడవాళ్ళవైపు న్యాయంగా మాట్లాడారు. కానీ అందరు మగాళ్ళకు ఆ ఓర్పు, సహనం వుండవు. స్త్రీలో వుండే త్యాగం, సహనం మగాడిలో ఎప్పుడూ వుండవు"

"అయితే మాత్రం ఏడుమల్లె పూలెత్తు అన్నట్లు పెరిగింది అనుపమ. మోచేతి కింద నీళ్ళు తాగి మొగసాలెక్కినట్లు వెధవకి అంత అహంకారమేమిటి?"

"అదంతా ఎందుకు చంద్రుడిని మనికిచ్చేయమనండి. ముందుముందు, వాళ్ళకి మళ్ళీ పిల్లలు పుట్టినా ఇంకా ఎన్నో సమస్యలొస్తాయి" అంది.

"సర్లే... నువ్వూ నేనూ కాదు అక్కడ అనుపమ ఒప్పుకోవాలి. అది మంచిపిల్ల, నెమ్మదస్తురాలు కనుక ఏ మాట చెప్పయినా ఒప్పించి చేస్తున్నాం. అది వింటుందికదా అని అన్యాయం చేయవచ్చునా"

"సరే మీ యిష్టం.. నేను యిప్పుడే చెప్తున్నా ఒకవేళ చంద్రుడిని తీసుకొస్తే, నేను నెత్తిమీద పెట్టుకుని చూస్తాను"

"పిచ్చిదానా! నాకావిషయం మళ్ళీ నువ్వు చెప్పాలా? నాకు నీ సంగతి తెలీదా?"

"ప్రయత్నించండి. నా మనసూ తీరుతుంది. అనుపమ సంసారానికి సమస్యా వుండదు. పైగా వాడు నా దగ్గరున్నాడంటే, అనుపమకి నిశ్చింత" అంది నళిని.

★ ★ ★

రాజారావు విసుగ్గా సీరియస్‌గా అటూ ఇటూ పచార్లుచేస్తున్నాడు. రుసరుసలాడుతున్నాడు. అక్కడే పడక్కుర్చీలో కూర్చున్న రాఘవేంద్రరావు తల వెనక్కివాల్చి, నీరసంగా పడుకున్నాడు. అతను మానసికంగా బాగా నలిగిపోయివున్నాడని తెలుస్తోంది. అల్లుడి మరణంతో పదేళ్ళు వయస్సు పెరిగినట్లు కృంగిపో




యిన రాఘవేంద్రరావు ఇప్పుడు మరీ డీలాప డిపోయాడు.

"ఏది ఏమైనా మధు ఇంత అన్యాయంగా, పొగరుగా వుంటాడని నేననుకోలేదు" అన్నాడు రాజారావు.

"ఒక్కటి ఆలోచించు రాజా! మగాడిగా ఆలోచించు. తన భార్య దగ్గర మొదటి భర్తకి పుట్టిన బిడ్డవుంటే ఏ మగాడూ భరించలేడు"

"అదేమిటి- అన్నీ ముందుగా తెలిసినవే కదా!"

"తెలియడం వేరు. మనసు సమాధానవడటం వేరు"

"అంటే ఆయనగారికేనా మనసులూ, సమాధానపడటాలు"

"అలా అంటే ఎలా? పిల్లని అతనికి యిచ్చాంకదా! వాళ్ళు సుఖంగా కలతలు లేకుండా చూసేబాధ్యత మనమీద వుంది"

"ఒక్కటేమిటి బాధ్యతలు చాలానే వున్నాయ్" అన్నాడు రాజారావు విసుగ్గా.

"నువ్వు చంటాడిని పెంచుకో, అంతకంటే వేరే మార్గం కనిపించటం లేదు"

"నాకేం అభ్యంతరంలేదు. ఆనందంగా పెంచుకుంటాను. నళినికి కూడా వాడంటే చాలా యిష్టం"

"మరి?"

"అనుపమ యిస్తుందా?"

"ఇవ్వాలి మరి. ఆమె కోసమేకదా"

"అప్పటివరకు గుమ్మంలో నిలబడి వీరి సంభాషణ వింటున్న అనుపమ పరుగెట్టుకొచ్చి తండ్రి ఒళ్ళో తలపెట్టి భోరున ఏడ్చింది.

"ఎందుకు నాన్నా! నీకు నేనంటే యింత కక్ష"

"తప్పు తల్లీ... నువ్వలా మాట్లాడితే నేను గుండె పగిలి చచ్చిపోతాను" రాఘవేంద్రరావు నిరాశగా అన్నాడు.

"ఏమిటి అనూ! ఆ మాటలేమిటి? నాన్నతో అలాగేనా మాట్లాడేది" అన్నాడు రాజారావు.

"మరేం మాట్లాడాలి"

"నేను చెప్పేది శ్రద్ధగా విను. నేను ఏం చేసినా, చెప్పినా నీ సుఖంకోసం, నీ ఆనందంకోసం- ఆ మాటగుర్తుపెట్టుకో"

"అన్నయ్యా! నాకింకెక్కడుంది సుఖం, ఆనందం?"

"అలా మాట్లాడకు. నువ్వు కొంత సర్దుకోవాలి"

"నేను మొదట్నించి సర్దుకుంటూనే వున్నాను. నేను చేసిన తప్పు మళ్ళీపెళ్ళి చేసుకోడం."

"ఇప్పుడావివాహం నిలబెట్టుకోవడానికి ప్రయత్నించు. మధు మంచివాడే కానీ అతను మగాడు. మగవాడికి వుండే సహజమైన బలహీనతలు మనం అర్థంచేసుకోవాలి"

అనుపమ ఏడుస్తూ కూర్చుంది.

"నిజానికి నీకంటే కూడా అపురూపంగా చూస్తుంది నళిని పసివాడ్ని" అన్నాడు రాజారావు

"నిజమే అన్నయ్యా! నాకా అనుమానం లేదు. కానీ నేను వాడ్ని వదిలి వుండలేను"

"ఉండాలి... నెమ్మదిగా అలవాటుచేసుకో. వదిన దగ్గర హాయిగా వున్నాడని మనసుని సరిపెట్టుకోవాలి" అన్నాడు రాజారావు.

అప్పుడొచ్చింది నళిని అక్కడికి.

రోజూ అతనితో తగవుపడుతూ, చిరాకులతో బతకడంకన్నా, ఇది నయంకదూ, నేను ప్రమాణం చేసి చెప్తున్నా నీ కొడుకు వంటిమీద ఈగ వాలనీయను" అంది.

అనుపమ ఏడుస్తూ వదిన చేతుల్లో వాలింది.

"అలాగనకు వదినా! నీ దగ్గర వాడెంతో బాగా పెరుగుతాడు. కానీ... నా దగ్గర" అంది.

"మా దగ్గరుంటే నీ దగ్గరున్నట్లే" అన్నాడు రాజారావు.

అనుపమ ఏమీ మాట్లాడలేదు. నళిని వొళ్ళో తలపెట్టుకుని కళ్ళు మూసుకుని పడుకుంది.

ఆ మర్నాడే పిల్లాడి పుట్టినరోజు. వాడికి ఏడాది నిండుతోంది.

★ ★ ★

తెల్లవారకుండా యిల్లు మేల్కొంది. ఆరోజు పసివాడికి పేరుపెట్టారు, పుట్టిన ఏడాదికి. నళిని అనుపమ కలిసి వాడికి రాకేంద్ అని

పేరు పెట్టారు.

రాకేంద్‌కి తలంటి కొత్త బట్టలు వేసి, వాడికి వంటినిండా నగలు పెట్టింది తల్లి.

రెండు జతల మురుగులు, రెండు గొలుసులు మొలకి మామిడి పిందెలు. వాడు తెల్లగా ఏకుల కట్టలావున్నా, వాడిని చూసి ఇద్దరూ మురిసిపోయారు. ఒకరు కన్నతల్లే అయినా, పెంచేభాగ్యంలేని బాధతో, మరొకరు కనకపోయినా పెంచే అదృష్టం కలిగిందనే ఆనందంతో.

రాహుల్ పోయినప్పుడు వచ్చిన డబ్బంతా రాకేంద్ పేర డిపాజిట్ చేసిపెట్టాడు రాజారావు.

"అన్నయ్యా! డబ్బేదో నా కొడుక్కని కాదు. వాడు నీవాడు. వాడి డబ్బుకదా అని నీకిస్తున్నాను" అంది అనుపమ. కాని రాజారావు నళిని ఆ



డబ్బు రాకేంద్ పేర డిపాజిట్ చేసేందుకే యిష్టపడ్డారు.

★ ★ ★

అనుపమ పిలిస్తే పరుగు పరుగున వచ్చాడు యాదగిరి. ఏదో ఆలోచిస్తూ నిరుత్సాహంగా కూర్చున్న ఆమెని చూసి అతనొక క్షణం నిర్ఘాంతపోయాడు. ఈమె ఆనందంగా వుండాలనీ, పూర్వజీవితం పొందాలనీ, చుట్టూ వున్న జనం ఎంతచేసినా అనుపమ సర్దుకోలేకపోవడం అతన్ని బాధించింది.

"ఏంటమ్మా పిలిచారు" అన్నాడు. అతని వంక నిశితంగా చూసి గదిలోకెళ్ళి ఒక ఫొటో తీసుకొచ్చింది. అది యాదగిరికిచ్చి,

"నువ్వు ఇది అందమైన ఫ్రేమ్ అద్దమూ కట్టించి తెచ్చిపెట్టు" అంది.

ఆ ఫొటోచూసి మారుమాట్లాడలేక అలాగే వుండిపోయాడు. అది రాహుల్ ఫొటో. గుండెల దాకా వున్న ఆ ఫొటోలో అతను ఎంత అందంగా దర్జాగా వున్నాడు.

ఈమె అభిప్రాయం ఏమిటి? గతంలో జరిగినవి పూర్వజన్మలా మరిచిపోయి, ఈనాటి బంధాలు బాంధవ్యాలు మెరుగుపరుచుకోమంటుంటే, మళ్ళీ వెనక్కి వెనక్కి వెళ్తోందేమిటి? అనుకున్నాడు.

"ఏమిటి ఆలోచిస్తున్నావు. నాకు అది కావాలి" అంది నెమ్మదిగా,

"కానీ... ఎందుకమ్మా..." అన్నాడు అంతకంటే నెమ్మదిగా ధైర్యంగా అడిగినందుకు తనకి తను ఆశ్చర్యపోతూ,

అనుపమ చివ్వున తలెత్తి తీక్షణంగా అతని వైపు చూసింది.

"నాకిది యిష్టం అంటే ప్రతీవాళ్ళూ నా యిష్టాన్ని ప్రశ్నిస్తారేం" అంది.

"కాదు తల్లీ కాదు... వూరికే అడిగాను. ఇప్పుడు అయ్యగారికి కోపమొస్తుందేమోననీ..."

"వస్తేరానీ, పూర్తిగా నా మనసునీ, నా యిష్టాన్నీ చంపుకుని నేను బతకలేను" అంది.

"యాదగిరి ఆ ఫొటో తీసుకుని చకచకా అక్కడినించి వెళ్ళిపోయాడు. మరి కొంతసేపు తను అక్కడే వుంటే అనుపమ మరికాస్త బాధపడి మాట్లాడుతుంది. అంతలో మధు వస్తాడు. రభస అవుతుంది. మధు దృష్టిలో పడకుండా తను తప్పుకోవడమే మంచిది. కానీ అనుపమ ఆలోచనా ధోరణికి యాదగిరి భయపడ్డాడు. వయసు మీదపడిన రాఘవేంద్రరావు, సావిత్రి కూడా అనుపమ అంతరంగిక సమస్య గురించి ఆలోచించలేకపోతున్నారు. వారి దృష్టిలో ఎలాగోలాగా అనుపమకి ఒక మగదిక్కు వుందికదా అనేదే గొప్పగా వుంది.

యాదగిరి వెళ్ళిపోగానే అనుపమ పెళ్ళినాటి ఆల్బమ్ తీసి ఒక్కొక్కటీ చూస్తూ కూర్చుంది.

చివరగా వున్న రెండే రెండు ఫొటోలు రాకేంద్‌వి. చూసి, దుఃఖం ఆపుకోలేకపోయింది. తన కడుపున పుట్టినందుకు రాకేంద్ కి ఏడాదివరకు ఆలనా, పాలనా, ముద్దూ ముచ్చటా లేకుండాపోయింది. ఇప్పుడు తను బతికున్నా తల్లిప్రేమ లేకుండాపోయింది.

ఏడాదిలోపున తన జీవితం ఎంత మారిపోయింది. పదేళ్ళకాలం గడిచినట్లు తను పది నెలలు గడిపింది. ఒక జీవితకాలపు అనుభవం పొందింది.

మళ్ళీ మొదట్నించి ఫొటోలు చూస్తూ కూర్చుంది. రాహుల్ ఎంతో అందగాడు. మంచివాడు. అన్నిటికీ మించి తన హృదయాన్ని ఆకర్షించినవాడు. తను అతన్ని, అతని జ్ఞాపకాన్నీ ఈ జన్మలో మర్చిపోలేదు. కానీ... తను చేసిన పొరబాటు ఈ పెళ్ళి. తనెలా వొప్పుకుందో? అయిందేదో అయిందనుకున్నా తనూహించినదానికీ, జరుగుతున్నదానికీ ఎంతో తేడా వుంది.

మధు ఒక మగవాడిగా తనని యిష్టపడి, ఆరాధించి వుండవచ్చు. కానీ ఈరోజు మగడుగా అతను కేవలం అధికారం మాత్రం ప్రదర్శిస్తున్నాడు. లోకమంతా అది సహజమే అంటోంది, ఏమన్నా అంటే. "అతను మగవాడు. అతనన్నదానిలో తప్పేముంది? అతనెంతో విశాలహృదయంగలవాడు కాబట్టి నిన్ను పెళ్ళి చేసుకున్నాడు. నువ్వే సర్దుకోవాలి" అంటారు. తనేం మాట్లాడుతుంది?

కళ్ళల్లో సన్నటి కన్నీటి పొరతో, ఒళ్ళో ఫొటో ఆల్బమ్‌తో, అస్తవ్యస్తంగా కుర్చీలో జారగిలబ




డి, దయనీయంగా వున్న అనుపమని, అప్పటి కి ఎంతో సేపట్నించి పరిశీలిస్తున్న మధుకి ఆమెమీద జాలి వేయకపోగా, కోపమొచ్చింది.

అతను మరింత దగ్గరకి రావడంతో ఆ అలికిడికి వులిక్కిపడింది.

''ఏమిటిది'' అతనెంత దాచుకున్నా అతని కంఠంలో కాఠిన్యం ఖంగుమంది.

''ఏముంది?'' అంది నిర్లక్ష్యంగా.

''నీ పద్ధతి నాకేం నచ్చడం లేదు'' అన్నా డు.

అనుపమేమీ సమాధానం చెప్పలేదు.

''ఇలా ఆ ఫొటోలు చూస్తూ ఏడుస్తూ కూర్చో దలచినదానివి నన్నెందుకు పెళ్ళిచేసుకున్నావ్'' అతని కంఠంలోని అధికారానికి ఆశ్చర్యపో యింది.

"నేనేం ఎదురొచ్చి, వరించి నిన్ను పెళ్ళిచే సుకోలేదు. నీ కోరికమీదే అందరూ బలవంతం చేసి నన్నీ రొంపిలోకి దింపారు'' అందామను కుంది. కానీ ఆమె పెదవి విప్పి ఏమీ అనలే దు. ఆమె చేతిలో ఆల్బమ్ బలవంతంగా లాక్కున్నాడు.

''మధూ'' అంది గట్టిగా.

''చాలాసార్లు చెప్పాను. మధూ అంటూ పిలవద్దని- నేను నీ మొగుడ్ని మర్యాదగా పిలు'' అన్నాడు. అనుపమ ఒక్కక్షణం తలొంచుకుంది.

''దయచేసి అది నాకు యిచ్చెయ్యండి'' అంది.

''ఎందుకూ ఏడుస్తూ కూర్చోడానికా? వీల్లే దు. నువ్వు నా మనిషిగా బతకాలి'' అన్నాడు.

''అదంతా తర్వాత ముందా ఆల్బమ్ నాకి చ్చెయ్యండి'' అంది దీనంగా.

''అదేముందు? నువ్విలా దరిద్రముఖంతో ఎప్పుడూ ఏవో తలుచుకుని ఏడుస్తూ కూర్చుంటే నాకూ దరిద్రమే చుట్టు కుంటుంది'' అన్నాడు.

అతను మాట్లాడే ప్రతిమాటా ఒక్కొక్క శూలంలా ఆమె గుండెల్లో గుచ్చుకుంటోంది.

దూరంనుంచి ఏమీ ఎరగనట్లు నటిస్తూ ఈ మాటలు విన్న యాదగిరి మనసు విలవిల్లాడి పోయింది.

నిన్నగాక మొన్నటిదాకా, ఆమె దగ్గర చేతు లు కట్టుకుని నిలబడిన మధు ఈరోజు ఎంత పేట్రేగిపోతున్నాడు అరెరె! అందరూ పెళ్ళి అనే వురితాడు ఈ అమాయకురాలి మెడకి బిగించారే! అని వాపోయాడు.

పైపై వ్యవహారాలకి శాసించవచ్చు, మనసు కి సంబంధించినవి మాత్రం లాలించి సాధించుకోవాల్సిందే. శాసనాలు పని చేస్తా యా? ఈ మధుకి దయ్యంగానీ పట్టిందా? లేకపోతే ఏమిటా మాటలు? వంటరిగా పిలిచి చెప్పాలి. దుర్మార్గంతో ఆమె మనసుని గెలవగ లడా?

మధు అనుపమకి యివ్వకుండా ఆ ఆల్బమ్ తీసుకుని వెళ్తుంటే ఎదురుగా వెళ్ళా డు యాదగిరి.

''ఏంటయ్యా మధుబాబూ'' అన్నాడు యా దగిరి చనువుగా.

''ఇదిగో ఇది ఎక్కడా ఎవ్వరికీ కనిపించనిచో టున పెట్టు. ముఖ్యంగా అమ్మగారికి'' అంటూ అది యాదగిరికిచ్చేసి చకచకా వెళ్ళిపోయా డు.

అనుపమ పరుగెత్తుకొచ్చి యాదగిరి చేతి లోంచి లాక్కుని తన గదిలోకి పరుగెట్టింది. వెనుకనుంచి 'అనుపమమ్మా' అంటూ యాద గిరి పిల్చినా వినిపించుకోలేదు.

★ ★ ★

రాఘవేంద్రరావు ఆలోచనలో పడ్డాడు. ఇప్పుడెవరితో ఏ సలహా చెయ్యడానికీ వీల్లేదు. చదువు సంధ్యా లేకపోయినా, అనుభవం గల వాడు కనుక అతనికి ఒక్క యాదగిరి మిగిలా డు. రాజారావుని పిలిచి సలహా అడుగుదా మంటే, ఎందుకో బెరుగ్గావుంది. ఈ మధు ఎలా రియాక్టవుతాడోనని అతను ఆలోచనలో పడ్డాడు. అతనలా భయపడడానికి కార ణంలేక పోలేదు.

రాఘవేంద్రరావు ఆలోచనలతో సతమతమ వుతుండగా మధు రానేవచ్చాడు. వస్తూనే ఓ కుర్చీ లాక్కుని.

''ఏమాలోచిస్తున్నారు'' అన్నాడు.

''ఏంలేదు నాయనా'' అన్నాడు.

మధు ఎక్కువ కాలయాపన చేయడానికీ, కబుర్లు చెప్పడానికి అక్కడికి రాలేదు. అందుకే తను చెపుదామనుకున్న సంగతి మొదలుపెట్టాడు.

"కలకత్తాలో చేపల ఎగుమతి దిగుమతుల కంపెనీ ఒకటి ప్రారంభించబోతున్నా... లాభాలు బాగావుంటాయి. అన్నీ మొన్న వెళ్ళినప్పుడు మాట్లాడివచ్చాను" అన్నాడు.

మధు కదలికల వల్ల కొంత గ్రహించినా, ఇంత త్వరగా యిలాంటి నిర్ణయం తీసుకుంటాడని వూహించలేదు. అందుకే వెంటనే ఏం సమాధానం చెప్పలేకపోయాడు రాఘవేంద్రరావు.

"మీతో చెప్దామనీ..." అంటూ ఆగాడు మధు.

"నిజమేగానీ ఇప్పుడంత దూరంలో మనకి బిజినెస్ ఎందుకు?"

"అదేమిటి? ఏదో ముందుకు పోవాలనీ, పైకి రావాలనీ వుంటుందిగానీ ఎక్కడ వేసిన గొంగళీ అక్కడే అన్నట్లు వుండదుగా"

"మనకి డబ్బుకేంలోటు?"

"మీ దృష్టితోనే ఆలోచిస్తే ఎలా? మేం చిన్నవాళ్ళం కదా! మా వంతువాటా మేమూ సంపాదించి, ఆస్తిని పెంచాలిగా" అన్నాడు.

ఆస్తిని పెంచాలి అన్న మాట ఎంత రుచించినా, దూరంలో, భాష తెలియని వూరులో, పరిస్థితులు అనుకూలంగా వుంటాయో వుండవోనని భయం వేసింది.

"మనదేశంకాదు. మన్నెవరైనా మోసం చేస్తే?"

"ఏం? నేనంత దద్దమ్మలా! కనబడుతున్నానా" మధు మాటలు నూటిగావున్నాయి.

"అబ్బెబ్బె! అదేమిటయ్యా అంత దురుసు! నీకు వ్యాపారం విషయంలో మంచి సులువువుంది. మెలకువలు తెలును. ఎటొచ్చీ చూడబోతే దూరదేశమనీ"

"అదేం పట్టించుకోకండి. నేను జాగ్రత్తగా చూసి చేస్తాను" అన్నాడు.

"పోనీ ఒకసారి రాజాని కూడా సంప్రదిస్తే" రాఘవేంద్రరావు మాట పూర్తయిందో లేదో.

"దయచేసి, నాసొంత ఆలోచనకి నన్ను వదిలేయండి. ఎవరికిందో ఎప్పుడూ బానిసగా బ్రతకలేను. అయినా నా తెలివిమీద నాకు నమ్మకం వుండాలిగానీ, ఎప్పుడూ ఎవరో సలహా చెప్తూవుండాలా" అన్నాడు. అతని మాటలు ఎలావున్నా, అతని ముఖంలో కనిపించిన అయిష్టత, అసహనం రాఘవేంద్రరావుకి బాధ కలిగించాయి, ఊరుకున్నాడు.

"మీ ఇష్టం నాయనా... ఏదో చిన్నప్పటి నుంచీ కనిపెట్టుకుని వున్నవాడు రాజా. అందుకని అన్నాను" అన్నాడు.

"మంచిదే మీ స్వవిషయాల్లో అలాగే కానీయండి. నా విషయాల్లో మాత్రంవద్దు" అని లేచి వెళ్ళిపోయాడు.

కాలం కలిసిరాకపోతే తాడే పామైకరుస్తుందన్న మాట నిజమేనేమో అనుకున్నాడాయన.

అనుకున్నట్లు రెండు వారాల్లో అన్ని ఏర్పాట్లు జరిగిపోయాయి.

రాఘవేంద్రరావు ఫోనులో మాట్లాడాడు రాజారావుతో.

"బిజినెస్ విషయంలో మధుని అనుమానించవలసిన పనిలేదు. అతను వుద్దండుడు. పైగా స్వయంకృషితో పైకి రావాలని గొప్పకాంక్ష వున్నవాడు. అతన్ని ముందుకు సాగనివ్వండి. అతను డబ్బు ఎంత అడిగినా, వెనుకాడకండి. మనం చేసే ప్రతి పనికీ ప్రతిఫలం అనుపమకి వస్తుంది. మనం ఏదైనా కాదంటే, ఆమెకది నరకమవుతుంది. మనం యింత కష్టపడి చేసింది అనుపమ సుఖంగా సంసారం చేసుకోవడానికేకదా" అని చెప్పాడు రాజారావు.

బాగా ఆలోచించగా అతని మాటలు నిజమేననిపించింది. మధు తెలివైనవాడు. అతను సొంతంగా రాణించినప్పుడే అనుపమని బాగా చూస్తాడు.జరిగిందేదో జరిగింది. జరగబోయేది చూద్దాం అన్నట్లు భావించుకున్నాడు రాఘవేంద్రరావు.

అయితే అనుకోని విధంగా పదిరోజుల్లో అనుపమని తీసుకుని కలకత్తా ప్రయాణం ఏర్పాటు చేశాడు మధు.

సావిత్రి, రాఘవేంద్రరావు గిజగిజలాడిపోయారు. "ఇప్పుడంత దూరం అమ్మాయి





ఎందుకులేనాయనా! మా కళ్ళ ఎదురుగా వుండనీ'' అన్నారు యిద్దరూ.

''అమెరికా పంపడానికే సిద్ధపడిన మీరు, యిప్పుడు మనదేశంలోని కలకత్తా దూర మంటారేమిటి? ఇంతకీ ఆమె నా భార్యా కాదా చెప్పండి'' అన్నాడు ఒకేసారి.

ఇద్దరు ముసలివాళ్ళూ కంగారు పడిపో యారు.

''అదేమిటి బాబూ! అది నీ భార్యేకదా! నీకు కాళ్ళుకడిగి యిచ్చాం. అది నీకు అగ్నిసాక్షిగా పెళ్ళాడిన పెళ్ళాం. గతంలో నా దురదృష్టాలు ఎలావున్నా ఇంతవరకు యిది నిజమేగా'' అన్నాడు.

''మరయితే భర్తతో భార్య వెళ్ళడం అసహజమేమీ కాదుగా'' అన్నాడు.

సావిత్రి కల్పించుకుని ''ఇంకా అదీ పూర్తిగా కోలుకోలేదు. వంటరిగా వుంటుందనీ...''

''అందుకే... అందుకేనండి. స్థలం మార్పు వల్ల కొత్త వుత్సాహం వస్తుంది. ఈ పరిసరాలు ఈ జ్ఞాపకాలు వుండవు. వంటరితనం వుండకూడదనేగా నాకు కట్టబెట్టారు'' అన్నాడు ఆ మాటల్లో కొంత నిజం, కొంత కాఠిన్యం, కొంత వ్యంగ్యం వున్నాయి. మొత్తానికి సావిత్రి మరేం మాట్లాడలేకపోయింది. ఆమె సమాధానం కోసం మధు ఎదురూ చూడలేదు. అక్కడే తలచేత పట్టుకుని కూర్చున్న సావిత్రి దగ్గరకి యాదగిరి వచ్చాడు. దీనంగావున్న ఆమె వంక చూస్తూ

''భయంలేదు. మధుబాబుకి అనుపమ మ్మంటే ప్రాణమే. ఆమెనేం బాధించడు. అదే కదా మనకి కావలసింది. నిజమేకదా, ఆరిద్దరూ అన్యోన్యంగా వుండాలంటే కొన్నాళ్ళు స్థలం మార్పు అవసరమే'' అన్నాడు. సావిత్రి మనసు సమాధాన పరచుకొంది.

మధు మనస్తత్వం రాఘవేంద్రరావు, సావిత్రి, రాజారావు నళిని, యాదగిరి కొంచెం కొంచెం అర్థం చేసుకోసాగారు. అతనిలో కొన్ని మంచి, కొన్ని చెడ్డ గుణాలువున్నాయి. చెడ్డని రెచ్చగొట్టకుండా మంచిని వాడుకోవాలి. స్వభావ సిద్ధంగా, ప్రేమ, బెంగలాంటి వాటికి అతను దూరం. సంసారం చేసే ప్రతి మగవాడూ భార్యని ప్రేమించాలని లేదు. అలాగని మరొకర్ని ప్రేమిస్తారనీకాదు. కానీ వారి జీవిత విధానంలో మిగిలిన ఎన్నో విషయాలు చోటు చేసుకుంటాయి. సంసారం చేస్తారు. పిల్లల్ని కంటారు. బాధ్యతల్ని నెరవేరుస్తారు. స్టేటస్ నిలుపుకుంటారు. కానీ స్త్రీ పురుషుల మధ్య వుండే అత్యంత సున్నితమైన స్పందనలు వుండవు. భార్యతో లౌకిక విషయాలన్నీ సమానంగా పంచుకుంటారు. అలౌకికమైన విషయాలవైపు అసలువారి ఆలోచనే వెళ్ళదు. కొందరు బిజినెస్, చేస్తారు. వారికి ఇరవై నాలుగు గంటలూ అదే ధ్యాస. అదే ఆలోచన. అందులోని లావాదేవీలు లాభనష్టాలు, కొత్త పథకాలు, ధనార్జనకి కొత్త మార్గాన్వేషణలు ఇలా ఇలా.

అలాంటివాళ్ళ జీవితాల్లో స్త్రీ కేవలం ఒక అవసరం అంతే.

మధుకి డబ్బుగలవాడవడానికి అనుపమ దురదృష్టం ఒక ఆలంబన. తను పెళ్ళి చేసుకున్నాడుగా, యింకా ఏమిటి ఆమెకి బాధ? అన్నట్లు అతను ఆలోచిస్తాడు. అయితే అతనికి తెలీకుండానే అనుపమ మీద తన అధికారం నిరూపించుకోవాలనే కాంక్ష పెరిగిపోసాగింది. ఆమె తన సొత్తు. తనే ఆమె సొంతదారు. ఆమె మరొకళ్ళ గురించి ఆలోచించటానికి, స్మరించటానికి కూడా అతని మనసు అంగీకరించదు.

అనుపమ తన చెప్పు చేతల్లో వుండాలి. అదీ అతని కోరిక.

నిజానికి అతని చెప్పు చేతల్లో వుండకుండా స్వతంత్రంగా ఆలోచించే ధైర్యం, ఆలోచనా వున్న వ్యక్తికాదు అనుపమ. ఆమె పెరిగిన వాతావరణం చాలా సంకుచితం. చదువు కూడా అంతంత మాత్రమే. ఇంత దెబ్బ తిన్నాక, ఇప్పుడామె కొంత ఆలోచిస్తోందిగానీ మునుపటి రోజుల్లో అదీలేదు. అయితే అపురూపంగా, గారంగా పెరిగిన అనుపమకి తను అన్న ప్రతీ మాటనీ, మధు కాదనడం, తన యిష్టాన్నీ అతను త్రోసిపుచ్చడం, అన్నిటికీ మించి తనకన్న బిడ్డని ఎక్కడో పెంచాల్సి రావడం ఆమెలో ఎన్నో ఆలోచనలు రేకెత్తిస్తు న్నాయి.



పెళ్ళికి ముందు అందరూ మధు మనవాడే. మధు మంచివాడే. మధు మనం చెప్పినట్టువింటాడు. మధు మన కళ్ళముందు దీనంగా నిలచినవాడే. మధు ఎప్పుడూ అనుపమ యిష్టాన్ని కాదనడు. కాదనలేడు. అతనికా ధైర్యం వుండదు. అనుపమ తన కొడుకుని అతని అండదండలతో హాయిగా పెంచుకోగలదు. ఆమె మకుటంలేని మహారాణి. అతనామెకీ, ఆమె డబ్బుకీ సేవకుడే అనుకున్నారు. ఇవన్నీ కేవలం వాళ్ళలో వాళ్ళు అనుకున్నారు. భావించుకున్నారు. కానీ ఒక్కటీ అతనితో చర్చించలేదు. అతని అభిప్రాయాలు అడగలేదు. పోనీ తమ కోర్కెలు, ఆశలు అతనికి చెప్పలేదు. అనుపమ తనెలా బ్రతకాలనుకుంటోందో చెప్పలేదు.

భర్తపోయిన అనుపమకి మళ్ళీ అయిన కులంవాడితో పెళ్ళవడం అదృష్టం అనుకున్నారు. అదే పదివేలు అనుకున్నారు.

అనుపమ మొదటి భర్త పోవడంవల్ల మధుకి అందుబాటులోకి వచ్చిందిగానీ, లేకపోతే ఆమె అతనికి గగన కుసుమమేకదా. అలాంటి అందని జాబిల్లి అందితే, అతను భయంగా, జాగ్రత్తగా చూసుకుంటాడుకదా! లక్షలకి వారసురాలు భార్యే అయినా ఆమెని అదుపాజ్ఞలలో పెట్టాలని ఎవరనుకుంటారు? అయినా మధు మంచివాడు అనుకోడు.

ఇవీ అందరూ అనుకున్న విషయాలు. రాఘవేంద్రరావు, సావిత్రి యిలాగే అనుకొని ఒక్కొక్క సంగతీ బయటపడుతుంటే అవును నిజమేకదా అని సర్దుకుపోతున్నారు. రాజారావు కాస్త అటూ యిటూ యోచించినా, ఇంత కష్టపడి పెళ్ళిచేసి, మళ్ళీ అదొక విఫలయత్నం కానీయకూడదని తాపత్రయపడుతున్నాడు.

"చూడూ! నువ్వంటే నాకెంతో యిష్టం. నీకు గుర్తుందోలేదో, ఒకరోజు తోటలో అన్నాను పెళ్ళికొడుకు నచ్చలేదని చెప్పమని. ఎందుకు? నువ్వు నాకు దక్కాలని. కానీ..."

అనుపమ విప్పారిన కళ్ళతో అతన్నే చూస్తోంది. ఆనాటి మధు మాటలకి అర్థాలు యిప్పుడు తెలుస్తున్నాయి. మధు మళ్ళీ మొదలుపెట్టాడు.

"కానీ... నువ్వు చెప్పలేదు. నేను చూస్తుండగానే నీ పెళ్ళి అయిపోయింది. అంతా అయిపోయింది. అయితే నీ మొదటి అందాలు, నలగని నీ స్త్రీత్వాన్ని, మొదటిసారిగా పరిమళాలు వెదజల్లే నీ శరీర అంగాంగ మృదుత్వాన్ని వాడు ఆ పది రోజుల బాటసారి నలిపి నలిపి, జుర్రుకుని, వాడేసి వదిలి వెళ్ళిపోయాడు" ఈ మాటలనేప్పుడు మధు కళ్ళల్లో కనిపించిన కసి, రాక్షస రూపం చూసి అనుపమ భయపడింది. ఇతనింత అసహ్యంగా, పచ్చిగా మాట్లాడగలడా అని అవాక్కయింది.

"వుట్టినే వదల్లేదు, ఓ పిండాన్ని కూడా నీ కడుపులో పెట్టి మరీ వెళ్ళాడు" అన్నాడు మరీ జుగుప్సగా.

"ప్లీజ్ మధూ, ఆయన్ని ఒక్కమాట అంటే వూరుకోను. విధివంచించి, ఆయన దుర్మరణం పాలయ్యారుగానీ నాకు అన్యాయమేమీ చెయ్యలేదే"

"ఏదిఏమైనా నువ్వు అన్యాయమైపోయావుగా"

"దానికా వ్యక్తి బాధ్యత ఏం లేదుగా"

"కానీ నిన్ను మళ్ళీ మామూలు మనిషిని చేసుకోవడానికి, నేను నిన్ను పొందడానికి, అన్నీ పక్కకి పెట్టి నీ మెడలో తాళికట్టాను" మధు ఆగాడు.

అనుపమ తలొంచుకుంది. నెమ్మదిగా ఆమె కళ్ళల్లో నీళ్ళూరుతున్నాయి.

"నేను నిన్ను పెళ్ళి చేసుకుని, నీ బతుకు మళ్ళీ పచ్చగా చెయ్యాలని తాపత్రయపడుతుంటే నువ్వు పాత జ్ఞాపకాలతో మగ్గిపోతూ, పాత ఫొటోలు పెట్టుకుని కూర్చుంటే నేనేమైపోవాలి? నా జీవితానికి అర్థమేమిటి? నీకు నీ పాత మొగుడే కావాలి. వాడివల్ల పుట్టిన కొడుకే కావాలి అనుకుంటే ఇంక మన పెళ్ళికి అర్థం ఏమిటి? ఆలోచించు. మనిద్దరమే కొన్నాళ్ళు, చాలాదూరం వెళ్ళిపోయివుంటే నాకూ సుఖం, నీకూ సుఖం. కాదూ కూడదూ అంటే మనం విడిపోవడం ఒక్కటే మార్గం. ఈ మునలివయస్సులో నీ తల్లిదండ్రులకి నువ్విచ్చే మనశ్శాంతి ఇదేనా? నాకేం ఫరవాలేదు. నేనెప్పుడూ వంటరి వాడినే కొత్తగా పోయేదేమీలేదు. నా




దారిన నేను పోతాను''

అనుపమ ఒక్కసారి భయంతో వణికిపోయింది. విధి చిన్నచూపు చూసి రాహుల్ చచ్చిపోయాడు. తను వక్రంగా ఆలోచించి మధుని దూరం చేసుకోవడం ఏం వివేకం?

ఎంత ధర్మంవున్నా ఈ లోకంలో భర్త పోయిన స్త్రీమీదవున్న సానుభూతి భర్తని వదిలేసిన స్త్రీమీద వుండదు.

''ఏమండీ! నన్ను బాధించవద్దు. మీ యిష్టమే నాకూ యిష్టం. లేకపోతే నాకెవ్వరున్నారు'' అంది అతనామె దగ్గరగా వచ్చి కౌగలించుకున్నాడు. ఆమె ఎంతో ప్రయత్నం చేసింది అతన్ని మనస్ఫూర్తిగా కౌగలించుకుందామనే కౌగలించుకుంది. కానీ అందులో మనసులేదు.



నళిని మనసు ఆందోళనగావుంది. రాకేంద్‌కి మధ్యాహ్నం జ్వరం తగిలింది. అది పోనుపోను పెరుగుతూ సాయంత్రం ఆరు గంటలయ్యేసరికి నూట మూడుకి చేరుకుంది. వుండి వుండి ఏడుస్తున్నాడు. నిద్రపోతున్నాడు. జ్వర తీవ్రతవల్ల ముఖం మరీ ఎర్రగా కందగడ్డలాగయింది. వంటిమీద చెయ్యివేస్తే సలసలకాగిపోతున్నట్లుంది. ఏడు గంటలు దాటుతుండగా రాజారావు యింటికి ఫోను చేశాడు. తను రావడం ఆలస్యమవుతుందని. అతను చేసింది కూడా ముప్పైమైళ్ళదూరంలోవున్న పొరుగూరునుండి. అనుకున్న టైముకి పని పూర్తికాలేదు. వచ్చేసరికి ఒంటిగంట రెండూ కావచ్చు అని చెప్పాడు. నళిని గాభరాగా చెప్పింది రాకేంద్‌కి చాలా జ్వరంగా వుందని. తనిప్పుడే హాస్పిటల్‌కి తీసుకెళ్ళామనుకుంటున్నానని. రాజారావు కూడా ఆదుర్దా పడ్డాడు.

''నేనొచ్చేసరికి ఆలస్యమవుతుంది. నువ్వే డాక్టర్ భాస్కర్ దగ్గరకి తీసుకెళ్ళు ఆయన జాగ్రత్తగా చూస్తారు'' అన్నాడు.

నళిని ఫోను పెట్టేసి, పిల్లాడిని భుజంమీద పడుకోబెట్టుకుని బయటకొచ్చి ఆటో ఎక్కింది. డాక్టరుగారుచూసి ఇంజక్షన్ చేసి, రెండు మందులు రాసిచ్చి సిరప్ ఆరు గంటలకోసారి వెయ్యమంటూ 'రేపుకూడా రండి'' అన్నాడు.

''మరీ నాకు అవసరమైతే ఫోనుచేస్తాను'' అంది నళిని బేలగా.

''తప్పకుండా చెయ్యండమ్మా. రాజా లేడా'' అన్నాడు.

''లేరండి... రాత్రికి వచ్చేస్తారు'' అంది.

''మరేం ఫర్వాలేదు. అంతగా మీకు ఏం కావలసినా ఫోనుచెయ్యండి. నర్సుని పంపిస్తాను'' అన్నాడు.

నళిని రాకేంద్‌ని తీసుకుని బయటకొచ్చి ఆటోకోసం చూడటం మొదలుపెట్టింది. నాలుగడుగులు వేస్తే అక్కడొక మెడికల్ షాపు వుంది. అక్కడ ఆ మందులు కొనుక్కుంటే ఆటో ఎక్కవచ్చని నడకసాగించింది. మందులు కొని, ఆ షాపు గుమ్మం దిగి రోడ్డుమీదకొచ్చింది. అక్కడ కొంచెం కనుచీకటిగా వుంది. ఆమె అడుగు వేసింది. ఆ పక్కగా పడుకున్న వీధికుక్క బొయ్‌మని లేచి నళిని కాలుపట్టుకుంది. నళిని అరుస్తూ-

''ఛీ ఛీ... వదులు వదులు అంటూ అరిచిందిగానీ, రెండు చేతుల్లో పిల్లాడు వుండటంవల్ల కుక్కని సరిగ్గా అదిలించలేకపోయింది. అది ఓపట్టాన వదిలింది కాదు. ఇంతలో మెడికల్‌షాపులో వాళ్ళెవరో పరుగెట్టికొచ్చిఅదిలించడంతో, వదిలింది. కాలు జివ్వుమని లాగేసింది. కుక్కని తరిమిసేతనే ''ఎక్కడికెళ్ళాలండి'' అన్నాడు.

''ఒక్క ఆటో వుంటే చూసిపెట్టండి... ప్లీజ్'' అంది.

అతనెవరో ఆటో పిల్చి ఎక్కించి - ''బాగా కరిచిందాండీ'' అన్నాడు.

''పర్లేదులెండి. వీడు చాలా జ్వరంతో వున్నా

డు. హడావిడిలో వున్నాను. చూసుకోలేదు. దాని తోక తొక్కానో ఏమో'' అంది. ఆటో స్టార్టయింది. ఇంటికొచ్చి చూస్తే రక్తం లంగాకీ, చీరకి బాగా అంటుకుంది.

రాకేంద్‌ని మంచంమీద పడుకోబెట్టి, నీళ్ళు పోసి ఆ కుక్క కరిచినచోట కడిగింది బాగా. రెండు పళ్ళ గాట్లు బాగా కనిపించాయి. విపరీతమైన సలుపు మొదలైంది.

రాత్రి పది దాటింది. రాకేంద్ ఒళ్ళు ముట్టుకుని చూసింది. వాడికి జ్వరం తగ్గింది. వంటికి చమటపట్టింది. డాక్టరుగారు ఇంజక్షన్ యిచ్చిన ఫలితంగా వాడికి జ్వర తీవ్రత తగ్గిందని స్థిమితపడింది. ఆ శాంతి లేకుండా కాలు సలవడం మొదలుపెట్టింది. ఏదో ఇంట్లో వున్న మందురాసి, కట్టు కట్టింది. పెయిన్ కిల్లర్ టాబ్‌లెట్ వేసుకుంది. కొంచెం కాఫీ కలుపుకుని తాగి పడుకుంది. నెమ్మదిగా బాధ సర్దుకుంది. నిద్రపట్టింది.

అర్థరాత్రి రాజారావు వస్తూనే రాకేంద్ గురించి ఆందోళనపడ్డాడు. వాడికప్పుడు జ్వరం లేదు. నార్మల్ అని చూసి స్థిమితపడ్డాడు. ఏవో కబుర్లు, వాడికెలా జ్వరం పెరిగింది? తనెలా కంగారుపడిందీ, ఏం చేసిందీ అన్నీ చెప్పింది కానీ తనని కుక్క కరిచిందని చెప్పలేదు.

మొత్తానికిద్దరూ నిద్రపోయేసరికి మూడు గంటలైంది.

మర్నాడు నళినికి కాలు నొప్పిచేసింది. రాజారావు ఏమిటంటే - అప్పుడు చెప్పింది. అతను కేకలేసి వెంటనే డాక్టరుదగ్గరకి ప్రయాణంచేయించాడు.

"ఆ... ఎందుకు? ఏంకాదులెండి. నాకు కుక్కలంటే విపరీతమైన యిష్టం. అది నన్నేం చేస్తుంది?'' అంది నవ్వుతూ.

"ఆ విషయం నీకు తెలుసు, నాకు తెలుసు. కానీ పాపం ఆ కుక్కలకి తెలీదుగా'' అన్నాడు రాజారావు. డాక్టరు చూసి ఆ యింజక్షన్స్ స్టాకులేవని, రేపు తెప్పించి కోర్సు మొదలుపెడదామని చెప్పాడు. ఆ కుక్క పిచ్చిదా, మంచిదా తెలుసుకోండి అంటే అక్కడి వెళ్ళి అడిగితే ఎవ్వరూ పూర్తివివరాలివ్వలేకపోయారు. ఒకరిద్దరుమాత్రం అక్కడసలు పిచ్చికుక్కలే లేవని చెప్పారు. అది కొంత సంతృప్తి కలిగించింది.

ఆ మర్నాటినుండి రోజూ యింజక్షన్స్ చేయించుకోవాల్సిరావడంతో, ఆ ఇంజక్షన్స్‌కి జ్వరం వచ్చి, ఆ బాధ పడలేక చాలా నలిగి, నీరసించిపోయింది. ఇంట్లో వంటకో మనిషిని, పైపని చేసి పిల్లాడ్ని చూడటానికో మనిషిని పెట్టుకుంది.

రాకేంద్ జ్వరం పూర్తిగా తగ్గిందిగానీ వాడు వుండుండి విపరీతంగా ఏడవడం, ఒక్కొక్కసారి నళినిచేతుల్లో నిలవకపోవడం చూస్తూంటే వాడు అనుపమకోసం బెంగపెట్టుకున్నాడేమోనని ఇద్దరూ మధనపడ్డారు. కానీ మళ్ళీ ఒకసారి తీసుకెళ్తే వాడికీ అనుబంధం, అనుపమకి పుండు రేగినట్లవుతుంది. అన్నిటికీ మించి మధు ముఖం ముటముటలాడిస్తే, తట్టుకోవడం కష్టం. అందుకే వారా ప్రయత్నం విరమించుకున్నారు.

అయితే ఆ రాత్రే రాఘవేంద్రరావు ఫోను చేసి, సుమారు అరగంట రాజారావుతో మాట్లాడాడు. అన్నీ విని రాజారావు అశక్తతగా ఫోను పెట్టేశాడు.

"ఏమిటీ? ఏమైంది?'' అని ఆత్రుతగా అడుగుతున్న నళినికి ఏం చెప్పాలో తోచలేదతనికి.

"ఏమిటండీ? నాకు చెప్పరేమిటి'' అంది నళిని విసురుగా.

"ఏంలేదు. మధు, అనుపమతో కలిసి వెళ్ళి కలకత్తాలో కాపురం పెడ్తున్నాట్ట'' అన్నాడు.

"కలకత్తాలోనా? ఎందుకు?''

"అక్కడ చేపల వ్యాపారం మొదలుపెట్టాడు''

"ఏమిటతని వుద్దేశం. వ్యాపారంలో వున్నది కాస్తా పోతే...?''

"అతనికి వ్యాపారంలో లాభం వస్తుందా? నష్టం వస్తుందా అన్నది కాదు సమస్య''

"అవును ఇంత అర్జంటుగా అంతదూరమెందుకు?''

"అదేమరి... అనుపమకి స్థలం మారిస్తే, కాస్త బాగుంటుందని అన్నాట్ట''

నళిని ఒక్కక్షణం ఆలోచించి "నిజమేలెండి.




కొత్త మనుషులు, కొత్త ప్రదేశాలు - కొత్త గాలి, కొత్తనీరు''

''కొత్త భాషా''

''మరే... మనిషిలో కొత్త వుత్సాహం తెచ్చే అవకాశం వుంది''

''నిజమే...'' సాలోచనగా అని వూరుకున్నాడు. నళినేం మాట్లాడలేదు.

''కానీ... బాబయ్యా, పిన్నీ పరిస్థితే మరీ అధ్వాన్నంగా వుంది''

''ఏంచేద్దాం''

''ఏంచేస్తాం? ఏమీ చెయ్యలేం. కొన్నాళ్ళు ఇలా సాగనీయడమే. అతనన్న ప్రతీ మాటా కాదంటే అతనికీ తిక్కగా వుంటుంది'' అన్నాడు రాజారావు.

''వాళ్ళిద్దరూ కులాసాగా వుండాలనేకదా! ఈ బాధంతా''

''అలా కాకుంటే, తను అనుపమని వదిలేస్తానన్నాట్ట''

''ఆ...! అంతమాటన్నాడా?''

''అవును. నువ్వు నీ పాత మమకారాలు, బంధాలు వదులుకోలేకపోతే నేనెందుకు? నే వెళ్ళిపోతా అన్నాట్ట''

నళిని ఏ సమాధానమూ చెప్పలేకపోయింది. నెమ్మదిగా ''పోనీలెండి. కలకత్తా యిద్దరినీ కలిసి వెళ్ళనీయడమే మంచిది. మళ్ళీ అనుపమ కడుపున ఒకరో, యిద్దరో పిల్లలు పుడితే తనకీ మార్పు వస్తుంది. మధుతో గట్టి బంధమూ ఏర్పడుతుంది''

''నాలుగైదు లక్షలు పెట్టుబడి పెట్టాడుట''

''ఏమిటీ? వ్యాపారం బాగా సాగుతుందంటారా''

''మధు విషయంలో మరే బెంగా లేదు. అతను చెయ్యగలడు. వ్యాపారం బాగానే వృద్ధి చెయ్యగలడు. నా బెంగ ఒకటే''

''ఏమిటి?''

''అనూని కుళ్ళుమాటలని బాధించకుండా వుంటేచాలు''

''ఏం... అలా అన్నాడని చెప్పిందా?''

''అది చెప్తుందేమిటి? నాకే ఎందుకో అలాగనిపించింది. మగవాడు, పెళ్ళయి సంసారం చేసిన స్త్రీని పెళ్ళిచేసుకుంటే, ఎంతో కొంత కుళ్ళుమాటలు అంటాడని నా నమ్మకం''

''మగాడని ఏముంది? స్త్రీ అయినా అనొచ్చుగా'' అంది.

''అంటే కూడా చెల్లదు. ఇక్కడ తలొంచుకుని మాటలు పడాల్సిన పరిస్థితి వుంటుంది స్త్రీ అయితే''

''ఎందుకు?''

''ఎందుకూ అంటే ఏంచెప్పను? కొన్ని వ్యవస్థాగతమైన లక్షణాలు. అంతే...''

''కానీ అనుపమ చాలా సున్నితమైన మంచి పిల్ల. ఆమెనేమైనా అంటే మహా పాపం''

''చేసే తప్పులకి పాపం వస్తుందనే భయం వుంటే మనుషులు ఇన్ని తప్పులు చెయ్యగలరా?''

''పోనీలెండి... ఇప్పుడన్నీ అతనిష్టప్రకారమే జరుగుతున్నాయిగా పెళ్ళి అనుకున్నప్పుడు యివన్నీ మనం ఎవ్వరం మాట్లాడలేకపోయాం. మనం కండిషన్స్ ఏమీ పెట్టలేదు కదా''

''అదే అలుసు. అవన్నీ మాట్లాడాలా, అతనికి తెలీదా అనుకున్నాం''

''కానీ తెలిసినా అతనిష్టమొచ్చినట్లు చేస్తున్నాడు''

''ఏమైనా ఎదురుచెప్తే, వదిలేసి వెళ్ళిపోతానంటాడు''

''అవును. భర్తపోయిన ఏడాదిలో మరో పెళ్ళి చెయ్యడమే గొప్ప తెగింపు బంధుజనంలో ఇప్పుడా చేసుకున్నవాడు వదిలేస్తానంటే ఎంత అప్రతిష్ట''

''అదీకాక - అతని కోరికలన్నీ సబబుగానే అనిపిస్తాయి అందరికీ''

''ఒక్క మనిషికి తప్ప''

''అవును... అనుభవించేవాళ్ళం మనంకదా''

నళిని యింట్లో పని చూసుకోడానికి వెళ్ళింది. రాజారావు ఆలోచనలలో పడ్డాడు. రాకేందుని తీసుకెళ్ళి చూపించటమా మానడమా తీరా తను ఒక్కడే వెళ్తే, అనుపమ చూసే నిష్టూరమైన చూపులు తను తట్టుకోగ

లడా? తీసుకెళ్తే మధుని ఎదుర్కోగలడా?

ఒకరోజంతా ఆలోచించి రాజారావు ఒక్కడే వెళ్ళడానికి నిర్ణయించుకున్నాడు.

★ ★ ★

ఆ రాత్రి అస్సలు నిద్రపట్టలేదు అనుపమ కి. తెల్లారితే ప్రయాణం. కళ్ళుమూసుకున్నా, తెరిచినా చిన్నారి రాకేంద్ ముఖం కని పిస్తోంది. ఆనందంగా, అమాయకంగా నవ్వు తూ చేతులుచాచి తనదగ్గరకి వస్తున్నట్లామెకి భ్రమ కలుగుతోంది.

''అమ్మా! యింత దుర్మార్గురాలవా నువ్వు?'' అని అడుగుతున్నట్లుంది వాడి నవ్వు.

''అమ్మా! నేనంటే నీకు ప్రేమ లేదా?'' అని నిగ్గదీసి అడుగుతున్నట్లుంది అతని అమాయకపు ముఖం.

''అమ్మా! నాన్న ఎలాగూ లేడు. నీ ప్రేమని కూడా దూరంచేస్తావా, ఇది నీకు న్యాయమా'' అన్నట్లుంది వాడి వెర్రినవ్వు.

''అమ్మా! తమ్ముళ్ళూ, చెల్లాయిలూ పుడితే వాళ్ళని ప్రేమగా చూస్తాను. వాళ్ళని ఎత్తుకుని మోస్తాను. నన్నూ నీతో రానీయమ్మా'' అంటున్నట్లుంది వాడు చేతులు చాచి ముందుకురికే తీరు.

అనుపమ వులిక్కిపడి లేచింది. మధు హాయిగా నిద్రపోతున్నాడు. నెమ్మదిగా లేచింది. అప్పుడామెకి గుర్తుకొచ్చింది. ఆరోజు వుదయంనుండి మధు కూడా కూడాఉండటంవల్ల, తను చెయ్యాలనుకున్న ఒక పని చేయలేకపోయింది.

హాల్లో పడుకున్న యాదగిరి దగ్గరకెళ్ళి నెమ్మదిగా పిల్చింది. యాదగిరి అస్సలు నిద్రేపోవడంలేదన్నట్లు, వెంటనే లేచాడు. చాలా గొంతు తగ్గించి-

''యాదగిరీ... నేనిచ్చిన ఫొటో ఏంచేశావు?'' అంది.

''పటంకట్టించి, నిన్ననే తెచ్చి నాదగ్గర పెట్టానమ్మా''

''ఇస్తావా''

''జాగ్రత్త తల్లీ, నువ్వు అడుగుతావని నాకు తెలుసు. అందుకే నా తలదగ్గర పెట్టుకున్నాను. ఆయన నిజంగా ధన్యుడమ్మా. నీ గుండెల్లో బంగారపు గుడికట్టుకున్నాడు. అంతటి స్థానం అందరికీ రాదు'' అన్నాడు.

అతనిచ్చిన ఫొటో అందుకుని గట్టిగా గుండెలకి అదుముకుంది. ఒక్కమారు ఆ బొమ్మవైపు చూసి, మృదువుగా పెదవులతో తాకింది.

ఒక్కక్షణం ఆలస్యం చెయ్యకుండా బాత్‌రూమువైపు వెళ్ళిపోయింది. ఆమె ముందుగానే అది ఎలా దాచుకుని తీసుకెళ్ళాలో నిర్ణయించుకుంది. ఆమె ఆ ఫొటో ఎన్నో ఫొటోలున్న ఆల్బమ్, ఎక్కడో ఎవ్వరూ కనిపెట్టలేనివిధంగా దాచేసుకుంది. ఎవరు చూసినా ఫరవాలేదు. ఒక్క మధు చూస్తే... కాదు - వద్దు - చూడకూడదు...

మళ్ళీ వచ్చి నిశ్శబ్దంగా పక్కమీద పడుకుంది. కాసేపటికి బరువుగా రెండు చేతులు ఆమెని అదిమిపట్టాయి. గుండెలోపల గుబగుబలాడింది దుఃఖం. కదిలే గుండెలో వూరుతున్న కన్నీళ్ళు కళ్ళల్లోకి రాకుండా జాగ్రత్తపడాలి. బిగుసుకుంటున్న సంకెళ్ళలో అయిష్టతని ముక్కలుచేస్తూ, అణువణువూ లొంగిపోతున్న భావన. చుట్టుకుపోతున్న కొండచిలువలా అతని శరీరం. తాచుపాములా బుసకొడుతున్న కామోద్రేకం, గరళాన్ని ఒక్కొక్క చుక్కా తాగుతున్నట్లు నిముషాలు లెక్కపెడుతూ, తన ఆలోచనతో ప్రమేయం లేకుండా వేడెక్కుతున్న నరాల్ని అదుపుచేయలేక నిట్టూరుస్తూ, అంతలోనే మెదడులో ఆలోచనలన్నీ ఒక్కసారి తెగిపోయాయి. బుర్ర శూన్యంగా వుంది. శరీరంనుంచి మనసు విడిపోయి దూరంగా జరిగింది. నరాల్లో విద్యుత్తు ప్రవహిస్తున్నట్లు ఆమె రెండు చేతులూ అతని మెడచుట్టూ వేసింది.

నూటికి ఒకటోవంతు మధు సాంగత్యం భరించగలిగిన మొదటిరాత్రి అనుపమకి.

తెల్లవారుతుండగా రాజారావు అన్నయ్యా ఒక్కడే రావటం చూసి మనసు చివుక్కుమంది. కానీ అంతలోనే సర్దుకుంది. రాత్రి సంఘటన గుర్తుకొచ్చింది. తనెంతకాలం ఈ పోరాటం సాగించగలదు? కానీ, వాడ్ని ఒక్కసారి చూస్తే బాగుండుననీవుంది. చూస్తే తను మళ్ళీ వదలలేనని భయంగానూ వుంది. అందుకే అన్నయ్యా రాకేంద్‌ని తీసుకురాలేదని





బాధగానూ వుంది. మంచిదేలే అని తెరపిగా నూ వుంది.

అనుపమనెలా ఎదుర్కోవాలా అని భయప డుతున్న రాజారావుకి అనుపమ ప్రవర్తన ధై ర్యాన్నిచ్చింది. అనుపమ సర్దుకుపోతోంది. ఇప్పుడు మళ్ళీ పాతపుండు రేపటంకంటే ద్రోహం మరోటి వుండదు అనుకున్నాడు.

అన్ని ఏర్పాట్లు ఘనంగా చేయించాడు రాఘవేంద్రరావు. అక్కడ మంచి యిల్లు కూడా రెడీ పెట్టుకున్నారు. భయమేమీ లేదు.

అనుపమ, మధూ వెళ్ళిపోగానే ఇల్లు చీక ట్లు కమ్మినట్లయింది.

ఎలా అనుకుంటే ఎలాగైందీ - అని సావి త్రి, రాఘవేంద్రరావు గుడ్లనీళ్ళు కుక్కు కుంటూ కూర్చుండిపోయారు.

★ ★ ★

పోస్టులో వచ్చిన వుత్తరం చూసి ఆత్రుతగా చింపింది నళిని. అవును... అది అనుపమ రాసిందే. ఆ దస్తూరీ చూస్తూనే ఎంతో ఆత్మీ యంగా అనిపించింది. ఇద్దరిదీ కొన్నేళ్ళ అను బంధం. ఇద్దరిమధ్యా ఎంతో స్నేహం వుంది. నళిని పెళ్ళయి మొట్టమొదట రాఘవేంద్ర రావు యింటికి వచ్చేనాటికి అనుపమ ఎనిమి దేళ్ళ పిల్ల. చలాకీగా అల్లరిచేస్తూ, వూరంతా సైకిలు తొక్కి వస్తూండేది. మగపిల్లలు లేని ఆ యింట్లో రాజారావే మగపిల్లవాడు. అందుకే నళిని వస్తే తనకి కోడలు వచ్చిందని ఆనంద పడిపోయింది సావిత్రి. ఆనాటి అనుబంధం నళినిది అనుపమది.

ప్రియాతిప్రియమైన వదినా!

ఇన్ని వందల మైళ్ళ దూరం నుంచి పిలు స్తున్న నా పిలుపు నీకు వినిపిస్తోందా? ఇక్కడికి విసిరివేయబడ్డాక, ఎంత వంటరిగా వుంటు న్నానో చెప్పలేను. ఇరవైనాలుగు గంటలూ రాకేంద్ ముఖం నన్ను వెంటాడుతూనే వుంటోంది. నా చిన్నారి తండ్రిని వదిలి ఎంతో కిరాతకంగా యిటు పారిపోయి వచ్చేశాను. నా జీవితానికి వాడేదో అడ్డు అని అందరూ నిర్ణ యించి, నా హృదయానికి రంపపుకోత పెట్టా రు. నిజానికి వాడులేని ఈ జీవితమే వ్యర్థమని పిస్తోంది.

ఇక్కడికొచ్చాక పూర్తిగా మధు వ్యాపారవిష యాల్లో మునిగిపోవడంవల్ల నన్ను పట్టించుకో వడంలేదు. నాకెంతో హాయిగా వుంది. ఇక్కడ నేను ఎవ్వర్నీ తలుచుకుని బాధపడటంలే దని, కేవలం తన ధ్యాసలోనే వున్నానని, మధు పూర్తి సంతృప్తితో వున్నాడు. అదే నాకు చాలు. నాదగ్గర రాకేంద్ అందమైన ఫొటోలు రెండు వున్నాయి. అవి చూసుకుంటూ కాలక్షేపం చేసే స్తున్నాను.

అన్నయ్యకి నమస్కారాలు చెప్పు. నా కన్న తండ్రి రాకేంద్‌తో నన్ను క్షమించమని చెప్పి, నాతరపున ఒక కోటి ముద్దులు పెట్టు... వుంటా ను.

నీ
అనూ

ఉత్తరం చదివాక నళినికి కొంత సంతృప్తిక లిగినా, కొంత బాధ కూడా కలిగింది. అనుపమ జీవితం చిత్రమైన మలుపులు తిరిగింది. ఎన్నో ఎదురు దెబ్బలు తింది. ఇప్పటికైనా పరిస్థితులు చక్కబడి అనుపమ సుఖంగా వుంటే బాగుండును అనుకుంది నళిని.

వెంటనే అనుపమకి జవాబు రాద్దామను కుంది. కానీ ఉదయం నుండి వంట్లో నలతగా వుంది. తలనొప్పిగా వుంది. జ్వరముందేమో నని అనుమానంగా వుంది. అందువల్ల నీర సంగా పడుకుండి పోయింది.

ఇంట్లో అన్ని పనులూ పనివాళ్ళే చేస్తున్నా నళిని ఆరోగ్యంగా తిరగడంలేదు. అస్తమాను జ్వరం వస్తోంది.

ఆరోజు మరీ జ్వరతీవ్రత పెరిగి హాస్పిటల్‌కి వెళ్ళివచ్చింది.

రోజులు వేగంగా గడిచిపోతున్నాయి. నళిని అనుపమకి సుదీర్ఘమైన లేఖలు రాస్తూనే వుంది. వాటికి జవాబులు అందుకుంటూనే వుంది. నళిని రాసే వుత్తరాలనిండా రాకేంద్ గురించి, వాడి ఆరోగ్యం గురించి, వాడు చేస్తు న్న అల్లరి గురించి, ముద్దుముద్దుగా వాడు మాట్లాడే మాటల గురించి, కానీ ఎప్పుడూ తన గురించి ఎక్కువగా రాసుకునేది కాదు.

ఆరోజు మళ్ళీ జ్వరం వచ్చింది. నళినికి ఏదో భయం, బెంగమొదలైంది. అనుపమకి వుత్తరం రాద్దామనిపించింది. మొదలుపె

ట్టింది. ఆ వుత్తరంలో ఆమె మనసులోని బాధంతా చెప్పింది. నీ రాకేంద్ చాలా ఆరోగ్యంగా హుషారుగా వున్నాడు. కానీ వాడి ఆటపాటలు నువ్వు చూడలేకపోతున్నావని నేను బాధపడుతూ వుంటాను. కన్నతల్లిగా నీకు ఆ హక్కు వున్నప్పటికీ, కనీసం వాడిని కంటితో చూసే అర్హత కూడా లేకుండా వున్నావు, సర్లే, ఇవన్నీ ఎప్పుడూ వుండేవే. అంటూ సాగింది ఆ వుత్తరం. అయితే నళిని పోష్టుచేసిన వుత్తరం దురదృష్టవశాన మధు చేతిలో పడింది. అతను కోపంతో వూగిపోయాడు. ఇన్నాళ్ళుగా అనుపమ, నళినిలమధ్య సాగుతున్న వుత్తర ప్రత్యుత్తరాల సంగతి అతను గమనించనేలేదు. అతనికి చాలా వికృతమైన ఆలోచనలు బుర్రనిండా రొదచేయడం మొదలుపెట్టాయి. అతనిలో కసి క్షణక్షణం పెరిగిపోసాగింది. అతనేంచేస్తున్నాడో, ఏం ఆలోచిస్తున్నాడో కూడా అర్థంకానంతగా కోపంతో వూగిపోసాగాడు.

అనుపమ పాతజ్ఞాపకాలతో, కొడుకుని తలుచుకుంటూ, చనిపోయిన భర్తని తలుచుకుంటూ తనతో జీవిస్తోందన్న సంగతిని అతను జీర్ణించుకోలేక పోతున్నాడు.

అది సహజమని, ప్రేమనేది భయపెడితే దండిస్తే పుట్టదనీ, కన్నబిడ్డమీద తల్లికి ప్రేమ మర్చిపోయేదిఎంతమాత్రం కాదని, తానెంత నిర్బంధించినా, అది జరిగేది కాదని, అందులో అనుపమ తప్పుకూడా ఏమీ లేదని అతను గ్రహించుకోలేకపోయాడు. ఒక్కక్షణం స్థిమితంగా న్యాయంగా ఆలోచించలేకపోయాడు. అతను వక్రంగానే కసిగా ఆలోచించి ఒక నిర్ణయానికొచ్చాడు. అలాంటి నిర్ణయం అంత అమానుషమైన నిర్ణయం తీసుకునేటప్పుడు కూడా అతను ఒక్కక్షణం న్యాయంగా ఆలోచించలేకపోయాడు. మధు దగ్గరనుండి వచ్చిన వుత్తరం చూసి రాజారావు గజగజవణికిపోయాడు. అతనికి కాళ్ళూ చేతులూ ఆడలేదు. మధు ఇంత దుర్మార్గుడేమిటి? అని దిగ్భ్రాంతి చెందాడు. తనేం చెయ్యాలి? తనేం చెయ్యగలడు? అసలు తనీ సమస్యలో అనుకోకుండా ఇరుక్కున్నాడు. ఈ పాపపుణ్యాలలో తనెందుకు భాగం పంచుకోవాలి.

రాజారావుకి తలనొప్పి వచ్చేసింది. అతని ఆలోచనలు వెనక్కి వెనక్కి వెళ్ళాయి. రాహుల్ సంబంధం తనే వెళ్ళి ఎంతో వుత్సాహంగా కుదిర్చాడు. అది ఘోరంగా దెబ్బతినడంతో ఏమిటో తెలియని నైతిక బాధ్యత స్వీకరిస్తూ ముందుకు సాగిపోతున్నాడు. అనుపమ వద్దు మొర్రో అంటున్నా వినకుండా మళ్ళీ పెళ్ళికి ఒప్పించాడు, అప్పుడు రాహుల్ సంబంధం దూసుకుపోతుందని కంగారుపడ్డాడు. మొన్నమొన్న మధు దాటిపోతే, అంత విశాలహృదయంతో ఎవరు ముందుకొస్తారూ అనే ఆలోచనతో తొందరపడ్డాడు. తనెందుకిలా తడబడుతున్నాడు. చివరికి అనుపమ సుఖంగా వుండటంకోసం ఆమె కొడుకుని కూడా తను పెంచడానికి తీసుకున్నాడు. ఇదంతా అనుపమ ఆనందం కోసం అని అందరమూ భ్రమపడుతూనే వున్నాం.

కానీ యిప్పుడు మధు పెట్టిన షరతు అన్యాయం, అధర్మం, అమానుషం, ఇదిలా ఎన్నాళ్ళు సాగనివ్వాలి. ఛీ! కూటికి గతిలేనివాడ్ని రాజుని చేస్తే ఎంత ద్రోహం చేస్తున్నాడు! ఇప్పుడు తనేం చెయ్యగలడు? నళినికెలా చెప్పగలడు?

''నళినీ, నువ్వు అనూకి తరుచు వుత్తరాలు రాస్తున్నావా?'' అన్నాడు రాజా.

''రాస్తున్నాను ఏం?'' అంది.

''ఏం రాస్తున్నావు?''

''ఏముంటాయి- మా యిద్దరి మధ్యా- రాకేందు కబుర్లే''

''ఓహో...దాని ఫలితమేనన్నమాట'' అన్నాడు ఆలోచిస్తూ.

''ఏమిటి... ఫలితమేమిటి?'' అంది నళిని.

''ఇదిగో... ఆ దుర్మార్గుడు మధు రాసిన వుత్తరం చూడు''

''ఆత్రుతగా ఆ వుత్తరం తీసుకుని చదివి నిర్ఘాంతపోయింది.

''ఛీ! మరీ ఇంతనీచుడా''

''ఏం చేద్దాం'' అన్నాడు.

''అతను చెప్పినట్లు చెయ్యకపోతే అనూని తీసుకొచ్చి యిక్కడ వదిలేస్తాట్ట''




''అవును''

నళిని బాధగా తలపట్టుకుని కుర్చీలో కూల బడింది. కొంతసేపటికి తేరుకుంది.

''వద్దు... అనూని మధు దగ్గర వుండేందుకు మనం అబద్ధమాడుదాం''

''కానీ... నళినీ ఎన్నాళ్ళిలా''

''ఏమండీ! మీకో విషయం చెప్పనా''

''ఏమిటి?''

''ఏముంది? ఎలాగూ రాకేందు అనుపమకి లేడు. శాశ్వతంగా లేడని చెప్పేద్దాం. కానీ కాదంటే ఇప్పుడు అనుపమ తిరిగొస్తే...అసలే వట్టిమనిషి కాదు. ఇప్పుడు ఆరోనెల'' అంది నెమ్మదిగా.

''ఏమిటీ... ఏమిటీ... అయ్యో... ఎలాంటి విషమపరిస్థితి...'' రాజారావు మంచంమీద వాలిపోయాడు. మరింకేమీ మాట్లాడలేదు.

★ ★ ★

రాజారావు దగ్గరనుండి వచ్చిన టెలిగ్రామ్ చదువుకుని అనుపమ ఘొల్లుమంది.

'పసివాడు రాకేందుకి విషజ్వరం రావడంవల్ల మరణించాడు' అని వుందా టెలిగ్రామ్‌లో-

వెంటనే బయలుదేరేందుకు సంసిద్ధమైంది అనుపమ. మధు ఎంతో వూరడించి ఓదార్చి ఆపాడు.

పోయిన పిల్లాడు తిరిగిరాడు. నువ్వెళ్ళి చేసేదేమీలేదు. పైగా నీ ఆరోగ్యం అంతంత మాత్రం. వట్టి మనిషివి కావు'' అన్నాడు మధు.

అనుపమ అతని మాట వినిపించుకోకుండా ఏడిచింది. కానీ ఫలితం శూన్యమే అయింది. మూడు రోజులు కంటికి మింటికి ఏకధాటిగా ఏడ్చింది. ఆ మూడురోజులూ మధు కంటికి రెప్పలా ఆమెని కాపాడుకున్నాడు.

చూడూ! కడుపులో వున్న మన బాబుకోసం కనీసం నువ్వు దుఃఖం దిగమింగాలి. నీ ఆరోగ్యం పూర్తిగా చెడితే లేనిపోని కష్టాలు, సమస్యలు'' ఎంతో నచ్చచెప్పాడు. బుజ్జగించాడు. నిస్సహాయంగా వుండిపోయింది అనుపమ.

అయితే ఆ తర్వాత మధులో మార్పు కనిపించింది. అనుపమ కాలుకదిపితే కంది పోతుందన్నట్లు చూసుకోవడం మొదలుపెట్టాడు.

కాలం గాయాన్ని మాన్పే గొప్ప శక్తిగల మందు. క్రమంగా అనుపమలో పొంగిపొరలే దుఃఖం తగ్గి, నిర్లిప్తత, నిరాశా చోటుచేసుకున్నాయి. ఆ తర్వాత మళ్ళీ నళిని దగ్గర నుండి, రాజారావు దగ్గర నుండి వుత్తరాలు రావడం లేదు. ఒకటే అనుకుంది.

''నిజమే ఇంతఘోరం జరిగాక, వదిన మాత్రం ఏమనిరాస్తుంది వుత్తరం'' అని సరిపెట్టుకుంది అనుపమ.

నెలలు గడిచే కొద్దీ అనుపమ హృదయం పుట్టబోయే బిడ్డవైపు అనురాగంతో నిండసాగింది.

మధుకి వ్యాపారంలో మంచి లాభాలొచ్చాయి. అతను ఒక్కసారిగా నలభైవేలు పెట్టి డైమండ్ నెక్లెస్ తీసుకొచ్చి ఆమె మెడన లంకరించాడు.

బహుశ ఆమె చేసిన త్యాగానికి ప్రతిఫలమేమో మరి అతనికే తెలియాలి.

అనుపమ మాత్రం తల్లి దండ్రులకోసం విపరీతంగా బెంగబెపెట్టుకుంది. ఉన్నట్టుండి మనసంతా దిగులుతో నిండిపోయేది. పొడిపొడిగా వస్తున్న వుత్తరాలు ఆమెకి ఏమాత్రం తృప్తిగా వుండేవి కావు. 'ఎవరికోసం, తనిలా దూరంగా బతుకుతోంది?' అని తరుచు తనని తను ప్రశ్నించుకునేది? ఎంత ప్రయత్నించినా సమాధానం దొరికేదికాదు. కానీ అందరూ కలిసి తనకోసం యిదంతా చేశారంటే వింతగా వుండేది.

★ ★ ★

''రాజా నువ్వు తప్పుపనిచేశావు'' అన్నాడు రాఘవేంద్రరావు నిస్పృహగా.

''తప్పో ఒప్పో నాకు తెలీదు. నిర్ణయించే శక్తి లేదు. కానీ చేతులకీ, కాళ్ళకీ సంకెళ్ళు పడినట్లనిపించింది. వెనుక నుయ్యి, ముందు గొయ్యి అన్నట్లయింది'' అన్నాడు రాజారావు.

''ఒరేయ్ రాజా! మధు ఇంత దుర్మార్గు

డనీ, గోముఖ వ్యాఘ్రమని కనిపెట్టలేకపోయాను. ఏమాత్రం వూహించినా, చస్తే నా బంగారు తల్లిని వాడికిచ్చేవాడ్ని కాదు. నా పిల్ల నాకు బరువా?'' అన్నాడు బాధగా.

''బరువుకాదు. బాధ్యత అని ఒకటి వుంటుంది. మీ బాధ్యత మీరు నిర్వర్తించారు. ఒక్కటి సూటిగా ఆలోచించండి. అతనివరకు అతను కరక్ట్‌గానే ప్రవర్తించాడు. అనుపమనేం బాధించడం లేదు. ఆమె పూర్వపు భర్త జ్ఞాపకాలు తుడిచి పెట్టెయ్యాలని కోరుకోవడం అతని సంస్కారం అంతే'' అన్నాడు.

''అదే నేనూ చెప్తున్నా- అదే అతని కుసంస్కారం పాలు తాగి రొమ్ము గుద్దే నైజం''

''మీరిలా ఆలోచిస్తూ మీ మనసూ, ఆరోగ్యం బాగా పాడుచేసుకుంటారా?'' అన్నాడు రాజా.

''ఇంక పాడు చేసుకునేదీ లేదు. బాగుచేసుకునేది అంతకన్నాలేదు. ఇదిలా గడిచిపోవడమే'' రాజారావేం మాట్లాడలేదు. మళ్ళీ రాఘవేంద్రరావే అందుకున్నాడు. ''చంటి పిల్లాడియందు కూడా వాడలా ప్రవర్తించడం నాకు నచ్చలేదు'' అన్నాడు.

''బాబయ్యా! నువ్వు రెండోవైపు నుండి ఒక్క క్షణం ఆలోచించు. తర్వాత అనుపమకి పుట్టబోయే పిల్లలకి కూడా ఏ సమస్యాలేకుండా చేశాడు. వ్యాపారంలో మెలకువలు తెలుసు. అతనికున్న ముందు చూపు మరెవ్వరికి వుండదు''

''అబ్బాయి, నేను నావైపు నుంచే ఆలోచిస్తాను. దానిమీద నాకు ఎంతో బెంగవుంది. ఒక్కగానొక్క బిడ్డ అదెక్కడ దిక్కులేనిదై, భర్త లేక ఒంటరిదై పోతుందో అని ఆలోచించి, బాధపడి [illegible] మధు గుణ [illegible] తాడని ఆశ [illegible] పెట్టుకున్నాడు.

రాజారావేం మాట్లాడలేదు. ఇవన్నీ అతనికీ తెలిసినవే, ఇవన్నీ అతనూ ఆలోచించినవే, బాధపడినవే. కానీ అన్నీ మనం అనుకున్నట్లు జరగవని రాజారావుకి బాగా తెలుసు. పైగా అసలే బాధలో వున్న రాఘవేంద్రరావుని మరింత ఎక్కేసి, మధు మీద మరింత [illegible]

ఖత కలిగించటం అతని వుద్దేశం కాదు. మనుషుల మధ్య అనురాగం పుట్టడానికి ప్రయత్నించాలిగానీ, విభేదాలు సృష్టించడానికి దోహదం చేయకూడదని అతని ఆదర్శం.

అప్పుడే యాదగిరి అక్కడికొచ్చాడు. వచ్చి నెమ్మదిగా అన్నాడు. ''అయ్యా! అమ్మగారేం బాగాలేరు. ఒకసారి రండి నాకెలాగో అని పిస్తోంది'' అని.

సావిత్రికి మళ్ళీ తిరగబెట్టింది. మాట పూర్తిగా పడిపోయింది. మనిషి అస్సలు కదల్లేకుండా అయిపోయింది. తెరిచిన కళ్ళనిండా నీళ్ళు.

రాఘవేంద్రరావు హృదయం ద్రవించిపోయింది. రాజారావు డాక్టరు కోసం పరుగెట్టాడు.

ఆ రాత్రి డాక్టరు మందులమీద నిలబెట్టాడు. అప్పుడు అందరికీ తెలుసు ఆమె మనసులో వున్న ఒకే ఒక కోరిక. అది అనుపమని చూడాలని. కానీ పరిస్థితులు అస్సలు అనుకూలంగా లేవు. ఆమె ప్రస్తుతం యిక్కడికి రావడం ఎంత మాత్రమూ వీలుకాదు.

రాత్రి గడవాలన్నారు. రాజారావు, రాఘవేంద్రరావు అరచేతిలో ప్రాణాలు పెట్టుకుని వుండిపోయారు.

సావిత్రి గండం గడిచింది. అంటే కట్టెలో ప్రాణం వుంది. మాటా పలుకు లేదు.

వారంరోజులు అలాగే వుంది. ఇద్దరికీ ఏం చెయ్యాలో తోచటం లేదు.

ఆ రోజు మధ్యాహ్నం మధు దగ్గరనుంచి టెలిగ్రాం వచ్చింది.

అనుపమకి మగబిడ్డ పుట్టాడు. తల్లీ బిడ్డ క్షేమం అని.

వారు ఆనందించే స్థితిలోనూ లేరు. ఆందోళన పడే ఓపికా లేదు.

ఆ రాత్రి సావిత్రి ప్రాణం అనంతవాయువుల్లో కలిసిపోయింది. చంటి పిల్లాడిలా ఏడ్చాడు రాఘవేంద్రరావు. అన్నీ సక్రమంగా జరిగిపోయాయి. అనుపమకి తెలియజెయ్యనేలేదు.

పదిరోజుల తర్వాత రాజారావు, రాఘవేంద్రరావు కలిసి కలకత్తా వెళ్ళారు.

తండ్రిని కౌగలించుకుని భోరున ఏడ్చింది అనుపమ. ఇద్దరూ రాళ్ళలా వుండిపోయారు. వచ్చినవంటిమీద [illegible] పెట్టారు.

పుట్టిన పిల్లాడు ఆరోగ్యంగా వున్నాడు. వాడి మీద మధు చూపించే ప్రత్యేక శ్రద్ధచూసి ఇద్దరూ ముక్కుమీద వేలేసుకున్నారు. ఆహా! ఇదేనా మానవ నైజమంటే. 'మన' అనుకోగానే వచ్చే ప్రేమా- 'కాదు' అనుకోగానే కలిగేద్వేషం. ఇవే ఈ లోకాన్ని ఏలుతున్న ప్రధాన అంశాలు.

మధు, రాఘవేంద్రరావుని తన దగ్గర వుండిపొమ్మని ఎంతో బతిమాలాడు. అనుపమ కూడా ఎంతో కాళ్ళా వేళ్ళా పడింది.

మళ్ళీ త్వరలోనే వస్తానని చెప్పి రాజారావుతో తిరుగు ప్రయాణమైవచ్చేశాడు.

వస్తూ అనుకున్నాడు. తామెన్ని అబద్దాలు ఆడినా, ఎంత క్షోభ అనుభవించినా, చివరకి అనుపమ సుఖంగానే వుంది. బిడ్డా పాపలతో ఆమె ఆనందంగా వుండాలి. అదే తాము కోరుకునేది అనుకుంటూ సర్దుకున్నాడు.



**ఒక్కొక్క**సారి కుటుంబపెద్ద అకస్మాత్తుగా చనిపోతే ఆ కుటుంబం చిన్నాభిన్నమైపోయే ప్రమాదముంది. పోయిన వాళ్ళు పోగా, బ్రతికి వున్నవాళ్ళకి చుట్టుకునే సమస్యలు ఒక్కొక్క సారి భయంకరంగా తయారవుతాయి. ఆ సమస్యల నుండి బయటపడటానికిమనసుకి యిష్టం లేని నిర్ణయాలు కూడా తీసుకోవాల్సి వస్తుంది.

ఆనందమయంగా వున్న రాఘవేంద్రరావు కుటుంబంలో రాహుల్ అకాలమరణం, ఆ కుటుంబాన్నీ అందులో సభ్యుల్ని ఉక్కిరిబిక్కిరి చేసి దరితీచకుండా చేసింది. సుఖ సంతోషాలు చితికిన ఆ కుటుంబంలో సావిత్రి మరణం పెద్దగా ప్రభావం చూపలేదు.

కానీ, ఇంకా ఎలాంటి అవాంతరాలు జరగబోతున్నాయో వారెవ్వరూ వూహించలేదు.

ఆ రాత్రి రాజారావు యింటికొచ్చేసరికి నళిని ఒళ్ళు ఎరక్కుండా జ్వరంతో పడిపోయి వుంది. పనిమనిషి కంగారుపడుతోంది. రాకేందుని ఎత్తుకునే పిల్లవాణ్ణి సముదాయించలేక సతమత మవుతోంది.

ఎందుకో మొదటిసారి నళినిని ఆ స్థితిలో చూసిన రాజారావు గుండెలు దడదడలాడాయి. విపరీతమైన భయంతో ముచ్చెమటలు పోశాయి. ఒక్కక్షణం ఏం చెయ్యాలో తోచక తికమక పడ్డాడు.

అతనికా స్థితిలో ఆమెని యింట్లో వుంచుకోవడం దుర్భరమనిపించింది. వెంటనే నర్సింగ్ హోమ్‌కి తీసుకెళ్ళాడు. ఒకపక్క పిల్లాడి ఏడుపు, మరోపక్క అపస్మారక స్థితిలో నళిని. రాజారావుకి ఎన్నడూ లేనంత నిస్పృహ వచ్చేసింది.

రాకేంద్ అతని మెడ చుట్టూ చేతులు వేసి గట్టిగా కౌగలించుకుని వదల్లేదు. దుఃఖంతో వాణ్ణి ముద్దుపెట్టుకుని "నువ్వు వెయ్యేళ్ళు సుఖంగా బతకరా నాన్నా. నువ్వు బతికుండగానే, చచ్చిపోయావని చెప్పిన నన్ను క్షమించరా " అనుకున్నాడు మనసులో.

క్షణాలమీద నళిని సీరియస్సయిపోయింది.ఆమెకి ఎనిమిది నెలలక్రితం కరిచిన కుక్క తాలూకు విషం యిప్పుడామె ప్రాణాల్ని కబళిస్తోంది.

ఆమె గురకలో మార్పు వచ్చేసింది. అదొక భయంకరమైన కుక్క ఏడుపులా, అరుపులా వుంది. చుట్టు పక్కలవాళ్ళూ భయంతో గజగజలాడిపోయారు. మందులు వాడినా యిలా ఎందుకు జరిగిందనీ రాజారావు గోలపెట్టేశాడు. ఎక్కడో, ఏదో లోపం, ఆలస్యం జరిగి వుండవచ్చని తేల్చారు. ఎంత వైద్యం చేసినా, ఎన్ని మందులు వాడినా ఆమె రెండు రోజులు అవస్థపడి చనిపోయింది. నిజంగా రాజారావుకి అంతా అంధకారబంధురమైపోయింది. ఏడ్చేందుకు కూడా ఓపిక లేకుండా పోయింది.

నాన్నా! నాన్నా! అంటూ కాళ్ళకి చుట్టుకుపోతున్న రాకేందుని మాత్రం ఎత్తుకుని గుండెల

కదుముకున్నాడు. ఎవరికి చెప్పుకుంటాడు? ఏమని ఈ దుఃఖాన్ని దిగమింగుతాడు? సరిగ్గా అప్పుడే రెండేళ్ళునిండి మూడో ఏడు వచ్చింది రాకేందుకి. వాడు అమ్మకోసం ఏడ్చిన ఏడుపు నిజంగా దేవుడనేవాడు వుండి వుంటేవెంటనే నళినిని బతికించి వుండేవాడు. కానీ నళిని బతకలేదు. మరి దేవుడే లేడో వున్నా వాడికీ పసివాడి రోదనే వినిపించలేదో.

రాజారావుని వూరడించటం ఎవరితరమూ కాలేదు. అతనా క్షణంలో చంటిపిల్లాడిలా విల పించాడు అనుకోని ఈ పరిణామానికి రాఘ వేంద్రరావు మరీ కృంగిపోయాడు. వయస్సు ముదిరిన అతనికి రాకేందు మీద కూడా ఒకరకమైన భావం ఏర్పడింది. వీడొక దురదృ ష్ట జాతకుడు. కడుపులో పడగానే కన్నతండ్రిని పొట్టన బెట్టుకున్నాడు. తల్లి బతుకూ వీడివల్ల నరకప్రాయమైంది. ఇప్పుడు వాణ్ణి పెంచుకు న్న పుణ్యానికి నళిని ప్రాణాలు కోల్పోయింది.



నళినిని పోగొట్టుకున్న రాజారావు జీవచ్ఛవంలా తయారైపోయాడు. ఇన్ని అశుభాలకి మూలం ఈ కుర్రాడు అని అతను కుతకుతలాడిపోతూ ఆలోచించాడు. అందుకే ఏమైనా రాజారావుకి సలహా యివ్వాలని నిర్ణయించుకున్నాడు.

''రాజా! నా మాట విను. వాడినే అనాధశరణాలయంలోనో పడేయి, పీడాపోతుంది. ఏ ముహూర్తాన వాడినీడ మన మీద పడిందో అంతా ఏడుపే'' అన్నాడు.

రాజారావు ఆ మాటలు వినిప చలించిపోయాడు.

''తప్పు బాబాయ్! నువ్వలా మాట్లాడటం ఏం బాగోలేదు. అభం శుభం తెలియని వీడేంచేశాడు. కొన్ని విధివిలాసాలు వుంటాయి. అవి అలా జరగాల్సిందే. మనకి జరిగిన చెడుని ఎవరికో ఒకరికి అంటగట్టడం తప్పు అయినా వీణ్ణి నాకు అనుపమ యిచ్చింది. అది గుండెలు చీల్చుకుని వీణ్ణి ప్రేమించింది. వీడు అనుపమ రక్తం పంచుకుని పుట్టాడు. నేను వీణ్ణి పెంచి పెద్ద చేస్తానని అనూకి మాటయిచ్చాను. పైగా నళినికి వీడంటేఎంతో యిష్టం.''

''అదే నా బాధ. బంగారంలాంటి పిల్లని పొట్టనపెట్టుకున్నాడు'' అన్నాడు రాఘవేంద్ర రావు **ఆ**వేశంగా.

''మళ్ళీ అదేమాట వాడేం చేశాడు? దాని దురదృష్టం. నా దురదృష్టం. దానికి రాకూడని చావువచ్చింది''

''సరే నీ యిష్టం. జాగ్రత్త. నీ ఆరోగ్యం జాగ్రత్తగా చూసుకో'' అన్నాడు చివరిగా, చేసేదేంలేక.

★ ★ ★

అనుపమకి పిల్లాడి ధ్యాసే వున్నప్పటికీ అప్పుడప్పుడు రాకేందుని తలుచుకుని కళ్ళనీళ్ళు పెట్టుకుంటూ వుంటుంది.. రహస్యంగా పెట్టి అడుగునవున్న రాకేందు ఫొటోలు తీసి చూసి తృప్తి పడుతూంటుంది.

అయినా మొత్తంమీద జీవితం ప్రశాంతంగా, వేగంగా గడిచిపోతోంది. మధు కోటికి పడగలెత్తిన కోటీశ్వరుడయ్యాడు. డబ్బు పెరిగిన కొద్దీ మధుకి డబ్బు ధ్యాస, పిచ్చిమరీ పెరిగిపోతోంది. ఈ పిచ్చిని తగ్గించాలని, అతన్ని మళ్ళించాలని చాలాసార్లు అనుకుంది. కానీ ఏమీ చెయ్యలేకపోయింది అనుపమ.

★ ★ ★

ఉత్తర భారతదేశంలోని ఒక సామాన్య పట్టణానికి బదిలీ అయింది రాజారావుకి.

రాకేందుని తీసుకుని బయలుదేరి పోయాడు. కొత్తవూరు కొత్త వాతావరణం కాస్త మార్పుగా వుండేది.

ఒక వంట మనిషి పొద్దున్నేవచ్చి వంటచేసిపెట్టి వెళ్ళిపోయేది.

రాకేందుని స్కూల్లో వేశాడు. వాడు స్కూలు నించి వచ్చిరాగానే వాడి అవసరాలు చూడటానికి కూడా ఒకమనిషిని పెట్టాడు.

రాకేందు చాలా బుద్ధిగా, చాలా తెలివిగా చదువుకోవడం రాజారావుకి ఎంతోముచ్చటగా అనిపించేది.వాడు పిట్టకొంచెం కూతఘనం అన్నట్లుగా తెలివి ప్రదర్శించేవాడు. వాడి క్లాసులో వాడే ఫస్టు.

''అవునురా నాన్నా! మీ నాన్న ఎంత తెలివైన వాడు. అర్థాయుష్కుడైపోయాడుగానీ, నీ తండ్రికున్న చదువు, అందచందాలు ఎవరికున్నాయి'' అనుకునే వాడు రాజారావు.

రాహుల్ తల్లిదండ్రులైనా ఈ పిల్లాడి మీద ఆపేక్ష చూపించకపోవడం దురదృష్టం. వారు అనుపమ ముఖం కూడా మళ్ళీ చూడటానికి యిష్టపడలేదు. ఆమే తమ కొడుకు మరణానికి కారణమని పూర్తిగా నమ్మేశారు. ఇంక ఈ పసివాడి గురించి ఎవరు చెప్పగలరు?

ఈ లోకమెంత చెడ్డది. జరిగిన ఒక అన్యాయాన్ని ఒక వ్యక్తికో, ఒక స్థలానికో. ఒక వూరికో అంటగట్టి సంతృప్తి చెందుతుంది. నిజానికి అనుపమ ఏం చేసింది? అలా అంటే చాలా మంది ఒప్పుకోరు. ఆమె జాతకఫలమే రాహుల్ మరణానికి కారణం అంటారు. అని బాధిస్తారు. కనలేక తల్లి చచ్చిపోతే, పుట్టిన బిడ్డని హీనంగా చూస్తారు. నిరాదరణకి గురి చేస్తారు. అలాంటి బిడ్డ ముఖం చూస్తేనే మహాపాపం అన్నట్లు భావిస్తారు. ఇవన్నీ ఎప్పుడు మారతాయి? ఇవన్నీ మూఢనమ్మకాలని ఎంత చెప్పినా, మనముందు తలాడించి, వెనక్కి తిరిగి మళ్ళీ ఆ పాటే పాడుతారు.




రాజారావు రకరకాల ఆలోచనలతో సతమతమవుతుండేవాడు. రోజురోజుకీ రాకేంద్ పెంపకం కష్టమవసాగింది. వాడికి వేళకి అన్నం, నీళ్ళూ అమరడం గగనమవుతోంది.

రాకేంద్ పనులన్నీ తనే చేసేవాడు. అలా చెయ్యడంవల్ల రాకేందు మీద అతని ప్రేమ రెండింతలైంది. పసివాడు తండ్రిని వదిలి క్షణముండలేకపోయేవాడు.

ఎప్పుడైనా చంటివాడికి జ్వరంలాంటిది వస్తే, స్కూలు కెళ్ళలేకపోతే, కొంచెం ఎక్కువ ఇబ్బందిగా వుండేది. వాడెంత బుద్ధిగా వున్నా రాజారావుకి బాధగా వుండేది. వాణ్ణి ఒక్క క్షణంవదలడం యిష్టం వుండేది కాదు.

ఆరోజు యింటికొచ్చేసరికి రాకేందు ఏడుస్తూ గుమ్మంలో కూర్చుని వున్నాడు. రాజారావు పైప్రాణాలు పైనే పోయాయి. వాణ్ణి ఎత్తుకుని ముద్దు చేసి ఏం జరిగిందని అడిగితే విచిత్రమైన విషయం బయటపడింది.

ఇంట్లో పనిచేసే పిల్ల చేతికి దొరికిన వన్నీ తీసుకుని పోబోతుంటే, వీడికేదో అర్థమై, అడ్డుకుని

"నా కిడ్డీ బ్యాంక్ నాకిచ్చెయ్" అనేసరికి వాడి చెంపలు పేలగొట్టి, అందినంత వరకు పట్టుకుని పారిపోయింది.

పోయిన వస్తువులకంటే రేపేం చెయ్యాలి అనే ఆలోచన బాగా కలచివేసింది. అప్పుడు అతనిమిత్రులు శ్రేయోభిలాషులు అతన్ని మళ్ళీ పెళ్ళి చేసుకోమని సలహాయిచ్చారు. అతనికా సలహా నచ్చలేదు కానీ ఏం చెయ్యాలో మాత్రం తోచలేదు. రోజురోజుకీ అతనికి దినచర్య కఠినంగా మారిపోయింది. వుద్యోగానికి వెళ్ళి, వెళ్ళక శలవుపెట్టి ఎన్నాళ్ళని బండిలా గగలను అనే ఆలోచన అతని మెదడులో దొలచడంమొదలుపెట్టింది.

ఒకటే అతని వుద్దేశం. ఎలాగైనారాకేందుని పెంచిపెద్దవాణ్ణి చెయ్యాలి. వాడు అభివృద్ధిలోకి రావాలి. నళిని ఆత్మకి శాంతి కలగాలి. అనుపమకి తనిచ్చిన మాట నిలబెట్టుకోవాలి. అదీ అతని కోరిక. అలాంటి స్థితిలో [illegible] తననివెదుక్కుంటూ వచ్చి ఎదురుగా [illegible] మనిషిని చూసి కొంచెం ఆశ్చర్యపోయాడు రాజారావు. వెంటనే తన ఆశ్చర్యాన్ని దాచుకు నినవ్వుతూ.

"రండి శివశంకర్‌గారూ!" అంటూ ఆహ్వానించాడు లోపలికి.

ఆయన హుందాగా లోపలికొచ్చి కూర్చున్నాడు సోఫాలో. తెల్లని పంచీలాల్చీ వేసుకున్నాడు. జుత్తు నెరసివున్నా మనిషి నిండుగాస్వచ్ఛంగావున్నాడు.

దూరంగా ఈ ఊరు బదిలీ అయి వచ్చాక కొత్త జీవితం మొదలుపెట్టిన రాజారావుకి ఎక్కువగా ఎవరూ పరిచయస్తులు లేరనే చెప్పాలి. ఈ శివశంకర్ అనే ఆయన పే అండ్ ఎలెవెన్స్‌లో సెక్షన్ ఆఫీసరు.

రాజారావు వచ్చిన రోజునే అతనితో పరిచయం అయింది. ఆ తర్వాత ఒకటిరెండుసార్లు ఆఫీషియల్‌గా కలిశారు. కానీ ప్రత్యేకం యింటికొచ్చేంత చనువు, పరిచయం లేదు. అయినా రాజారావు చిరునవ్వుతో పలకరించి కూర్చోబెట్టాడు.

తనే లోపలికెళ్ళి ఓ కప్పులో కాఫీ కలిపి తీసుకొచ్చి శివశంకర్‌కి యిచ్చాడు.

"అరె! ఇప్పుడెందుకు శ్రమ. నేను ఓ చిన్న మాట మీ చెవిని వేసిపోదామని వచ్చాను. గానీ ఈ మర్యాద లెందుకు" అన్నాడు చనువుగా

"ఫర్లేదు... ఏమిటో చెప్పండి"అంటూ తనూ ఎదురుగా కూర్చున్నాడు.

"బాబూ వాళ్ళ తల్లిగారు???"

ఈమధ్యనే పోయింది" నెమ్మదిగా చెప్పాడు.

"అదే విన్నాను. అంతా విన్నాను. మీరు మళ్ళీ వివాహం చేసుకుంటే బాగుంటుందని చెప్దామని..."

"లేదండీ... నాకా వుద్దేశం లేదు" అన్నాడు.

"నిజమే... మీరామాటే అంటున్నారని కూడా విన్నాను. కానీ, ఈ చిన్న పిల్లాణ్ణి పెంచడం విద్యాబుద్ధుల్ని చెప్పించటం [illegible] దిక్కు లేకుండా..."

"అబ్బే! ఫరవాలేదండి. అన్నిటికీ [illegible] దేవున్నాడు.

"[illegible] దేవుడు లేడని ఎవ్వరూ అనరుగానీ,

దైనందిన జీవితంలో దేవుడే అన్నీ చేయడుగా'' అన్నాడు నవ్వుతూ. ఆయన మాట్లాడుతున్న తీరు నిర్మోహమాటంగా వుంటూనే స్నేహభావంతో వున్నట్లుగా వుందిగానీ మరోలా లేదు.

రాజారావు కూడా నవ్వివూరుకున్నాడు. నిజమే.. సమాధానం అతని దగ్గర మాత్రం ఎక్కడుంది?...

పారిపోయిన పనిమనిషి తర్వాత మరొక మనిషిని తీసుకు రమ్మని వంటామెతో చెప్పాడు. చూస్తాను బాబూ, మంచి వాళ్ళు కావాలి. ఎవర్ని పడితే వాళ్ళని యింట్లోకి రానిస్తే, ప్రమాదం బాబూ, రోజులూ బాగాలేవు'' అంటూ నీతులు చెప్పి, ధైర్యం చెప్పి తన వంటపని అరగంటలో పూర్తి చేసి,మరో అరగంటలో అన్నీ బల్లమీద అమర్చి, వంటిల్లు శుభ్రం చేసి వెళ్ళిపోయింది.

ఆమె అన్నీ రెడీగా పెడితే వంట చేస్తుంది. వంట మాత్రమే చేస్తుంది. రాకేందుకి కావలసినవి చూడదు. ఏదో జాలితో ఒకటీ అరా చేసినా, చకచక తెములుచ్చుకుని వెళ్ళిపోతుంది. పోనీ ఆమెకే ఎక్కువ జీతం యిచ్చే పద్ధతి మీద పూర్తిగా యిక్కడే వుండమని అడిగాడు. కానీ ఆమె కుదరదని చెప్పేసింది.

రాజారావు బుర్రలో ఎన్నో ఆలోచనలు. ఇంతలో శివశంకరే అన్నాడు.

''ఇంతకీ అసలు సంగతి... మా పెద్దమ్మాయి లక్ష్మి పెళ్ళికాని పిల్ల. వయసుకూడా చిన్నది కాదు. నాకు నలుగురు పిల్లలు. నా భార్యపోయే సమయానికి లక్ష్మి ఒక్కర్తే కాస్త పెద్దపిల్ల. దాని సాయంతో మిగిలిన పిల్లల్ని పెంచి పెద్ద చేశాను. కానీ వాళ్ళని పెంచిపెద్ద చేసే దృష్టిలో లక్ష్మి పెళ్ళి అలక్ష్యమైంది. నేను వుద్యోగరీత్యా వూరూరు తిరగడంవల్ల, ఆమె కోసం సంబంధాలు చూడలేకపోయాను. అదీ చక్కగా చదువుకుని బి.ఏ. ప్యాసయింది. నేనెక్కడకిబదిలీ అయితే అక్కడే ఏదో ఓ చిన్న స్కూల్లోటీచరుగా చేరి, ఇంటిపనీ, స్కూలుపనీ చేసుకునేది. క్రమంగా దాని వయసు ముప్ఫై దాటిపోవడంతో దాని పెళ్ళి నాకు సమస్యయిపోయింది. దీనికోసం మిగిలిన యిద్దరాడపిల్లల్నీ ఆపలేకవారి పెళ్ళిళ్ళు చేసేశాను. చివరివాడు మగ పిల్లవాడు.

''ఇదంతా నాకెందుకు చెప్తున్నారు?''

''అదే... మీరు ఆలోచించుకొని నెమ్మదిగా చెప్పండి. నా కూతురు లక్ష్మి మంచిపిల్ల, తల్లిలేని పిల్లల్ని అనురాగంతో చూడటం దానికి వెన్నతోపెట్టిన విద్య''

''నేను ఆలోచించుకుని చెప్తాను'' అన్నాడు రాజారావు. మరీ ముఖం మీదే నాకిష్టం లేదని చెప్పడమెందుకు అని ఆవిధంగా నెమ్మదిగా చెప్పాడు.

కాస్సేపు కూర్చుని అవీయివీ కబుర్లు చెప్పి వెళ్ళి పోయాడు శివశంకర్. ఆ వెంటనే తీవ్రమైన ఆలోచనలోపడ్డాడు. ఏమిటీదారి? ఏం చెయ్యాలి? నిజమే. ఇంటిపని ఆడవాళ్ళు చేసినట్లు మగాడు చెయ్యలేడు.

స్త్రీ అవలీలగా బయటవుద్యోగం చేసి, మళ్ళీ యింట్లో పనంతా సర్దుకుని నిర్వహించుకోగలదు కానీ మగాడు బయటెంత పనైనా చెయ్యగలడేమోగానీ, యింట్లో అరనిముషం పనిచెయ్యలేడు. అందులో పిల్లల్ని సాకడం అనేది స్త్రీలకే సాధ్యం.

మూడు రోజులు యిదే తర్జన భర్జనలతో కాలక్షేపం చేశాడు రాజారావు. పనిపిల్ల కుదరనే లేదు. రాకేంద్‌కి అన్నీ అమర్చలేక సతమతమైపోతున్నాడు. మనసులో నళిని చనిపోయిన బాధా, రాకేందుని పెంచలేని అశక్తత, వంటరితనం, ఇవన్నీ అతన్ని బాగా నీరసపెట్టాయి. ఎవ్వరేనా ఈ బాధ్యతలన్నీ ఒక్కసారిగా స్వీకరించి తనకి కాస్త విశ్రాంతినిస్తే బాగుండుననిపిస్తోంది. జీవితం మీద విరక్తి కలుగుతోంది. అప్పుడప్పుడు ఆరోగ్యం కూడా ఎదురు తిరిగి బాధిస్తోంది.

ఒక్కొక్కసారి ఏమైనా, వంటరిగా ఈ జీవితంతో పోరాడి నెగ్గాలనే పట్టుదల పెరిగిపోతోంది. అతని మానసిక స్థితి డోలాయమానంగావుంది. ఒక్కొక్కసారి చాలా బేలగా అయిపోయి నళినిని తల్చుకుని ఎంతో దుఃఖించి,

''నన్నెందుకిలా వంటరివాణ్ణి చేసి వెళ్ళిపోయావు. అదీకాక రాకేందుని నాకప్పగించావు. వాడు నా మీద మమకారంతో దరిచేరినప్పుడు నేను వాణ్ణి విదిలించలేను'' అంటూ బాధ





పడేవాడు.

★ ★ ★

''మీరీవేళ మా యింటికి కాఫీకి రావాలి'' అంటూ పిలిచిన శివశంకర్ మాటని కొట్టిపారే యలేక పోయాడు రాజారావు.

''ఈవేళేనా, ఎప్పుడు''

''ఈ వేళే... సాయంత్రం'' అన్నాడు.

రాజారావు ఒక్క క్షణం ఆలోచించి,

''సరే... నేనింటికెళ్ళి మా రాకేంద్‌ని తీసుకొస్తాను. వాడు స్కూలునించి వచ్చివెయిట్ చేస్తూ వుంటాడు'' అన్నాడు.

''ష్యూర్... ష్యూర్... మీరు యింటికెళ్ళి బాబూ మీరూ రిఫ్రెష్‌కండి. నేనొచ్చి మిమ్మల్ని పికప్ చేసుకుంటాను'' అన్నాడు శివశంకర్.

''అబ్బే ఎందుకూ నేనే వచ్చేస్తాను.

''నోనో... నా చేతిలో కారుంది. మీరు రెడీగా వుండండి. మరి నేవస్తా'' అంటూ వెళ్ళిపోయాడు. ఏవో కొత్తకొత్త విషయాలు జరిగిపోతున్న భావన అతనికెలాగోవుంది. ''జస్ట్ వాళ్ళింటికి వెళ్తే ఏమిటి?'' అని ఒక పక్కన మనసు వాదిస్తోంది.

''ఏదీ లేకుండా ఎందుకు వెళ్తున్నట్లు?'' అని అదే మనసు నిగ్గదీస్తోంది.

ఎన్నాళ్ళు తనీ ఎదురీత ఈదగలడు అంటూ ఒక్కనిముషం అనుకున్నాడు. ఇంటికి బయలుదేరాడు. ఇల్లు చేరేసరికి అప్పుడే వచ్చిన రాకేంద్ తండ్రిమెడ చుట్టూ చేతులేసి చుట్టుకుపోయాడు.

వాణ్ణి నీట్‌గా తయారుచేసేసరికి శివశంకర్ వచ్చి యిద్దర్నీ తీసుకెళ్ళాడు.

ఆ యింటి వాతావరణం ఎంతో బాగుంది. ఇల్లు శుభ్రంగా వుంది. ఇంటిముందు పూలతోట అందంగా, ముద్దుగా వుంది. ఇంట్లో వస్తువులన్నీ తళతళ మెరుస్తూ వున్నాయి.

ఏ అరమరికలు లేకుండా లక్ష్మివచ్చి వీళ్ళని ఆహ్వానించింది. ఆమెని చూసి రాజారావు ఆశ్చర్యపోయాడు. ఆమె ఎంతో అందంగా వుంది. వయసు ఎక్కువని తెలుస్తున్నా ముఖం లక్ష్మీకళతో కళకళ్లాడుతోంది మనిషి మరీ పొడుగూకాదు పొట్టీకాదు. మరీ సన్నగా లేదు. సామాన్యంగావుంది.

రాజారావు ఆశ్చర్యానికి కారణం వేరు. పెళ్ళి కాని ఆడపిల్ల అనగానే ఏదో నల్లగా కురూపిలా వుంటుందనుకున్నాడు. కానీ ఇంత చక్కని పిల్ల, పదేళ్ళక్రితం యింకా నాజూకుగా వుండి వుంటుంది. మరి???

తండ్రి చెప్పిన మాట నిజమే. కేవలం అశ్రద్ధ వల్లనే ఆమెకి పెళ్ళి కుదిరి వుండదు.

లక్ష్మి వెనకాలే ఆమె యిద్దరి చెల్లెళ్ళూ వచ్చారు. అందరూ రాజారావుకి నమస్కరించారు. శివశంకర్ అందర్నీ పేరు పేరునా పరిచయం చేశాడు. చివరి కుర్రాడు ఇంజనీరింగ్ చదువుతున్నాడు. అతనూ వచ్చాడు.

ఆ యింటి వాతావరణం ఆహ్లాదకరంగా వుంది. రాజారావు ముందు వూహించినట్లుగా లక్ష్మి మరీ సిగ్గుపడుతూ, ముభావంగా లేదు. హాయిగా ఫ్రీగా మాట్లాడుతూ వుండటంవల్ల, అతనికి సమస్యతీరింది.

అరగంటలో రాకేంద్ యింట్లో అందరితో కలిసిపోయి నుత్సాహంగా కబుర్లు చెప్పేస్తున్నాడు. వాడిలోని సంబరం చూసి రాజారావు మనసు తేలికపడింది.

వాళ్ళు బలవంతం చెయ్యడంవల్ల యిద్దరూ అక్కడే భోజనం చేసి యింటికొచ్చారు. ఆ రాత్రి పడుకోబోయేముందు రాకేందు అమాయకంగా అడిగాడు.

''నాన్నా! మళ్ళీ రేపు వాళ్ళింటికెళ్దామా'' అని.

★ ★ ★

రాజారావు సమాధానమేమి చెప్పాలో తోచక తికమకపడి ''అలాగే'' అని వూరుకున్నాడు కానీ మర్నాడు రాకేందు మర్చిపోకుండా అడిగాడు వెళ్దామా అని.

★ ★ ★

ముందరున్న డ్రాయింగ్ రూమ్‌లో గోడకి ఎన్‌లార్జి చేసిన నళిని ఫొటో అమర్చబడింది. దానికి మంచి గంధపుదండ అలంకారమైంది.

రాజారావు కొంత స్థిమితపడ్డాడు. అతనికీ కొత్త జీవితంలో కొంత శాంతి లభ్యమైంది. రాకేంద్ పూర్తిగా లక్ష్మి నీడన చేరిపోయాడు. ఆమె పిల్లాణ్ణి ఎంతో అపురూపంగా గారంగా

చూస్తోంది. ఇంట్లో అన్ని పనులు స్వయంగా శుభ్రంగా చేసుకుంటోంది. క్రమంగా రాజా రావు మానసికంగా కోలుకోసాగాడు. కొత్తలో అతనికి చాలా గిల్టీగావుండేది, భార్యపోయిన వెంటనే పెళ్ళి చేసుకున్నానే అని. కానీ అతను వున్నంతలో అదృష్టవంతుడే. అతని అభీష్టాని కి వ్యతిరేకంగా ఏమీ సర్దుకోవాల్సినవని లేదు. కారణం అతను మగాడు. అప్పుడు అతనికి అనుపమ గుర్తుకొచ్చింది. అనుపమ జీవితం ఒకరకంగా వుంటుందని తాము వూహించా ము. అది మరొకరకంగా మలుపు తిరిగింది. చివరికి ఎన్నో లింకులతో అదొకదారికి వచ్చింది. ఏమైనా తానింతవరకు అదృష్ట వంతుడే. అదే మాట పదేపదే అనుకున్నాడు.

లక్ష్మి మంచి సంస్కారవంతురాలు. రాజా రావు ఆమెతో పెళ్ళికిముందే ఒక విషయం చెప్పాడు. అది రాకేందుని జాగ్రత్తగా చూడాలి. వాడికేమీలోటు జరగడానికి వీల్లేదు అని. ఆమె అందుకంగీకరించింది.

అయిదేళ్ళు నిండేసరికి రాకేంద్ తెల్లగా, బొద్దుగా అందంగా తయారయ్యాడు. వాడలా ఆరోగ్యంగా వుండటానికి కారణం లక్ష్మి అని రాజారావుకి తెలుసు.

రాజారావు మనసులో మాట గ్రహించి, కార్య రూపమిచ్చేది లక్ష్మి.

లక్ష్మి దగ్గరవున్న ఒకే ఒక లోటు ఏమిటంటే ఆమె డబ్బు చాలా ధారాళంగా ఖర్చుపెడు తుంది. అది తనకోసమనే స్వార్థంకూడా లేదు. ఎవరికోసమైనా సరే రూపాయి ఖర్చుపెట్టాల్సిన చోట పది రూపాయలు ఖర్చుచేస్తుంది. అలా చేయడంతో ఎంతో ఆనందాన్ని అనుభవి స్తుంది.

కొత్తలో ఈ విషయం రాజారావు గ్రహించినా అతని అభిప్రాయం చెప్పలేదు. కారణమే మంటే ఆమెలో ఎన్నో మంచి లక్షణాలు వున్న మీదట పోనీలే అని వుదాసీనంగా వూరుకున్నా డు.

రాజారావుని ఒప్పించి రాకేంద్ డబ్బు లోంచి నాలుగు లక్షలు పెట్టి మంచి అపార్టు మెంటుకొనిపించింది. ఎంతో పోష్‌గావున్న ఆ యిల్లు అందరికీ నచ్చింది.

"ఎన్నాళ్ళీ అద్దెయిళ్ళు? హాయిగా వుండాలి" అంది. "రిటైరయినాక మనకంటూ ఒకటి వుండాలి" అంది.

అయితే రాకేందు డబ్బు అలా ఖర్చుపెట్టడం, రాజారావుకు యిష్టం లేదు. కానీ అసలు రాకేందు రాజారావు నళినిల బిడ్డకా డని లక్ష్మికి తెలీదు.

పండుగవస్తే రాకేందుకి చాలా ఖరీదైన బట్టలు కొనేది. వాడి పుట్టినరోజు వస్తే వాడి స్నేహితుల్ని పిలిచి కేక్ కోయించి పెద్దగా, యిల్లంతా అలంకరించి పార్టీ చేసేది. రాకేంద్ ఆనందానికి అవధులేవుండేవికావు.

వాడు క్రమంగా నళినిని మర్చేపోయాడు. అప్పుడు లక్ష్మికి నెల తప్పింది.

ఆ క్షణంలో రాజారావు గొప్ప ఆనందం అనుభవించాడు. ప్రతి మగవాడూ గర్వంగా, ఆనందంగా, గుండెలనిండా తృప్తితో ఒక విచి త్రానుభూతి పొందేక్షణమది.

తను తండ్రి కాబోతున్నాడు. నిజంగా తను తండ్రికాబోతున్నాడు. తనకి ఒక కన్నబిడ్డ రాబో తున్నాడు. ఇన్నాళ్ళూ రాకేంద్‌ని తన కన్నబిడ్డ లాగే పెంచుకున్నా ఇప్పుడు నిజంగా తన కన్నబిడ్డ తన కళ్ళముందు ప్రత్యక్షం కాబోతు న్నాడంటే అతనా ఆనందం తట్టుకోలేకపోతు న్నాడు.

అదే క్షణంలో అతనిలో ఒక భయం మొల కెత్తింది. కొత్తగా రాబోయే బిడ్డవల్ల రాకేందుని ఎవ్వరూ నిర్లక్ష్యం చేయకూడదు. అదే మాట లక్ష్మితో అంటే "ఇంకా నయం. నాకు రాకేంద్ మొదటిబిడ్డ" అంది.

ఈ కొత్త మలుపువల్ల రాజారావు జీవితంలో నూతనోత్సాహం చోటు చేసుకుంది. నలభై ఎనిమిదేళ్ళ అతనికి పదేళ్ళు వయసు తగ్గిన భావన కలిగింది.

లక్ష్మి యందు అతనికి అవ్యాజమైన ప్రేమ పొంగిపొర్లసాగింది. తన జీవితానికొక సార్థకత వచ్చిందేమో అనిపించసాగింది.

అందువల్ల యిప్పుడు లక్ష్మి ఏదంటే అదే ఫైనల్. ఆమె ఏది కావాలన్నా అది వెంటనే యింట్లో వుండాల్సిందే. సామాన్య జీతంతో ఇన్నాళ్ళూ సాధారణ జీవితం గడుపుతున్న




రాజారావు జీవన విధానంలో అంతర్లీనంగా మార్పువచ్చింది.

ధారళంగా డబ్బు ఖర్చుపెట్టడం జరుగుతోంది. ఆ ఖర్చుతో కొంత అత్యవసరాలకైనా, ఎక్కువ భాగం ఆడంబరాలకి, విలాసాలకీ మాత్రమే. ఇది కేవలం రాకేంద్ కోసం ప్రత్యేకించిన డబ్బు కావడంతో అప్పుడప్పుడు రాజారావు బాధపడుతున్నా, యిలాంటి సంతోష సమయంలో లక్ష్మికి డబ్బు గురించి, పొదుపు గురించి చెప్పి, ఆమెని నిరుత్సాహ పరచటం యిష్టం లేకపోయింది.

తరుచూ డాక్టరు దగ్గరకెళ్ళి చూపించుకొస్తూ వుంది లక్ష్మి. లేడీ డాక్టరు మందులు, సలహాలు యిచ్చింది. "సాధారణ పురుడు కాకపోతే ఆపరేషన్ అవసరం కావచ్చు" అంది.

"అదేమిటి డాక్టర్ ప్రమాదమేమీ లేదుగా" అన్నాడు రాజారావు.

"ప్రమాదమేమీ లేదుకానీ... వయసునిబట్టి ఆపరేషన్ అవసరం కావచ్చని అనుకుంటున్నా" అంది.

ధారాపాతంగా ఖర్చయి పోతున్న డబ్బు దృష్ట్యా, అసలు రాకేంద్ కథ, వాడికని వుంచిన డబ్బు వాడికే యివ్వాలని తనెందుకనుకుంటున్నదీ, లక్ష్మికి చెప్పాలని రాజారావు చాలాసార్లు అనుకున్నాడు.

కానీ సమయం చిక్కనేలేదు. అతనా విషయం చెప్పేలోగా లక్ష్మికి పురిటి రోజులే దగ్గరపడ్డాయి. డాక్టరు ముందే యిచ్చిన సూచన ప్రకారం ఆపరేషన్ చెయ్యాల్సివచ్చింది.

లక్ష్మికి ముద్దులు మూటకట్టే చక్కని ఆడపిల్ల పుట్టింది. రాజారావు ఆనందంతో వుబ్బితబ్బిబయిపోయాడు. ఆడపిల్లవల్ల ఒక రకమైన పోటీ కూడా వుండదనే తృప్తి.

ఆ ముత్యాల మూటకి నళిని అని పేరు పెట్టుకుందామని లక్ష్మి చెప్పింది. రాజారావు ఆనందంతో, లక్ష్మి సంస్కారాన్ని కొనియాడాడు.

ఎందుకో ఎన్నోసార్లు రాకేందు అసలు కథ చెప్దామనుకుని కూడా చెప్పలేదు. పెద్ద కారణం ఏమీ లేకపోయినా, ఇప్పుడా సంగతి చెప్పడంవల్ల ఒరిగేదేమీ లేదని, లక్ష్మి ఆలోచన వేరే వైపు మళ్ళించటం ఎందుకని వూరుకున్నాడు.

నళిని బొద్దుగా ముద్దులొలుకుతూ యింట్లో పెరుగుతుంటే రాజారావుకి ఎంతో సంబరంగా వుంటుంది.

రాకేందుకి చెల్లెలు నళిని అంటే ప్రాణం. వాడు ఒక్కక్షణం కూడా చెల్లాయినివదిలి వుండేవాడు కాదు.

★ ★ ★

పదేళ్ళకాలం గిర్రున తిరిగింది. రాకేందుకి పధ్నాలుగేళ్ళు నిండాయి. లక్ష్మికి పుట్టిన పిల్ల పేరు నళిని అని పెట్టుకుని ముద్దుగా చూసుకుంటున్నారు. రాకేందు చాలా తెలివిగా చదువుకుని అన్నిటిలో ఫస్టుమార్కులు తెచ్చుకుని రాజారావుకు ఎంతో ఆనందం కలిగిస్తున్నాడు. రాజారావు రిటైరైపోయాడు. ఆరోగ్యం కూడా అంతంత మాత్రంగా వుంది. ఇంటి వ్యవహారమంతా లక్ష్మీ చూసుకుంటోంది. రాబడి తగ్గిపోయింది. రాజారావుకి వచ్చే పెన్షన్‌తోనే ఇల్లు గడవాల్సివస్తోంది. పిల్లల బాధ్యతలు మొయ్యవలసిన సమయంలో కేవలం పెన్షన్‌మీద ఆధారపడవలసి రావడంతో కొంత పొదుపు తప్పనిసరైంది. రాజారావుకి వచ్చిన సెటిల్‌మెంటు డబ్బంతా ఏవో కొన్ని డిపాజిట్లలో పెట్టి, నెలసరి వచ్చేలా ఏర్పాటు చేసుకున్నారు. రాకేందుకోసం వచ్చిన డబ్బు చాలావరకు ఖర్చయిపోయింది. పిల్లవాడ్ని వున్నతమైన చదువులు చదివించాల్సిన బాధ్యత మిగిలిపోయింది.

అసలు రాకేందుకి అంత మొత్తం ఎలా వచ్చింది అని రెండు మూడుసార్లు లక్ష్మి అడిగినా, వాళ్ళ తాతగారు, అదే నళిని తండ్రి ఇచ్చారని చెప్తూ వచ్చాడు రాజారావు. ఇప్పుడు అతని మనసులో ఏదో వెలితి ఏర్పడసాగింది. లక్ష్మితో పదేళ్ళు కాపురం చేసినా, ఆమె దగ్గర రాకేందు విషయం దాచానని బాధగా వుంది. అదీకాక రేపు తనేమైనా అయిపోతే, మరో మూడోవ్యక్తి ద్వారా ఈ సత్యం తెలుసుకుని ఆమె బాధపడుతుంది. తను ఆమెని నమ్మలేదనే అనుకుంటుంది. కానీ తనెందుకు రాకేంద్ కథ చెప్పలేదూ అంటే- ఆనాటి పరిస్థితుల్లో తనింక ఎదురు దెబ్బలు తట్టుకునే స్థితిలో లేదు, అందుకని ఆ నిజాన్ని

దాచాడు. కానీ నెమ్మదిగా ఇప్పుడామెకి చెప్ప డమే మంచిదనిపిస్తోంది.

లక్ష్మిలో పెద్దమార్పేమీ లేదు. ఆమెకి రాకేందు కొడుకే అయినా, నళిని కన్నకూతురు. ఆమెకి ముద్దూముచ్చటా జరగదేమోననే బెంగ ఆమెకి మొదలైంది.

అందువల్ల ఏవిధమైన డబ్బు, నాలుగు వందలు కనిపించినా, నళినికి ఏదో ఒకటి కొని పెట్టేయడం మొదలుపెట్టింది. ఇది కొంచెం బాధాకరమైన విషయంగా పరిణమించింది. ఇదే మంచి సమయం. లక్ష్మికి అసలు నిజాన్ని చెప్పి, గట్టిగా రాకేందు బాధ్యతని అప్ప గించాలి. అనుకున్నాడు రాజారావు.

ఆరోజు రాజారావుకి ఎప్పటిదో మిగిలిపో యిన పేమెంటు ఒక అయిదువేల రూపాయ లు వచ్చాయి. ఎప్పటిలాగానే లక్ష్మి చేతిలో పెట్టాడా డబ్బు. ఆమె ఆ సాయంత్రం బంగారం కొట్టుకి వెళ్ళి, నళినికి ఒక కాసుకి సన్నటిగొలుసు. అరకాసు బుట్టలు, ఒక అరకా సు ముత్యం వేసిన వుంగరం కొని తీసుకొ చ్చింది.



అవన్నీ చూసి అవాక్కయిపోయాడు రాజారావు. మాటలు నోట్లోంచి వూడిపడలేదు. కొంతసేపు ఎలాగో కోపాన్ని, అసహనాన్ని దిగమింగుకుని,

"ఇవన్నీ ఇప్పుడెందుకు?" అన్నాడు.

"అదేమిటలా అంటారు ఒక్కగానొక్క ఆడపిల్ల, పచ్చగా దాని వంటిమీద బంగారం లేకపోతే ఏం బాగుంటుంది. ఆడపిల్లకి అప్పుడప్పుడే అమర్చాలిగాని ఒక్కసారిగా, పెళ్ళి సమయంలో కొనలేము" అంది.

అదంతా సరే... ఇప్పుడు ఎన్నో ఖర్చులున్న సమయంలో.

"అదేమిటి? ఈ అయిదువేలూ మనం వస్తాయని ఎప్పుడూ అనుకోలేదుగా, ఇవి రాకపోతే ఏంచేసేవాళ్ళమో, అదే చేద్దాం" అంది. రాజారావేం మాట్లాడలేకపోయాడు.

ఆ రాత్రి నెమ్మదిగా లక్ష్మి మనసు కష్టపెట్టుకోకుండా ఆర్థిక విషయాలు అన్నీ చర్చించి, రాకేంద్ పుట్టుపూర్వోత్తరాలు చెప్పాడు. ఆ కథ విని లక్ష్మి స్థాణువులా వుండిపోయింది. క్రమంగా రాజారావు మాటల్లోని నిజాన్ని గ్రహించి కోపంతో వూగిపోయింది.

"అంత దుర్మార్గుడ్ని ఎలా వదిలారు మీరు" అంది.

"లక్ష్మీ! అందులో దుర్మార్గం ఏముంది? వున్నదంతా, మా తెలివిలేనితనం, అనుపమ దురదృష్టం" అన్నాడు.

"ఇప్పుడు వాళ్లెక్కడ వున్నారు" అంది సాలోచనగా.

"నా దగ్గర ఎడ్రసు వుంది. పాపం అనుపమ అప్పుడప్పుడు ఉత్తరాలు రాస్తూనే వుండేది. నేనే పొడిపొడిగా రెండు మాటలతో సమాధానం రాసేవాడ్ని. అదీ సుమారు అయిదారేళ్ళుగా వుత్తరాలే లేవు.

"ఎడ్రసు నాకివ్వండి" అంది లక్ష్మి.

"ఎందుకు? ఏం చేస్తావు?"

"ఏమీ చెయ్యను. ఇవ్వండి"

"ఏమోలే. నీ కసలే ఆవేశం ఎక్కువ" అన్నాడు. కానీ ఆమెకి ఎడ్రసుతీసి ఇచ్చాడు. మనసులో అతనికి బెంగగా వుంది. ఏదిఏమైనా నిజం చెప్పాల్సివస్తే ఆధారం వుండాలిగా అనుకున్నాడు.

"మరొక్కమాట. అక్కయ్య ఒక దంతం పెట్టెలో రెండు బంగారు గొలుసులు, రెండు జతలమురుగులు, మొలకి కట్టేతాడు, పెట్టెలో పెట్టింది. నేను చాలాసార్లు చూశానుగానీ మీతో ఎప్పుడూ ఆ మాటెత్తలేదు. మీరా జ్ఞాపకాలతో బాధపడతారని, అవి రాకేందుకి వాళ్ళమ్మ ఇచ్చినవా" అంది.

"అవును"

"ఇంకా నయం. అవి మగపిల్లాడికెందుకు మన నళినికేమైనా చేయించుదాం అని అడుగుదామని ఎన్నోసార్లు అనుకున్నాను. కానీ అక్కయ్య గుర్తుకదా అని అడగలేదు" అంది లక్ష్మి.

ఆమెలోని మంచి హృదయానికి రాజారావు ఎంతో ఆనందపడ్డాడు. తన జీవితంలో వున్న కాస్త అదృష్టాల్లో లక్ష్మి ఒకటని, దేవుడికి మొక్కుకున్నాడు.

"మీరు పడుకోండి చాలా పొద్దుపోయింది" అంది లక్ష్మి.

కానీ అప్పటికే అతనికి బాగా బి.పి. పెరిగి వుంది. ఒళ్లంతా చెమటలు పట్టి ఆయాసపడటం మొదలుపెట్టాడు.

"ఏమిటీ ఏమైంది" అంటూ కంగారుపడింది లక్ష్మి.

ఏం ఫరవాలేదులే. ఏళ్ళక్రితంనాటి సంగతులు ప్రస్తావించటంతో, ఆవేశం, ఆవేదనా కలిగి, బి.పి.గా మారాయి" అన్నాడు సన్నగా నవ్వుతూ. అంతక్రితం ఒకసారలా వస్తే డాక్టరిచ్చిన టాబ్లెట్ ఇచ్చి మంచినీళ్ళిచ్చి, అతని కాళ్ళదగ్గర కూర్చుని సపర్యలు చేస్తోంది.

"లక్ష్మితో పంచుకున్న జీవితం తక్కువే. ఆమె తనకి చేస్తున్న సేవలే ఎక్కువ" అనుకున్నాడు. ఎందుకో అతని మనసు అనుపమ వైపు పోతోంది. ఎలా వుందో? ఎందరు పిల్లలు? ఆ మధు ఎలా వున్నాడు.

బాబయ్య పోయాక అక్కడ ఆస్తినంతా అమ్మేసి కలకత్తాలోనే స్థిరపడిపోయినట్లు తెలిసింది. ఈ పిల్లాడు తన దగ్గరుండిపోవడం, వీడు చచ్చిపోయినట్లు తను చెప్పడంవల్ల, అనుపమతో రాకపోకల అనుబంధాలు బల




వంతంగా తనే తెంచుకోవాల్సివచ్చింది. కానీ అనుపమ కొడుకుగా రాకేంద్ ఎంతో ఆస్తికి వారసుడయ్యేవాడు. కానీ విధి ఈవిధంగా నిర్ణయించింది. ఈరోజు రాకేందు చదువు సంధ్యల గురించి తను చాలా తీవ్రంగా ఆలోచిస్తున్నాడు. ఏదిఏమైనా లక్ష్మి మంచిది. రాకేంద్‌ని వేరుగా చూడదు. వాడి అదృష్టం, నళిని తర్వాత లక్ష్మి దొరకడం.

రాజారావు ఆలోచనలన్నీ అనుపమవైపుగా సాగుతూనే వున్నాయి.

★ ★ ★

ఆ వుత్తరం చదివి నిస్పృహగా కుర్చీ వెనక్కివాలి కళ్ళు మూసుకున్నాడు మధు. ఒక్కసారి అతనికి చీకటి అడివిలో చిక్కుకున్నట్లనిపించింది. ఎటూ దారి తోచనట్లుగా అనిపించింది. ఎటో పరుగెడుతూ పరుగెడుతూ వచ్చి అక్కడ చిక్కుకుపోయినట్లు భయం వేసింది. ఏమిటీ ఈ పరుగు? ఎక్కడికీ పరుగు?

నిరాశగా సాగుతున్న రకరకాల ఆలోచనలతో అతనికి ఎప్పుడో నిద్రపట్టింది, కుర్చీలోనే.

"మధూ, నాకోసం ఏడవకు నాయనా! నేనే మైపోయినా ఫర్వాలేదు నువ్వు సుఖంగా వుంటేచాలు"

"నాయనా మధూ! ఆ యింటిగలామెతో అస్తమానూ అలా రుసరుసగా మాట్లాడకు. తప్పు... నేను వున్నా పోయినా వాళ్ళు నీకేదైనా సాయంచేస్తారు"

"తప్పు నాయినా! గొప్ప వాళ్ళంతా చెడ్డవాళ్ళూ కాదు. పేదవాళ్ళంతా మంచివాళ్ళూ కాదు. మనసులోని చెడ్డతనాన్ని డబ్బు ప్రదర్శించనిస్తుంది. పేదరికం దాన్ని దాచిపెడుతుంది"

"నీకోసం ఊపిరిబిగపట్టి బతుకుతున్నాను కానీ ఈ మాయదారి జబ్బు నన్ను వదిలేట్టులేదు"

"తల్లి ప్రేమ నీకేం తెలుస్తుందిరా! పిల్లలు తల్లిని మర్చిపోయినా, తల్లి మాత్రం వాళ్ళ క్షేమం మర్చిపోదు. ఆ కడుపుతీపి అలాంటిది"

"అమ్మా..." మధు వులిక్కిపడి లేచాడు.

ఈ పదిహేడేళ్ళ అతని జీవితంలో తల్లి కలలోకి రావడం యిదే మొదటిసారి. ఆమె చనిపోయి, అతను కట్టుబట్టలతో అనుపమ యిల్లు చేరి కొత్త జీవితం మొదలుపెట్టాక, అతనామెని ఎన్నోసార్లు తల్చుకున్నాడు, బాధపడ్డాడు కానీ, ఆమె అతనికి నిద్రలో కనిపించి పలకరించటం, మాట్లాడటం ఎప్పుడూ జరగలేదు.

మిట్టమధ్యాహ్నం రెండు గంటలైంది. వళ్ళంతా చెమటపట్టింది. కుర్చీలో అస్తవ్యస్తంగా పడుకున్న అతని శరీరం మనసూ ఒక్కసారి గజగజా వణికిపోయాయి.

అవును... నిజమే. తనకి తల్లీ బిడ్డల ప్రేమ గురించి తెలీదు. అమ్మ తనని ఎన్నో కష్టాలుపడి పెంచింది. తనకి తిండి లేకపోయినా, వున్న కాస్తా తనకే పెట్టేది. ఇంటిగలామె ఆమెనెంత తిట్టినా భరించేది. కానీ తనని ఒక్క మాటన్నా వూరుకునేది కాదు. "ఏదో లెండమ్మ, చంటివాడూ ఏమీ తెలీదు. నేను చూస్తానుగా, వుండండి" అంటూ తనే కల్పించుకునేది.

అలాంటి తల్లిలోని మంచితనం తనకెంత వరకు వచ్చింది?

మధు శరీరం ఒక్కసారిగా కదిలిపోయింది. నెమ్మదిగా కుర్చీలోంచి లేవబోయి తూలాడు. పక్కనున్న టేబులు ఆసరాగా నిలతొక్కుకున్నాడు.

అప్పుడే మధ్యాహ్నం కాస్త నిద్రపోయి లేచింది అనుపమ. గది బయటకి వస్తూనే మధుని చూసి ఆశ్చర్యంగా "ఏమిటీ" అంటూ దగ్గరకి వెళ్ళింది.

అతని శరీరమంతా బాగా వూగుతూండటం చూసి కంగారుగా "ఏమిటీ ఏమైంది" అంటూ అతన్ని పట్టుకుంది.

అబ్బే! ఏం లేదు" అన్నాడు గానీ ఏదో తెలీని పరిస్థితి ఏర్పడిందని అతనికనిపిస్తోంది.

అనుపమ మాత్రం వెంటనే గ్రహించింది. అతన్ని నెమ్మదిగా గదిలోకి తీసుకెళ్ళి పడుకోబెట్టింది.

"మధ్యాహ్నం కాస్త విశ్రాంతి తీసుకోక ఎప్పుడూ ఏమిటో... ఎండలెలా వున్నాయి" అను

కుంటూ వెళ్ళి వాళ్ళ ఫామిలీ డాక్టర్‌కి ఫోను చేసింది.

డాక్టరు వచ్చేవరకు ఆత్రుతగా అతన్ని చూస్తూ కూర్చుంది.

మధు ఆమెని పరిశీలిస్తున్నాడు. ఆరోజు తను మొదటిసారి చూసిన అనుపమకి ఈమెకి ఎక్కువ మార్పులేకపోయినా, మార్పువుంది. రూపం ఎక్కువ మారలేదుగానీ, ప్రవర్తనలో మనస్తత్వంలో మార్పు వచ్చింది. అప్పటి బేల తనం, అప్పటి అమాయకత్వం, అప్పటి భయం యిప్పుడామెలో లేవు. అప్పుడూ, యిప్పుడూ నిశ్చలంగా ఆమె ముఖంలో చెరగ కుండా వున్నది ఆమెలోని మంచితనం.

ఆమెని చూస్తున్నకొద్దీ మధులో రకరకాల ఆలోచనలు ఊపేస్తున్నాయి. కళ్ళు మూసు కుంటే చనిపోయేప్పుడు బాధతో వికృతంగా మారిపోయిన తల్లి ముఖం గుర్తుకొస్తోంది.

డాక్టరుగారు వస్తూనే బ్లడ్‌ప్రెషర్ చూసి, ఇంజక్షన్ చేసి, టాబ్‌లెట్లు రాసిచ్చి,

''ఏమైందమ్మా! ఏదైనా గొడవపడ్డారా చాలా బి.పి. పెరిగింది.

''అబ్బే ఏం లేదే''

''పూర్తి విశ్రాంతి కావాలి''

''నేను నిద్రపోయి యిప్పుడే లేచాను డాక్ట రుగారూ, ఈయన ఏదోలా వుంటే చూశాను. చూస్తే దడదడలాడిపోతున్నారు. మీకు ఫోను చేశాను''

''మధూ! మీరు బాగా విశ్రాంతి తీసుకోండి. ఏవిషయాలు ఆలోచించకండి. రెండురోజుల్లో నార్మల్‌గా అయిపోతారు'' డాక్టర్‌గారు వెళ్ళిపో యారు.

మధు జేబు తడుముకున్నాడు. అప్పుడు గుర్తుకొచ్చింది. వుత్తరం డ్రాయరు సొరుగులో పడేసిన విషయం.

''ఏమిటీ? ఏమైనా కావాలా?'' అంది అను పమ.

''ఏం వద్దు'' అని చేత్తోసైగ చేశాడు. యిప్పు డు ఆ వుత్తరం అనుపమ చూస్తే?... చూస్తే, ఏమౌతుంది?





మళ్ళీ మధులోని ఆలోచనలు తీవ్రమ య్యాయి. డాక్టరుగారు విశ్రాంతి విశ్రాంతి అంటారు. అదెలా సాధ్యం? అనుపమ ఉత్తరం చూస్తే-చూస్తే, చూడనీ, అంతా తెలిసిపోనీ- ఏదైతే అదేకానీ,

పోనీ అనుపమతో జరిగింది చెప్పేస్తే, అవు ను చెప్పేస్తే- ఏదో ఒకటి అవనీ- తనకీ ఆందోళన తప్పుతుంది.

డాక్టరుగారి మందు పనిచేసి మధుకి నిద్ర పట్టేసింది.

★ ★ ★

''బి.పి. అంటే అదో పెద్ద జబ్బేం కాదు. సాధారణంగా అందరికీ వుండేదే'' మధు కాస్త విసురుగానే అన్నాడు.

''అవునో, కాదో నాకు తెలీదు. ఇప్పుడు మరిన్ని భారాలు మీద వేసుకుని శ్రమపడట మెందుకూ అని'' అంది అనుపమ అంత విసురుగానూ. అనుపమలో సహజంగా వయ స్సుతో వచ్చే అనుభవంవల్ల కొంతధైర్యం వచ్చింది. పూర్వం ఆమె ఏ మాట చెప్పడానికీ ఎందుకో భయపడేది. తన మనసేమిటో తనకే అర్థంకాని స్థితిలో వుండేది. తనకేం కావాలో తనే చెప్పలేని స్థితిలో వుండేది. ఇప్పుడు ఆమెలో మార్పు స్పష్టంగా కనిపిస్తోంది మధు కి. అందుకే నెమ్మదిగా-

''చూడూ! వ్యాపారమన్నాక, సమయాన్నిబ ట్టి చెయ్యాల్సినవి చాలా వుంటాయి. వాటికి మీన మేషాలు లెక్కపెడుతూ కూర్చుంటే కుద రదు'' అన్నాడు.

''సరే... మీ యిష్టం. మీ ఆరోగ్యం గురించి చెప్పాను గానీ నాకేం మధ్యలో'' అంది.

''ఇదిగో అస్తమానూ ఆరోగ్యం ఆరోగ్యం అనకు నేనేదో రోగిష్టివాడినన్నట్లు''

''సరే... మంచిది'' అనుపమ అక్కడ్నించి వెళ్ళిపోయింది.

పర్సనల్ మేనేజర్ అప్పుడే వచ్చాడు. అత న్ని ఆఫీసురూంలో కూర్చోబెట్టి నౌకరొచ్చి చెప్పా డు. మధు ఆఫీసు రూంలో అడుగుపెడు తుండగానే అతను లేచి ''ఏంటి సార్. మీ హెల్త్ యిప్పుడు బాగానే వుందా సార్'' అన్నా డు.

''నో ప్రోబ్లమ్, నేనిప్పుడు బాగానే వున్నాను.

ఏమిటి నిన్న ఫోనులో చెప్పింది"

అదే సార్ రెండు చెరువులు అదే మనవాటి కి దగ్గర్లోనే వున్నాయి. అవి అమ్మేస్తార్ట. మనం కొనేస్తే బాగుటుందనీ,

"ఎందుకమ్ముతున్నారు"

"వాళ్ళు వెళ్ళిపోతున్నారు సార్. కొడుకు అమెరికాలో సెటిల్ అయ్యాడు. పెద్దాయన ఒక్కరూ ఇవ్వన్నీ చూసుకోలేక ఆయన కూడా స్టేట్స్‌కి వెళ్ళిపోదామని"

"ఎంతవుతుంది"

"మూడున్నరదాకా"

"చవగ్గా యిచ్చేస్తారా?"

"అంటే పెద్దగా బేరాలు లేవు. వాళ్ళు కాస్త తొందర్లో వున్నారు"

"సరే కానీ... నువ్వే చూసుకోవాలి. నీ కింద మరొకళ్లని వేసుకో కావాలంటే"

"అలాగే సార్... మనకి లాభం ఖాయంగా వస్తుంది"

"నిజమే చాలా శ్రద్ధగా చూడాలి"

"ఆ భారం నామీద వేసేయండి"

"అందుకేగా, నిజానికి యింట్లో యిదంతా వద్దనే అంటున్నారు"

మేనేజరేం మాట్లాడలేదు. చిరునవ్వుతో కూర్చున్నాడు.

సరే ప్రొసీడ్. అంతా రెడీ అయ్యాక చెప్పు వస్తాను.

"సరే సర్" అతను వెళ్ళిపోయాడు.

మధు ఆఫీస్ డ్రాయరు సొరుగులోంచి చెక్‌బుక్ తీశాడు. పాతిక వేలకి చెక్కు రాసి, సంతకం పెట్టి, రెండే వాక్యాలు వుత్తరం రాసి, దానికి జతచేసి కవర్లోపెట్టి అతికించాడు. కవరుపైన ఎడ్రస్ రాస్తుంటే గాజులు శబ్దమైంది. అది న్యూస్ పేపర్ కిందకి తోసి, కళ్ళెత్తిచూశాడు. అనుపమ బయట వరండాలోంచి పూలతో టలోకి వెళ్తుంది. ఎడ్రస్ రాయడం పూర్తిచేసి, పోస్టు చెయ్యాల్సిన కవర్సులో పెట్టాడు. ఒక్క క్షణం ఆలోచించి, మళ్ళీ అది తీసేసి తన బ్రీఫ్‌కేస్‌లో లోపలగాపెట్టి బ్రీఫ్ లాక్ చేశాడు.

దొంగతనం చేస్తున్న భావం అతన్నొకక్షణం కృంగదీసింది. ఇదంతా తనది. తను కష్టపడి సంపాదించింది. తను రాత్రి పగలూ కష్టపడి శ్రమించకపోతే యింత డబ్బుకూడేదా? కాదు. అందుకే ఇదంతా తనదే, తనిష్టమొచ్చినట్లు చేసే హక్కు తనకుంది.

అవును. నిజమే కానీ,

అసలు పునాది లేనిదే పైన యిల్లుకట్టడం సాధ్యమా? అసలు పునాది అనుపమ ఆస్థి. ఆమె డబ్బు. ఆ డబ్బు మీద ఆమె తనకిచ్చిన అధికారం, స్వేచ్ఛ. పెట్టుబడిలేనిదే లాభాల ప్రశ్నలేదు. అందుకే డబ్బున్నవాడు ఆ డబ్బుతో మరింత ధనవంతుడు కాగలడు. కానీ పేదవాడు పేదవాడిగానే మిగిలిపోతాడు. పేదరికం కష్టాలకీ, కన్నీళ్ళకి పెట్టుబడి కానీ ప్రగతికీ, అభివృద్ధికీ కాదు.

మధుకి పేదరికమంటే ఏమిటో తెలుసు. ఆకలంటే ఏమిటో తెలుసు. అవమానమంటే ఏమిటో తెలుసు. పదిమంది ముందు పదిరూపాయలు కోసం చేయిచాచి భంగపడటంలో వుండే బాధ ఏమిటో తెలుసు. అందుకే ఒక్కొక్కక్షణంలో అతని మనసు మరీ పేదదై వేదన పడుతుంది. అన్నీ వున్నా ఏమీ లేనట్టుగా నిరుపేదవానిగా అతన్ని నిలేస్తుంది.

డబ్బు సంపాదించటం కోసం అతను కసిగా చేసిన ప్రయత్నాలు, కాఠిన్యంతో ప్రవర్తించిన తీరు అతనికి అప్పుడప్పుడు గుర్తుకొస్తూనే వుంటాయి.

చిన్నతనంలో అనుభవించిన, పేదరికంలోంచి పుట్టిన కసి, అతన్ని నిర్దయుడిగా చేసింది. అలాంటి సమయాల్లో అతను అనాలోచితంగా ఎన్నో తప్పువనులు చేశాడు. వాటికన్నిటికీ మూలం ఒకటే. చేజిక్కిన డబ్బు చేజారిపోకూడదు. అనుపమ తననుండి దూరమైతే ఆమె ఆస్తి తననుండి దూరమైపోతుంది. తనకి కావలసింది ప్రేమకాదు, అనురాగం కాదు. అభిమానం కాదు. డబ్బు, డబ్బు, డబ్బు. అప్పట్లో మధు ఆలోచన అలాగే కఠినంగా వుండేది. కానీ ఇప్పుడు అతని ఆలోచనలో కొద్దిగా మార్పు. వారంరోజులు పూర్తి విశ్రాంతి కోసం బెడ్‌మీద వున్నప్పుడు అనుపమ చూపించిన ఆదరణ. ఆమెకి అతనియందున్న నమ్మకం. కర్తవ్యనిర్వహణ. ఇవన్నీ అతన్ని

మరింతగా ఆలోచించేలా చేస్తున్నాయి. తనకి డబ్బు గురించి వున్న ఆలోచన ఆమెకి లేదు. ఆమె ఎంత డబ్బయినా అనాలోచితంగా ఇచ్చేస్తుంది. ఆమెకి కాంక్షలేదా? కూడాబెట్టాలనే ధ్యాస లేదా? ఈ డబ్బు చేజారిపోతుందేమోననే భయం లేదా? లేదు. నిజమే లేదు. ఆమె డబ్బులో పుట్టింది. భోగాలలో పెరిగింది. లేమి ఆమె ఎరుగదు. అందుకే ఆమె డబ్బు గురించికాక మిగిలిన విషయాలు గురించి ఆలోచిస్తుంది. పేదవారిని చూసి జాలిపడుతుంది. దానధర్మాలు చేస్తుంది. అలా చేయడం తన కర్తవ్యంగా భావిస్తుంది.

మధు ఆలోచనలు అటూ ఇటూ వూగుతూ వున్నాయి.

తను అనుపమకి ద్రోహం చేశానా? అని ఎన్నోసార్లు ప్రశ్నించుకున్నాడు. లేదు. తను ఆమెకి కొత్త జీవితాన్నిచ్చాడు. అని తనకితనే సమాధానమిచ్చుకున్నాడు.

★ ★ ★

ఆ విశాలమైన ఆవరణలోకి అడుగుపెడుతుంటే అనుపమ ఒళ్లు జలదరించింది. పరిసరాలు శుభ్రంగా వున్నాయి. కొత్తగా పాతిన మొక్కలు దూరదూరంగా ఇప్పుడిప్పుడే చిగురులు వేస్తున్నాయి. స్థలంలో పశ్చిమదిశలో ఒక బంగళా పెంకుటిల్లు వుంది. దానికి రెండువైపులా రెండు నీట్‌గా తీర్చిదిద్దిన రెల్లు పాకలు వున్నాయి. స్థలంలో ముందుగా వేదిక అమర్చబడివుంది. దానికి ముందు ఒక జంబుఖానా పరచివుంది. దానికి మరింత దూరంగా కుర్చీల వరుసలు ప్రారంభమయ్యాయి. అటూ ఇటూ ఆడవాళ్ళు హడావిడిగా తిరుగుతున్నారు.

గేటుపైన కట్టిన బ్యానర్ చదివింది అనుపమ. 'రాఘవేంద్ర శిశుశరణాలయం'.

సరిగ్గా నెల్లాళ్లక్రితం ఇలాంటి ఒక అనాథ శరణాలయం పెట్టాలని అనిత, సుస్మిత తన దగ్గర కొచ్చి ప్రస్తావన చేశారు.

అనుపమ ఆలోచనలు వెనక్కి వెనక్కి పయనించటం మొదలుపెట్టాయి.

తనలోని ఏదో అలసత్వం- ఏదో పిరికితనం తన ఈ జీవితగమనానికి కారణం. తను మనసులో ఒకటి అనుకుంటుంది. కానీ ఆ విషయం చెప్పడానికి ఏదో సంశయం వెంటాడుతుంది. ఎవరో తనని మరోవైపు లాగుతున్నట్లు, భయంతో ఇష్టంలేనివి చెబుతుంది. తీరా జరిగిపోయాక విపరీతంగా మధనపడుతుంది. తనెందుకలా వుంటుందో ఆమె ఎంత తర్కించుకున్నా తెలుసుకోలేకపోతోంది.

ఆరోజు సుస్మిత వచ్చింది. తనకిన్నాళ్లయినా పరాయి దూరప్రాంతంలో మంచి స్నేహాన్ని పంచిఇచ్చిన స్నేహితులు సుస్మిత, అనితా.

"అనూ... మూడురోజుల్నించి నిన్ను కలవడానికి రావాలని నేనూ, అనితా ప్లాన్ చేసుకుంటున్నాం. ఇప్పటికి కుదిరింది"

"మరి అనితా ఏది?" అంది అనుపమ.

"వస్తోంది. బయలుదేరింది"

"ఏమిటీ ఇద్దరికీ నామీద ఇంత కరుణ కలిగింది ఒక్కసారిగా" అంది నిష్ఠూరంగా అనుపమ.

"నీమీద కరుణేంటి మధ్యలో, శుభ్రంగా వున్నావు. కానీ అసలు మేము చెప్పబోయేది కరుణ అనే విషయం గురించే"

"అంటే"-

"ఇక్కడ ఒక అనాథ శరణాలయం నెలకొల్పాలని ఆలోచన చేస్తున్నాం. దానికి నీ సహాయసహకారాలు కావాలి"

"మీటింగ్ భాషా బాగా చెప్తున్నావుగానీ. నేనేం చెయ్యాలో చెప్పు"

"చాలా చెయ్యాలి. మనం పదిమందిమి వున్నాం. అందరం నిస్వార్థంగా ఎంతో కొంత చెయ్యాలి. అప్పుడే మన లైఫ్ సార్థకమైనట్లు అనుకోవచ్చు"

"చెప్పు"

"చెప్తాను గానీ, అతిథిమర్యాదలేమీ లేవా?" అంది సుస్మిత కొంటెగా.

"ఏం కావాలి?"

"నాకు మాత్రం ఎప్పుడైనా సరే మంచి కప్పు కాఫీ"

"ఓ.కే. ఒక్కక్షణం"

"నువ్వే చేస్తావా?"

"ఏం? నేనే చేస్తా"






"ఎవ్వరూ లేరా"

"వున్నాగానీ నా ప్రాణస్నేహితులకి కాఫీ స్వయంగా కలిపి ఇవ్వడం నాకిష్టం"

"సరేపద నేనూ వస్తా. ఈలోపు అనిత వస్తుంది"

ముగ్గురూ కాఫీలు, కబుర్లు అయ్యాక అసలు సంగతి కొచ్చారు.

అనిత గ్రాండ్‌మదర్‌కి ఈ వూరికి అయిదు మైళ్ల దూరంలో స్థలం ఒకటి ఉంది. అది అనితకిస్తూ అందులో చిన్నపిల్లలు, అదే తల్లీదండ్రీ లేని అనాధపిల్లలకి ఆశ్రమంలాంటిది కట్టించమని చెప్పారామె.

"ఓహో..."

"అంటే ఆమె అనితని పెంచుకుని చాలా ఆస్తి ఇచ్చారు. కానీ ఈ ఒక్క స్థలంలో మాత్రం ఇలాంటిది చెయ్యమని ఆమె కోరిక"

"చందాలు పోగుచేసి మిగిలిన ఏర్పాట్లు చెయ్యాలని ప్రారంభించాము"

"మరి పిల్లలు?"

"పిచ్చిదానా! ఈ దేశంలో అనాధ పిల్లలకి కరువా? కో అంటే కోటిమంది వుంటారు"

"అవున్లే-" అనుపమ మనసు ఒక్కసారి ఏదో దెబ్బతిన్నట్లు విలవిల్లాడిపోయింది. తను కడుపారా కన్నబిడ్డని అనాధలా ఎవరికో యిచ్చేసింది. తనేం తప్పుచేసి కనలేదు. పోషించుకోలేని దరిద్రురాలూకాదు. కానీ తన చిన్నారి బిడ్డని మరొకరి చేతుల్లో పెట్టింది. తన జీవితం??? వాడు అకాలమరణం చెందాడు. కనీసం బిడ్డ శవం కూడా తను చూసే అదృష్టం లేకపోయింది. అవును ఈ దేశంలో అనాధలకి కరువేమిటి?

"నువ్వేటో ఆలోచనలోపడ్డావు"

"అబ్బే... ఏదేం లేదు చెప్పు"

"నువ్వు ఏభైవేలు డొనేట్ చెయ్యాలి- ఇందులో ఒక విభాగానికి నువ్వు ఎవరి పేరు పెట్టమంటే వాళ్ల పేరు పెడదాం.

అనుపమ ఆలోచనతో వుండిపోయింది.

"మధూగారితో సంప్రదించే చెప్పు. భార్యాభర్తలు ఒకరినొకరు అడగకుండా యిలాంటి

వెలా కుదురుతాయి'' అంది అనిత.

అనుపమ వులిక్కిపడింది. నిజంగా మధుని అనుమతి అడగాల్సిన పనిలేదు. కానీ కానీ తను తెగింపుగా ఒక్కమాట ఎందుకనలేక పోయింది.

''ఫర్వాలేదు... నేనే నిర్ణయం తీసుకోగల ను'' అంది.

''వద్దులే, రేపు చెప్పు, పేరు చెప్పు''

'రాకేందు' అని చెప్దామని, 'రా' అని తర్వాత ''రాఘవేంద్ర'' అంది.

రాకేంద్ అని చెప్తే ఎవరని అడుగుతారని భయమా?

ఒకవేళ అడిగినా తన చనిపోయిన కొడుకు అని చెప్తే తప్పేమిటి?

ఆ కొడుకు తన మొదటి భర్తవల్ల కలిగా డని వీళ్ళు క్యూరియాసిటీ ప్రదర్శిస్తారా.

ఇవన్నీ అనుపమ బుర్రలో క్షణంలో గిర్రున తిరిగాయి. కానీ వెంటనే ఆమెకే అని పించింది. తననెవరూ ఏమీ అడగరు. తననెవ రూ ఎద్దేవా చెయ్యరు. తను చేయకూడనిదేం చెయ్యలేదు.

కానీ ఏముంది? అనుకున్నది ఒకటైతే చె ప్పింది మరొకటి.

''రాఘవేంద్ర అంటే మీ నాన్నగారి పేరుక దూ'' అంది అనిత.

అనుపమ తలూపింది. ఆమె వివరాలు రాసుకుంది. ఆ కుటీరంలో చల్లగావుంది. పన్నెండు గుడ్డ వుయ్యాలలున్నాయి. చిన్నచి న్న ఆట సామాన్లు కొత్త మెరుగుతో మెరుస్తు న్నాయి.

ఇక్కడ మూడేళ్ళలోపు పిల్లలనుంచాలని ఇద్దరు ఆయాలను పెట్టాం. కొంతసేపు ఆడు కున్నాక ఈ వుయ్యాలలో వేస్తే హాయిగా నిద్ర పోతారు.

''అవును'' అంది అనుపమ. ఆమె మన సులో తెల్లగా, అర్భకంగా, అయినా అందంగా వున్న రాకేంద్ మెదిలాడు. వాడిని ఏడాది పిల్లాడిగా తను వదిలేసింది. వాడూ యిలాంటి అనాథే.

''ఏమిటీ నువ్వేదో ఆలోచనలో వున్నట్లుగా వున్నావు'' అంది సుస్మిత.

''తలనొప్పిగా వుంది''

''టాబ్లెట్ తెప్పిస్తాను వేసుకో. మీటింగ్ త్వరగానే అయిపోతుందిలే''

''ఫర్వాలేదు''

''పోలీసు కమీషనర్‌గారు వచ్చి ఇనాగ్యు రేట్ చేస్తారు. ఆయన బయలుదేరినట్లు ఫోను కూడా వచ్చింది''

''ఇంకెవరు''

''సంఘమిత్రగారు''

చుట్టు పక్కలనుండి వచ్చిన సామాన్యుల కంటే ఖరీదైన కార్లలో వచ్చిన వారే ఎక్కువ. రంగురంగుల పట్టుచీరలూ, ఫ్యాషన్ చీరలు ఓ యాభైమంది వచ్చేశారు. అనుపమకి ఆశ్చ ర్యమేసింది. చెయ్యబోయే కార్యక్రమానికి వారి ఆడంబర వస్త్రధారణకీ అస్సలు పొంతన లేదు అనుకుంది.

వేదికమీద అందరూ అనుపమని పొగిడా రు. మధూ అనుపమల దాంపత్యం గురించి వేనోళ్ళ పొగిడారు. వాళ్ళిద్దరూ పార్వతీ పరమే శ్వరులని కొందరంటే, కొందరు వాళ్ళని లక్ష్మీ నారాయణులన్నారు.

వాళ్ళిద్దరూ ఒకరికోసం మరొకరు పుట్టారని మెచ్చుకున్నారు.

అనుపమకి ఇవన్నీ ఎంతో చేదుగా అని పించాయి. బాధగా వినిపించాయి. కానీ ఆమె పెదవుల మీద అందరికోసం చిరునవ్వొకటి అతికించుకుని కూర్చుంది.

తనెందుకలా అసత్యాన్ని భరించాలి అని లోలోపల మధనపడుతూ కూడా పైకి వ్యక్తపర చలేని ఒక అశక్తత ఆమె వ్యక్తిత్వ స్వభావంలో జీర్ణించుకుపోయి వుంది. ఆమెకీ అది అర్థమ వుతూనే వుంది. దాన్నించి బయటపడాలని అనుకుంటూనూ వుంది. మీటింగ్ బాగా జరి గింది. ఆశ్రమం మరుసటి రోజునుండి నడు స్తుంది. పది రోజులకైనా ఒకసారి ఒక్కొక్కరూ వెళ్ళి పర్యవేక్షించాలని నిర్ణయించుకున్నారు.

ఆ చిన్నారి ముఖాలన్నిటిలోనూ రాకేంద్ ముఖం కనిపించి అనుపమ మనసంతా కకావి కలమైపోయింది.




ఏ లోపమూ లేనట్టు పైకి కనిపించే తన బతుకంతా లోపాలమయమే అని నిట్టూర్చింది.

అనుపమ యింటికి చేరేసరికి ఆమె కొడుకు రాఘవ ఆమెకోసం ఎదురు చూస్తున్నాడు.

"ఏం నాన్నా! అన్నం తిన్నావా" అంది.

"లేదు. నువ్వు వస్తావని చూస్తున్నాను."

"నాన్నగారొచ్చారా?"

"ఆ... వచ్చారు. ఎందకో చాలా డల్‌గా వున్నారమ్మా పడుకున్నారు"

అనుపమ ఒక్కక్షణం నిలబడి ఆలోచించింది. ఆమె మనసు అప్పటికే చాలా అలసిపోయి చిరాకుగావుంది. వెంటనే వెళ్ళి మధుని పలకరించి వచ్చే ఓపిక లేకపోయింది. కానీ రాఘువ తననే పరిశీలిస్తున్నాడు. తనలోవుండే అసంతృప్తి, ఆవేదనా ఆ పసివాడు గ్రహించే అవకాశం యివ్వకూడదు. తను ఎంతో కొంత ఓపిక చేసుకుని మధుని పలకరించటం ధర్మం అనుకుని, అతను పడుకున్న గదిలోకి నడిచింది.

"ఏమిటీ? వంట్లో బాగుండలేదా?" అంది.

మధు వులిక్కిపడ్డాడు. "అబ్బే... బాగానేవున్నాను. అక్కడ కార్యక్రమం బాగా జరిగిందా"

"బాగానే జరిగింది" అంది తలొంచుకుని. ఆమెనే పరీక్షగా చూసిన మధు ఒక్క నిముషం పశ్చాత్తాపంతో కుంచించుకుపోయాడు. ఆమెకి సరిగ్గా నలభై ఏళ్ళు. నిండుగా అందంగా వుంది. ముఖంలో అప్పుడప్పుడు కనబడే విషాద చ్ఛాయలు లేకపోతే ఆమె మరింత అందంగావుంటుందేమో అనిపిస్తుంది.

తను ఎంత ప్రయత్నించినా పూర్తిగా ఆమెని సంతోషంగా వుంచలేకపోయాడు. అంటే తను ఆమెని సంతోషపెట్టడానికేం చేశాడు? పైగా ఆమెకి తీరని ద్రోహం చెయ్యలేదూ! అతని ఆలోచనలకి అతనే వులిక్కిపడ్డాడు. అదే సమయంలో అనుపమ మధుని పరిశీలించింది.

మునుపటిలా మధు బింకంగా కనిపించలేదు. ఏదో నలిగిపోయినట్లు, వడలిపోయినట్లు వుందతని ముఖం. ఒక్క క్షణం ఆమెకి అతనియందు విపరీతమైన జాలి కలిగింది. నిజంగా తన జీవితంలో మళ్ళీ సంతోషం కలగాలని తనని పెళ్ళి చేసుకున్నాడు. ఇతనికి నేనంటే యిష్టమే. కానీ నేనేం అతనికి ప్రేమ పంచగలిగాను?

"చాలా అలసిపోయినట్టుంది ముఖం. రెస్టు తీసుకో" అన్నాడు మధు.

"డాక్టర్‌కి ఫోను చెయ్యకపోయారా?"

"చేశాను... ఏం లేదు కాస్త బి.పి. ఎక్కువగా వుంది"

"భోంచేశారా"

"చేశాను... లక్ష్మి పెట్టింది"

అనుపమ తలొంచుకు వెనుతిరిగింది. అతను పనిపిల్ల అన్నం పెడితే తినేసి తన దారిన తనున్నాడు. అంటే అతనికి తన అవసరం లేదా? లేక తన స్వేచ్ఛని అరికట్టకూడదనా.

అనుపమ ఆలోచనలకి హద్దూ పద్దూ లేకుండావుంది. అవి ఒక క్రమంలేకుండా చెల్లాచెదరుగా మనసంతా ముసురుతున్నాయి.

నెమ్మదిగా తన గదిలోకి వెళ్తూ రాఘువ కోసం చూసింది. వాడు మంచం మీద బోర్లా పడుకుని నిద్రపోతున్నాడు.

అయ్యో! అన్నంతినలేదు. అనుకుంటూ రాఘువని లేపి అన్నంపెట్టే ప్రయత్నంలోపడింది.

మనసు లోలోపల అనుకుంది, తన పెట్టె అడుగున జాగ్రత్తగా దాచుకున్న రాకేంద్ ఫొటో చూడాలని. దానితో బాటుగా... అవును ఒక్కసారి చూడాలి.

★ ★ ★

ఆకాశమంతా దట్టంగా మేఘాలు కమ్ముకొని వున్నాయి. చల్లటిగాలి రివ్వుమని వుండివుండీ వీస్తోంది. వర్షం మొదలుపెట్టేందుకు అన్ని సన్నాహాలు చేసుకుంటోంది ప్రకృతి. నాలుగు దిక్కులూ ఏకం చేసిన మబ్బుల్ని చూస్తే కురవబోయే వర్షం సామాన్యమయింది కాదని ఎవరికైనా అనిపిస్తోంది.

అనుపమ ఇంటిచుట్టూ తిరిగి వర్షం వస్తే పాడయిపోయేవి చూసి నౌకరుచేత సర్దించింది. గదుల్లోకి వేగంగా జొరబడుతున్న

గాలికి క్యాలెండర్లు, ఫొటోలు, ఫ్లవర్‌పాట్సు వూగిపోతున్నాయి. గదుల కిటికీ తలుపులన్నీ జాగ్రత్తగా వేసి హాల్లోకి వచ్చి, కిటికీలోంచి బయటికి చూస్తోంది. అప్పుడే చీకటి అలుముకుని రాత్రయిపోయినట్లనిపించింది.

రాఘవ ఇంకా ఇంటికి రాలేదు. మధూ రాలేదు. మధుకి భయంలేదు. అతని చేతిలో కారుంది. కానీ రాఘవ స్కూటర్‌మీద వెళ్లాడు. అనుపమ ఆలోచనల్ని చీలుస్తూ టప్‌టప్‌మని నిమ్మకాయంత చినుకులు పడటం మొదలయ్యాయి. చినుకుల వేగం పెరగడం సెకన్లలో జరిగింది. రెండు నిమిషాల్లో వేగం పుంజుకుంది. అప్పుడే స్కూటర్ చప్పుడైంది. రాఘవ వచ్చాడు. తడిసీ తడవకుండానే అతను ఇల్లు చేరాడని తృప్తిపడింది అనుపమ.

రాఘవ వస్తూనే తల్లి చేతికి ఒకపెద్ద 'కప్పు' అందించాడు. అతని ముఖంలో విజయం సాధించిన గర్వం, చిరునవ్వు చూసి అనుపమ ఆశ్చర్యంతో, ఆనందంతో ''ఏమిటిదీ?'' అంది.

''కాలేజీ డిబేట్ కాంపిటేషన్‌లో నాకు ఫస్టు ప్రయిజ్ వచ్చింది'' అన్నాడు.

''వెరీగుడ్. ఇంత పెద్ద కప్పు వచ్చిందా?''

''కనిపిస్తోందిగా. పన్నెండు కాలేజీలమీద నేనే ఫస్టు వచ్చాను''

''మాట్లాడిన సబ్జెక్ట్ ఏమిటి?''

''స్త్రీ పునర్వివాహం, భర్త పోయిన స్త్రీ మళ్ళీ వివాహం చేసుకోవడంలో వుండే కష్టాలు, నష్టాలు''

అనుపమ ముఖం ఒక్కసారి నల్లగా మాడిపోయింది. క్షణంసేపు మాట్లాడలేకపోయింది. నెమ్మదిగా,

''నువ్వేమన్నావు? అసలు వివాహం చేసుకోవడం మంచిదా కాదా?'' అంది.

''ప్రశ్నేలేదు. చేసుకుని తీరాలి. వివాహమనేది ఒక ప్రాథమిక అవసరం. మన ఈ సమాజంలో వివాహ వ్యవస్థకున్నది మరోదానికి లేదు. పాతకాలపు భావాలతో ఇప్పటికీ కొందరు విధవా వివాహం తప్పనీ, ఇష్టంలేని భర్తని కోర్టు ద్వారా వదిలేయడం నీతిమాలిన పని అనీ, మళ్ళీ మరొకర్ని పెళ్లి చేసుకోవడం స్వార్థమనీ వాదిస్తుంటారు. అది తప్పు. భార్యపోయిన మగవాడికి మళ్లీ వివాహం చేసుకునే హక్కు ఎంతవుందో, భర్తపోయిన స్త్రీకి అంతే హక్కువుంది.

''హక్కులు సరే... అవకాశాలూ, అవగాహనలు'' అంటూ ఆగింది అనుపమ.

''దానికి సమాజంలో మార్పు రావాలి. మన సంఘంలో మనుషుల ఆలోచనా విధానంలో మార్పురావాలి''

''చాలా పెద్ద మాటలు చెప్తున్నావ్ రాఘవ్''

''మాటలు కావమ్మా- సత్యాలు, మరొక విషయం. కొందరు స్త్రీలే అదేదో పాపమని, అలా చేసుకోవడం తప్పనీ భావించి వాళ్లని వాళ్ళే హింసించుకుంటారు'' రాఘవ ఆవేశంగా అన్నాడు.

అనుపమ వులిక్కిపడింది. ఇప్పుడే రాఘవ చెప్పిన కోవలోకి తనూ వస్తుంది. తనూ మొదట్లో అలాగే భావించుకుంది. స్త్రీకి ఒక్కసారే పెళ్లి అని, జీవితానికి ఒకరే భర్త అని నమ్మింది. కానీ అదంతా తారుమారైంది.

బయట వర్షంహోరులో కారుహారన్ దూసుకొచ్చింది.

''నాన్నగారొచ్చినట్లున్నారు'' అంటూ రాఘవ అటువైపు వెళ్లాడు.

అనుపమ అతను వెళ్లినవైపే చూస్తుండిపోయింది. నిన్న మొన్నటిదాకా తన వళ్ళో కూర్చుని కాశీమజిలీ కథలు విని యక్షప్రశ్నలు వేస్తూండే రాఘవ ఎంతలోకి ఎన్నిమాటలు మాట్లాడాడు? ఎంత పెద్దతరహా వూహలు చేస్తున్నాడు?

ఆదర్శ ఉపన్యాసం చెప్పిన తన కొడుకు రేపు ఎప్పుడైనా తను రెండోపెళ్లి చేసుకున్నానని తెలిస్తే ఏమనుకుంటాడు? ఈ ఆదర్శపు అవగాహన అప్పుడు కూడా అన్వయించుకుంటాడా?

మధు లోపలికొచ్చాడు. వర్షం చాలా ఉధృతంగా కురుస్తోంది. గాలి కూడా దానికి తగు మాత్రం జోడై చెట్లని, చేనుల్నీ ఊపేస్తోంది.

''వెదర్‌ఫోర్ కాస్ట్‌లో తుఫానని చెప్పాడు విన్నావా?'' అన్నాడు మధు.

''లేదే, ఎప్పుడు?'' అంది అనుపమ.

''మధ్యాహ్నం న్యూస్‌లో చెప్పాడు''




''అవునమ్మా. డిప్రషన్ అని చెప్పాడు''

''అందుకే గాలి కూడా వుంది''

''ఇంకా పెరిగే సూచనలున్నాయ్''

ఒక్కసారి కరంట్ కట్ అయింది. అయితే వెంటనే హాల్లో, మధు గదిలో పవర్ ఇన్ వెర్టర్ ట్యూబ్‌లైట్లు వెలిగాయి. అనుపమ డైనింగ్ హాల్లో కొవ్వొత్తి వెలిగించి, దేవుడి గదిలో దీపం వెలిగించి కూర్చుంది.

ఆమె మనసు కూడా అంధకారంలో చెలరేగిన తుఫానుకి వూగిపోతున్నట్లుగా వుంది.

అసలు ఆదర్శమంటే ఏమిటి? నోటితో ఆదర్శం గురించి చెప్పడం ఎంతో సులభం. కానీ ఆచరణలోకి వచ్చేసరికి ఎన్నో అసాధ్యాలు ఎదురౌతాయి. తనను ఉద్ధరించడానికి నడుంకట్టుకున్నట్లు చెప్పిన మధు తనతోబాటు తన చిన్నారి బిడ్డని ఆదరించలేకపోయాడు. అంటే అందులో ఆదర్శమెక్కడుంది స్వార్థం తప్ప? అందుకే తను వ్యక్తిగతంగా ఈ పెళ్లి వద్దు అంది.

ఇప్పుడు రాఘవని చూస్తే తన మాతృహృదయం ఆనందంతో ఉప్పొంగుతోంది నిజమే. తను వంటరిగానే మిగిలిపోతే ఇదేవిధంగా రాకేందు తనని అన్యాయంచేసి చనిపోయి వుంటే ఈ రాఘవ కూడా తనకి వుండేవాడు కాదుగా.

★ ★ ★

బ్యాంక్ పాస్‌బుక్‌లో బ్యాలెన్స్ చూసి విసుగ్గా పుస్తకం టేబుల్‌మీద విసురుగా విసిరికొట్టాడు మధు. అందులో అతన్ని ఎక్కువ బాధిస్తున్నవి, తను పంపిన పాతికవేల రూపాయల, అనుపమ అనాధ శరణాలయానికిచ్చిన ఏభై వేల రూపాయల వివరాలే.

అతని మనసు కసితో భగభగ మండిపోయిందో క్షణం. తనిలా అనుకోని పరిస్థితుల్లో ఇరుక్కుని మధనపడతానని అతనెప్పుడూ అనుకోలేదు. అయితే ఇప్పుడు ఏది ఆలోచించాలన్నా విసుగ్గా వుంది.

ఇలా వాళ్ళు తనని ఎన్నాళ్ళు బెదిరిస్తారనేది ప్రశ్న. ఈ మానసిక క్షోభవల్ల తన ఆరోగ్యం కూడా దెబ్బతింటోంది.

ఒక్కమాట అనుపమతో చెప్పేస్తే- అమ్మో ఇంకేమైనా వుందా? ఒక్కమాటా కాదు కాదు. అది ఒక జీవితం. అది ఒకమాటలో చెప్పడం ఎవ్వరికీ సాధ్యంకాదు. ఇన్నాళ్ళూ తను జాగ్రత్తగా కాపాడుకుంటూ వచ్చిన ఈ గుంభనమైన తన మనసు ఒక్కసారి విషభాండమై బద్దలైతే తను తట్టుకోలేడు. అనుపమ తనని చీత్కరిస్తే, అది స్వీకరించలేడు, ఈ బాధని తను ఎంత కాలం తట్టుకోగలడు. ఏదో ఒక శాశ్వత పరిష్కారం ఆలోచించాలి. తను కాస్త స్థిమిపడి వెళ్లాలి. అవును వెళ్ళాలి. క్రూరమైన ఈవని మానమని అతనికి చెప్పాలి. దానికయ్యే మూల్యం ఒకేసారి చెల్లించి పారేయ్యాలి. తరుచు తనకీ రంపపుకోత తప్పాలి.

మధులో కొంత పశ్చాత్తాపం కూడా చోటుచేసుకుంది. ఒక అహంకారంతో, అవివేకంతో తను చేసిన తప్పుకి ఇప్పుడు శిక్ష అనుభవిస్తున్నాడు. పాపం కట్టికుడుపుతుంది అంటే ఇదేనా?

మధు నిశితంగా కిటికీలోంచి బయట కురిసే వర్షంవైపు చూస్తున్నాడు. సరిగ్గా వారంరోజుల క్రితం ప్రారంభమైన వర్షం అలా ఎడతెరిపిలేకుండా కురుస్తూనేవుంది. దేశంలో వాగులన్నీ పొంగి ప్రవహిస్తున్నాయి. నదులు వరదనీటితో పరవళ్ళు తొక్కుతున్నాయి. పంటకాలువలు, చెరువులు కట్టలు తెంచుకుని పారుతున్నాయి. మురికికాలువలు పొంగి వూళ్లువూళ్లు ధ్వంసం చేస్తున్నాయి. కానీ వర్షం తగ్గేసూచనలు మాత్రం కనిపించటంలేదు.

ప్రభుత్వ యంత్రాంగం రంగప్రవేశం చేసి రెండురోజులైంది. వల్లపుప్రాంతాల ప్రజలను పట్టణాలలోకి తరలించటం మొదలుపెట్టారు. స్కూళ్ళూ కాలేజీలు జనంతో నిండిపోయాయి. దామోదరనది దయాదాక్షిణ్యాలు లేకుండా దేశాన్ని ఊడ్చిపారేస్తోంది. ఎక్కడ చూసినా జననష్టమే. ప్రతీ చిన్నగుంట పెద్ద చెరువై వరవళ్లు తొక్కుతోంది.

మధు మనసు ఆందోళనగా వుంది. తన చెరువుల దగ్గర వున్న పి.ఏ. దగ్గరనుండి ఏ వార్తలూ లేవు. లక్షలు పోసిన వ్యాపారం అతనికి క్షణక్షణం భయం కలిగిస్తోంది.

కాంపోజ్ వేసుకుని నిద్రకువక్రమించాడు.

అది కలత నిద్రే అయిందిగానీ, ప్రశాంతంగా లేదు. తను నాలుగేళ్ళవయస్సులో ఒక పాకలో వుండగా పెద్ద తుఫానొచ్చింది. ఆకులన్నీ ఎగిరిపోయి వెదురుగడలు లేచిపోయి, ఇల్లంతా మొలలోతు నీరునిండిపోతే తల్లి అతన్ని భుజాన వేసుకుని హెూరున వర్షంలో ప్రవహించే నీటిలో మైలుదూరం నడిచి రామాలయంలోకి తనని చేర్చడం గుర్తుకొస్తోంది. ఆ రాత్రి తను జ్వరమొచ్చి వణికిపోతుంటే తనని గట్టిగా కౌగలించుకుని పడుకున్న అమ్మ గుర్తుకొస్తోంది. అంత మంచి అమ్మకి తను మంచి కొడుకు కాదేమో. అనిపిస్తోందతనికి.

అలా అవస్థపడి పడి అతను ఎప్పుడు నిద్రలోకి జారుకున్నాడో అతనికే తెలీదు.

మెలకువ వచ్చేసరికి బాగా పొద్దుపోయింది. నెమ్మదిగాలేచి హాల్లోకి వస్తుంటే మాటలు వినిపిస్తున్నాయి. ఆగాడు. అక్కడ కూర్చున్నది పి.ఎ. అని తెలిసి అతని గుండె దడదడలాడింది. సరిగ్గా అప్పుడే అనుపమ మాటలు వినిపించటం మొదలుపెట్టాయి.

"వెంటనే ఆయనకేం చెప్పకండి. అసలే ఆయన ఆరోగ్యం బాగాలేదు. ఇప్పుడీ వార్త ఆయనెలా తట్టుకోగలరాఅని నాకు భయంగా వుంది"

"ఎలా చెప్పకుండా వుండనమ్మా! అంతా సర్వనాశనమైపోయింది. చెరువులు అన్నీ కలిసిపోయి ప్రవహిస్తుంటే నా గుండె చెరువైపోయిందమ్మా. చేపలూ లేవు, చెరువుల నామరూపాలూలేవు" అతని గొంతు ఏడుపుతో వణికిపోతోంది.

"ఎప్పుడెప్పుడు వచ్చి యిక్కడ వాలుదామా అని బయలుదేరితే, నానా అవస్తలూ పడి యిప్పటికి రాగలిగాను"

"ఏం చేస్తాం, మన దురదృష్టం"

"దురదృష్టం అనేమాట కూడా చిన్నదేనమ్మా- అంతా అయిపోయింది, మొన్న కొన్న చెరువులకి పూర్తి డబ్బు యివ్వలేదు. వాటిమీద చాలా పెట్టుబడి పెట్టాము. అంతా గంగపాలైపోయింది తల్లీ" అతని మాటలు పూర్తవకుండానే మధు విసురుగా హాల్లోకి వచ్చాడు. వస్తూనే,

"ఏమన్నావూ? ఏమైందీ అంటూ వూగిపోయాడు. అబ్బే ఏమీ లేదులెండి మీరు ఆవేశపడకండి" అంది అనుపమ కంగారుగా లేస్తూ.

అతను మాత్రం ఆగలేదు "అంతా విన్నాను అనుపమా. అంతా విన్నాను. అంతా అయిపోయింది. అంతా అయిపోయింది. సుమారు ఏడెనిమిది లక్షలు, గంగపాలు అయ్యో! అయ్యో!

పి.ఎ. ముఖం చేతుల్లో పెట్టుకుని ఏడుస్తున్నాడు.

మధు దడదడలాడిపోతూ కుప్పకూలిపోయాడు. అతనికి హై బి.పీ. వచ్చిందని గ్రహించిందామె. అయితే మునుపటి మాదిరిగా కాక వళ్ళంతా నీళ్ళుకారిపోతూ ముద్దముద్దలా అయిపోసాగాడు.

అప్పుడ గ్రహించింది అతనేదో అయిపోతున్నాడని. పి.ఎ. కంగారుగా డ్రైవర్ని పిలిచి కారుతియ్యమన్నాడు. బయట వర్షం పడుతూనేవుంది.

★ ★ ★

మధుకి మైల్డ్ హార్ట్ఎటాక్. అతన్ని మూడు రోజులు ఇన్‌టెన్‌సివ్‌కేర్‌లో వుంచారు. అతని ప్రాణానికేం ఫరవాలేదు ప్రస్తుతం. కానీ అతను కొన్నాళ్ళుపాటు జాగ్రత్తగా వుండాలి. ఆవేశపడకూడదు. దుర్వార్తలు సడన్‌గా వినకూడదు.

అనుపమ కళ్ళు మూసుకుని కుర్చీలో వెనక్కి వాలి పడుకుంది. ఆమె ఏమాలోచిస్తోందో ఎవరూ గ్రహించలేరుగానీ, భర్త అనారోగ్యంవల్ల బెంగగా, అశాంతిగా వుందని మాత్రం అందరికీ తెలిసిన సత్యమే.

"అమ్మా"

అనుపమ కళ్ళు తెరిచేసరికి ఎదురుగా రాఘవ ఉన్నాడు.

"సుమారు వారంరోజులుగా నువ్వు సరిగ్గా అన్నం తినలేదు. నిద్రపోలేదు. నీ ఆరోగ్యంకూడా చూసుకోవాలమ్మా"

"ఏం చెయ్యను చెప్పు"

"నేను నాన్నగార్ని చూసుకుంటాను. నువ్వు ఇంటికెళ్ళి స్నానం చేసి, అన్నంతిని నిద్రపో" అన్నాడు రాఘవ. కొడుకువైపు పరిశీలనగా




చూసింది. ఈ వారంలో రాఘవ ఎంతో నలిగిపోయాడు. కానీ తన గురించి అతను ఆలోచించుకోకుండా తల్లిని గురించి ఆలోచిస్తున్నాడు. అవును మరి వాడు తన కన్నబిడ్డ.

అనుపమ లేచి బయలుదేరింది. ఆమె కారెక్కిపోబోతుంటే దూరంగా పి.ఎ. కనిపించాడు. ఆమె ఆగింది. అనుపమని చూసి అతను వేగంగా నడిచి కారు దగ్గరకొచ్చాడు.

"ఏమిటమ్మా" అన్నాడు వినయంగా.

"ఏంలేదు? మీరు కాస్సేపు యిక్కడవుండి బాబుని యింటికి పంపండి. ఓ గంటలో వచ్చేస్తాడు" అంది.

"అందుకే వచ్చానమ్మా" అన్నాడు.

"నేనొక్క నిముషం ఆగుతాను" అంటూ అక్కడే కారు ధగ్గర నిలబడిందామె.

పి.ఎ. పరుగులాంటి నడకతో వెళ్ళిపోయాడు. అతను కనుమరుగైపోయాక చక్కని ఆ హాస్పటల్ వాతావరణం పరికిస్తూ నుంచుంది. ఆవరణంతా చల్లని చెట్లతోనూ, అందమైన పూలమొక్కలతోనూ, మెత్తని లాన్లతోనూ శుభ్రంగా వుంది.

హాస్పటల్ లోపలంతా దుఃఖమే. అక్కడికొచ్చిన ఎవరి ముఖాల్లో చూసినా, ఆందోళనా, ఆవేదనా, శోకం, ఇవే. తనలాగే యిదీ అనుకుని నిట్టూర్చింది.

అది ఖరీదైన హాస్పటల్. బాగా డబ్బున్నవారికి అన్ని సౌకర్యాలున్నాయి. అందుకే మధు ఏ.సి. రూములో వున్నాడు.

రాఘవ వచ్చాడు. "ఏం? రమ్మన్నావట" అన్నాడు. "అతనుంటాడు నువ్వు కాస్త విశ్రాంతి తీసుకుని రావచ్చు" అంటూ కారెక్కింది. రాఘవకూడా మారు మాట్లాడకుండా కారెక్కాడు.

★ ★ ★

మధు హాస్పటల్నుండి యింటికొచ్చాడు. అతను మెట్లు ఎక్కకూడదని డాక్టరు చెప్పడంవల్ల అతని రూము కిందకి మార్చింది. అయితే అతని ఆఫీసు రూములో వున్న కాగితాలన్నీ పైనుండి కిందకి అనుపమే తెచ్చియిస్తోంది.

మధు చాలా నీరసపడిపోయాడు, భయపడిపోయాడు. కానీ అతనికి జైల్లో పడిపోయిన భావం కలుగుతోంది. తను అనుపమకి తెలీకుండా వుండే అనేక వ్యవహారాలు యిప్పుడు దాచిపెట్టడం కష్టమేమో అనిపిస్తోంది.

అందుకే అతను ఎక్కువ పనులకు పి.ఎ.ని నమ్ముకున్నాడు. పి.ఎ. అతనిని ఇరవైనాలుగు గంటలూ అంటిపెట్టుకునే వుంటున్నాడు.

ఆ మధ్యాహ్నం పి.ఎ.ని పిలిచి నెమ్మదిగా చెప్పాడు మధు.

"నాకొచ్చే ప్రత్యేకమైన వుత్తరాలు నాకు మాత్రం తీసుకొచ్చి యివ్వు, అమ్మగారికి వుత్తరాల గురించి చెప్పకు" అన్నాడో లేదో సరిగ్గా అదేసమయానికి అనుపమ లోపలికొచ్చింది. మధు గతుక్కుమన్నాడు. ఆమె ముఖంవైపు పరీక్షగా చూశాడు. ఆమె మామూలుగా ప్రశాంతంగా వుంది, విన్నట్లుగా లేదు అనుకున్నాడు. కానీ అనుపమ ఆ మాటలు వింది. ఆమె మనసు చివుక్కుమంది. ఆలోచనలో పడింది. పి.ఎ. ఎప్పుడూ కాస్త దూరంగా వుండి మాట్లాడేవాడు. కానీ యీరోజు మరీ దగ్గరగా అతని ముఖంలో ముఖం పెట్టి మాట్లాడుతుంటేను అనుమానం వచ్చి, శ్రద్ధగా వాళ్ళ సంభాషణ వింది. ఒక్క వాక్యం వినిపించింది. అదేమంటే అతని కొచ్చే ప్రత్యేకమైన పర్సనల్ వుత్తరాలేముంటాయి? వున్నాయా? ఆమె ఆలోచనలు బయటపడకుండా జాగ్రత్తపడి ఏదో పని వున్నట్లు బయటకెళ్ళిపోయింది. ఆరోజు నుండి అనుపమ వచ్చే అతడికి వుత్తరాలమీద ఒక నిఘావేసి వుంచింది. కానీ ఆమెకలాంటివి ఏమీ రాలేదు.

పర్సనెల్ మేనేజర్ వచ్చాడు. నష్టపరిహారంగా ఇన్సూరెన్స్నుండి రావాల్సినవి వచ్చాయి. కొత్తగా కొన్న చెరువులకి నష్టమే. ఇంకా డబ్బు పూర్తిగా చెల్లించలేదు. వాళ్ళు డబ్బుకోసం వత్తిడి చేస్తున్నారు. మళ్ళీ మధు ఆందోళనలో పడ్డాడు కానీ అనుపమ తనపేర వున్న షేర్లు కొన్ని అమ్మేసి, డబ్బు సర్దేసే ఏర్పాటుచేసింది.

వస్తుందనుకున్న లాభం రాకపోగా పెద్దఎత్తున నష్టం రావడం అతన్ని బాగా కృంగదీసింది. పైగా అతను బెడ్మీద వుండాల్సిరావ

డంతో మరీ చికాకుపడిపోవడం మొదలుపెట్టాడు.

మధు ఆలోచనలు రోజురోజుకీ వికృతంగా తయారవుతున్నాయి. తను వ్యక్తిగతంగా వెళ్ళి కొన్ని వ్యవహారాలు సర్దుకుని వద్దామనుకున్నాడు. కానీ కుదరలేదు. ఈ లోపున ఎన్నో పరిస్థితులు మారిపోయాయి. మళ్ళీ తనెప్పుడు మామూలు మనిషయి, అన్నీ చూసుకుంటాడో, తన వ్యవహారాలు తను సొంతంగా చూసుకునే రోజు ఎప్పుడొస్తుందో, ఈ చెరసాల లాంటి బతుకునుండి తనకి స్వేచ్ఛ ఎప్పుడొస్తుందో! ఈ అనారోగ్యం ఎప్పుడు బాగవుతుందో?

నెల్లాళ్ళలో మధు బాగానే కోలుకున్నాడు. తనులేచి హాయిగా యిటూ అటూ తిరుగుతున్నాడు. ఈనెల్లాళ్ళుగా అనుపమ కంట ఎలాంటి రహస్య వుత్తరాలు పడలేదు. ఆమె కూడా క్రమంగా ఆ విషయం పక్కన పెట్టేసింది.

ఏదో అని వుంటాడు. తనకి తెలియని రహస్యాలు అతనికి మాత్రం ఏముంటాయి? కేవలం బిజినెస్ విషయాలకి చెందిన లెటర్స్ అశ్రద్ధగా అటూయిటూ పారేస్తారని అలాగని వుంటాడు. పైగా అనారోగ్యంవల్ల మనసులో మాట సరిగ్గా చెప్పలేకపోయి వుంటాడు. అదీ కాక తనూ తప్పుగా వినిపించుకుని వుండవచ్చు.

అనుపమ మామూలు ధోరణిలో మసులుకోవడం మొదలుపెట్టింది. మధు మళ్ళీ ఆరోగ్యంగా కోలుకుని తిరగడం ఆమెకి తృప్తిగా వుంది. ఆనందంగావుంది. నాలుగు నెలలుగా ఏదో రకమైన కష్టాలతో బాధలతో కలతపడుతూనే వుంది. ఇప్పుడిప్పుడే మనసుకు కాస్త స్థిమితం చిక్కింది.

ఆ సాయంత్రం బయలుదేరి అనాధ శరణాలయానికి మిఠాయి కొని తీసుకెళ్ళింది. అక్కడ పిల్లలనందరినీ చూస్తుంటే మరికొంత వుత్సాహం కలిగింది. అందరికీ మిఠాయిలు వంచి యిచ్చి, వారి బుల్లిబుల్లి మాటలు విని, వాళ్ళతో కాలక్షేపం చేస్తే మనసుకి ఎంతోశాంతి, తృప్తికలిగాయి.

మధు, అనుపమ హాల్లో కూర్చుని ఏవో పిచ్చాపాటీ కబుర్లు చెప్పుకుంటున్నారు. నిజానికి ఆ సమయంలో మధు యింట్లో వుండాల్సింది కాదు. అనుకున్న ప్రోగ్రాము అకస్మాత్తుగా కాన్సిలయింది. అందుకే యింట్లో వుండిపోయాడు.

అప్పుడొచ్చాడు రాఘవ. వస్తూనే "అమ్మా! నా పరీక్షలయిపోయాయి. గ్రాడ్యుయేషన్ అయిపోయినట్లే" అన్నాడు.

"బాగా రాశావా" అన్నాడు మధు.

"అనుమానంలేదు నాన్నగారూ!"

"మరి బిజినెస్‌మేనేజ్‌మెంట్ చేస్తావా"

"వద్దండి, ఇప్పుడు చదివిన దానితో మీకు సహాయంగా వుండిపోయి, మీ పనులు చూసిపెడదామనుకుంటున్నా" అన్నాడు రాఘవ.

మధు ముఖం ఆనందంతో, తృప్తితో ఒక వెలుగు వెలిగింది. అతను కూర్చున్న సోఫాలోంచి లేచి కొడుకుని పొదివి పట్టుకున్నాడు. అతని కళ్ళల్లో సన్నటి కన్నీటి పొర కమ్మింది.

"ఫరవాలేదు రఘూ! నువ్వు పోస్టుగ్రాడ్యుయేషన్ చెయ్యి" అన్నాడు మధు. అలా చెప్పుంటే అతని గొంతు వణికింది.

ఆ యిద్దర్నీ చూసి అనుపమ ఒక్కక్షణం అచేతనంగా వుండిపోయింది. కన్న బిడ్డల మీద తల్లికీ, తండ్రికి ప్రేమ సహజం. రాఘవ తనకీ, మధుకీ కూడా బిడ్డ. అతని బిడ్డమీద అతనికున్న ప్రేమాభిమానాలు తన బిడ్డమీద తను చూపించలేకపోయింది.

"లేదు నాన్నగారూ! ఈమధ్య మీ ఆరోగ్యం అంత బాగుండలేదు. మొత్తం పనులన్నీ మీరే చూసుకోవాలంటే కష్టం కదా"

"సరే నీ యిష్టం"

"అమ్మా! నీ అభిప్రాయం ఏమిటి?" అన్నాడు

"నీ యిష్టం" అంది అనుపమ.

"మా ఫ్రెండ్సందరికీ ఓ మంచి పార్టీయిద్దామనుకుంటున్నాను" అన్నాడు రాఘవ.

"తప్పకుండా యియ్యి. ఎక్కడిస్తావు? సవేరా గానీ కృష్ణవేణిగానీ ఎక్కడైనా సరే" అన్నాడు




మధు వుత్సాహంగా.

"ఎక్కువమంది కాదు. నాకు చాలా దగ్గర ఫ్రెండ్స్ ఒక పాతికమంది వరకు వుంటారు"

"ఎంత మందైనా ఫర్వాలేదు. ఎంత ఖర్చయినా ఫర్వాలేదు"

"ఖర్చుగురించి కాదు. నేను పార్టీ మన యింట్లోనే మన గార్డెన్‌లోనే ఏర్పాటు చేద్దామనుకుంటున్నాను" అన్నాడు.

మధు ఆశ్చర్యంగా కొడుకు వైపు చూశాడు.

"ఎందుకనీ..." అన్నాడు.

"నాకెందుకో ఆ పోష్ హొటల్స్ వద్దనిపిస్తోంది. పైగా, అమ్మా, మీరూ స్వేచ్ఛగా పాల్గొనే అవకాశం వుంటుంది"

ఇద్దరి ముఖాల్లోనూ అంతుపట్టని ఆనందం వెల్లివిరిసింది. ఒక్క క్షణం యిద్దరూ ఏమీ మాట్లాడలేకపోయారు.

"ఎప్పుడు?" అంది అనుపమ.

"నా పుట్టినరోజునాడు" అన్నాడు చటుక్కున. సరిగ్గా అప్పటికి పదిహేనురోజులుంది.

"అయితే అన్ని ఏర్పాట్లు నేను స్వయంగా చేస్తాను" అంది అనుపమ.

మధు రాఘవ్ దగ్గరగా వచ్చి "నాన్న రఘూ ఇరవైమంది కాదు. వందమందైనా సరే, మన గార్డెన్‌లో అన్నీ బాగా ఏర్పాట్లు చేద్దాము. ఇల్లంతా డెకరేట్‌చేద్దాం. ఈరోజు నుంచీ నలుగురు మనుషులు అదే పనిమీద వుంటారు"

"అనుపమా, నువ్వు ఎలా చెయ్యాలో ప్లాను వేసుకో" అన్నాడు.

అనుపమ తలూపింది.

ఆరోజు మధు ఎప్పుడూ లేనంత ఆనందంగావున్నాడు. తనకి చెట్టంత కొడుకు ఎదిగి వచ్చాడు తనని ఆదరణగా చూడటానికి, ఆదుకోడానికి. తనకింక భయం ఏమీలేదు. తను నిశ్చింతగా వుండవచ్చు. ఒకటి రెండు సంవత్సరాలలో పూర్తిగా అన్ని వ్యవహారాలూ అతని కప్పగించవచ్చు.

రాఘవ మాట్లాడిన తీరు ఎంత పెద్దమనిషి తరహాగావుంది? ఎంత హుందాగా ప్రవర్తిస్తున్నాడు? ఆ వయస్సు పిల్లలు చూపించే ఆకతాయితనం, నిర్లక్ష్యం, డబ్బువుందనే దర్పం యివేమీ లేకుండా, ఎంతో బాధ్యతగా మాట్లాడాడు. ఎప్పుడూ తనంటే ఎంత ప్రేమ చూపాడు? తన ఆరోగ్యం గురించి ఎంత శ్రద్ధ?

తండ్రియందు శ్రద్ధ తల్లి యందు ప్రేమవున్న ఒక్క కొడుకువున్నా చాలు. తన జన్మ ధన్యమైనట్టే.

ఆడపిల్లకి తల్లి చాటు అవసరం. మగపిల్లాడికి తండ్రి అండదండలు అవసరం.

ఈ ఆలోచనని అనుకునే అతనికి మరో ఆలోచన వచ్చి మనసు కలుక్కుమంది. మళ్ళీ అంతలోనే సర్దుకున్నాడు.

★ ★ ★

ఆరోజు తెల్లవారి లేస్తూనే అనుపమా, మధూ ఎంతో వుత్సాహంగావున్నారు. ఆరోజు రాఘవ పుట్టినరోజు. ఆ సాయంత్రమే రాఘవ మనసుపడి ఏర్పాటు చేసుకున్న పుట్టినరోజు పార్టీ.

అనుపమ లేస్తూనే మధుకి, రాఘవకి తలంట్లు పోయించి, తనూ తలారా స్నానం చేసి గుడికి వెళ్ళడానికి సిద్ధమైంది.

ఆరోజు అనుపమ చూపిస్తున్న వుత్సాహానికి శ్రద్ధకీ మధు ఆనందపడిపోయాడు. అలాగే ఎప్పుడూ వుండిపోవాలని పదేపదే మనసులో దేవుణ్ణి వేడుకున్నాడు.

రాఘవ మాత్రం నవ్వుతూ కొట్టిపారేశాడు.

"ఏమిటమ్మా! ఈ గుళ్ళూ గోపురాలు, నాకు చాలా పనులున్నాయ్" అన్నాడు.

"కాదు నాయనా! ఏమైనా ఈ రోజు నీ పేరున అర్చన చేయిస్తానని ముందే అనుకున్నాను. ఇప్పుడు అడ్డుపెట్టకు" అంది.

"ఏమిటమ్మా, నువ్వు ముసలిదానిలా ఛాదస్తంగా తయారవుతున్నావు"

"పోనీలే... నువ్వెలా అనుకున్నా ఫర్వాలేదు. ముందు బయలుదేరు"

"రఘూ... అమ్మ చెప్పినట్లు విను. ఆమె ఏం చేసినా నీ ఆరోగ్యం కోసం, అభివృద్ధి కోసమేకదా"

"అదంతా సరే, ప్రతీదానికీ నన్నిలా బలవంతం చేస్తే ఎలా?"

"ఈరోజు నేను చెప్పినట్టు వినాల్సిందే" అంది అనుపమ.

రాఘవ గట్టిగా నవ్వేసి

"నాకసలు దైవభక్తే లేదే" అన్నాడు.

"తప్పు తప్పు అలాగనకు. దైవ కృప లేనిదే మనం బతకలేం నాయనా! మనమిలా వున్నామంటే ఆ దేవుడి దయే"

రాఘవ ఆమె మాటలు పట్టించుకున్నా లేకపోయినా, ఆ రోజు వుదయం లేస్తూనే తల్లిని కష్టపెట్టడం యిష్టంలేక బయలుదేరాడు.

ముగ్గురూ పూజ చేయించే కార్యక్రమం నిర్వహించడానికి కారులో బయలుదేరి వెళ్ళారు గుడికి.

★ ★ ★

గుడికి వెళ్ళి వచ్చేవరకు ఎప్పుడూ లేనంత వుత్సాహంగా వున్నాడు మధు. కానీ పార్టీ మరో రెండు గంటల్లో ప్రారంభమవుతుందనగా మధులో ఆందోళన ప్రారంభమయింది. అతనిలోని వుత్సాహం ఒక్కసారి చప్పగా చల్లారిపోయింది. విచిత్రమైన భయం, ఆవేదనా అతన్ని ఆక్రమించుకున్నాయి.

మధులో వచ్చిన మార్పుకి అనుపమ కొంచెం ఆశ్చర్యపోయింది. కానీ అతని ఆరోగ్యం ఏమైనా మొదటికొచ్చిందా అని కూడా భయపడింది. కానీ అతను బాగానే వున్నాడు గానీ మనసులో ఏదో కలత ఏర్పడిందని గ్రహించింది. అయితే అతన్నేమీ తరిచి తరిచి అడగాలని ఆమె కనిపించలేదు.

★ ★ ★

ఆరోజు అర్ధరాత్రి మధు యింటికొచ్చినప్పుడు అతన్ని చూసి కొంచెం జంకింది అనుపమ. ఆమెని కనీసం కన్నెత్తి చూడకుండా తన గదిలోకి వెళ్ళిపోయాడు. ఆమె నెమ్మదిగా అతన్ని అనుసరించింది. అతనా గదిలోకి అడుగు పెడుతూనే మంచం మీద వాలిపోయాడు. కనీసం బట్టలు కూడా మార్చుకోలేదు. వెంటనే నిద్రపోయాడు. ఆమె గది నలువైపులా చూస్తూ పరిశీలించింది. అతని కోటు జేబులోంచి తొంగిచూస్తూ ఒక కవరు కనిపించింది. ఎప్పుడూ లేనిది అనుపమలో విపరీతమైన వుత్కంఠ కలిగింది. నెమ్మదిగా ఆ కవరు తీసింది. లోపల ఒక కాగితంమీద రాసిన పది లైనుల వుత్తరం, చటుక్కున కింద సంతకం చూసింది. 'రాజారావు' అని చూడంగానే గుండె ఝల్లుమంది.

ఒక్కసారి అనుపమ కళ్ళు గిర్రున తిరిగాయి. ఒళ్ళు తూలిపోయింది. రాజా అన్నయ్యా మధుకి వుత్తరం రాయడమేమిటి? ఒక వేళ అన్నయ్యా రాస్తే గీస్తే తనకే రాయాలి? మొదట్నించి మధుకి, అన్నయ్యకి పెద్దగా స్నేహంగానీ, సదవగాహనగానీ లేవు. పైగా తనని మధుకిచ్చిచేశాక, మధు పెట్టిన మడత పేచీల వల్ల, రాజా అన్నయ్యా బాగా కష్టపెట్టుకున్నాడు. అతను తన జీవితంలో తిరిగిన మలుపులకి స్పందించి, చివరికి తన కొడుకుని తనే పెంచే బాధ్యత తీసుకున్నాడు. అనుపమ కళ్ళల్లో కమ్ముకొస్తున్న నీళ్ళ మధ్యలోంచి వుత్తరం చదవలేకపోయింది.

ఆ కాగితం తీసుకుని బయటకొచ్చి, కొంగుతో కళ్ళు తుడుచుకుని, వుత్తరం మొదలుపెట్టింది.

మధూ,

అర్జంట్‌గా ఓ పాతికి వేలు పంపు. చాల అవసరంలో వున్నాను, ఆలస్యం చేయవద్దు, నువ్విచ్చిన డబ్బు ఎప్పుడో అయిపోయింది. నేనా సంపాదించే స్థితిలో లేను!

రాజారావు

అనుపమ కాళ్ళకింద భూమి కంపిస్తున్నట్లుగా అనిపించింది. ఎడ్రస్ చూసింది. సందేహం లేదు. ఎప్పుడో తనకి రాజా అన్నయ్యా చాలా క్లుప్తంగా రాసిన వుత్తరాలు ఈ ఎడ్రస్ నుండే...

ఆమె గుండెల్లో ఒక రకమైన మంట బయలుదేరింది. అసలేం జరిగింది? ఏమిటీ నాటకం. వీళ్ళందరూ ఆడే చదరంగంలో తనొక పావుగా వుపయోగపడుతోందా?

రాత్రికి రాత్రి చాలా సోదాచేసి మరింత సమాచారం సంపాదించగలిగింది. ఇలాంటి వుత్తరాలు ఆరునెలలుగా వస్తున్నాయి. పిల్లాడి పుట్టిన రోజునాడు అది అందివుంటుంది. అవును, అందుకే అతని ముఖం కళావిహీనంగా





వుందా రోజు.

అనుపమ ఒక్కొక్క సంఘటనా నెమరేసుకుంటూ వాస్తవాలకి అన్వయించుకుంటూ ఆలోచిస్తోంది.

ఆమెలో కోపం గొప్ప తెగింపు తెచ్చిపెట్టింది. తను పదిహేనేళ్ల క్రితం అనుపమ కాదు. అమాయకంగా, ప్రతీ విషయాలనికీ, భయపడుతూ, లొంగిపోతూ, పిరికిగా బ్రతికిన అనుపమ కాదు. తననించి ఇంతంత సంగతులు దాచాల్సిన పనేమిటి? అసలు తన గురించేమనుకుంటున్నాడీ మధు. తను విదిపిన ఎంగిలి మెతుకుల్లోంచి ప్రాణం పోసుకున్న అర్భకుడు. తనని కట్టిపడేసి, అతని ఆధిక్యం నిలబెట్టుకోవడానికి ఎంత నాటకమైనా ఆడగలడు. వెంటనే అరికట్టాలి. అయితే తన మనసులో జరిగే సంఘర్షణ అతను కనిపెట్టకూడదు.

నాన్నపోయినప్పుడు అమ్మేసిన ఆస్తి అంతా తన పేరు మీదుగానే పెట్టాడు. నా డబ్బుమీద వ్యాపారంచేసి కోట్లు గణించాడు. తనని అనుభవించాడు. తన బిడ్డకి తండ్రి అయ్యాడు. కానీ తన మనసులోని కష్టాన్ని కనిపెట్టలేకపోయాడు. తనని మనస్ఫూర్తిగా ఆదరించలేకపోయాడు. ఈ మనుమల్ని ఇంక క్షమించకూడదు.

ఆరోజు మధు వేరే బిజినెస్‌మీద బొంబాయి బయలుదేరాడు.

ఆ మధ్యాహ్నం అనుపమ ప్లేన్ టిక్కెట్ తెప్పించుకుని రాజారావుని కలిసేందుకు అతని ఎడ్రస్ తీసుకుని బయలుదేరింది.

ఇంటినెంబరు చేతిలో వుండటంవల్ల కనుక్కోవటమేం కష్టం కాలేదు. ఆ గుమ్మంలో నిలబడి కాలింగ్ బెల్లు కొడుతుంటే కాళ్ళూ చేతులూ వణికాయి.

తను తొందరపడుతోందా? ఇది తను అనుకున్నట్లు రాజా అన్నయ్య ఇల్లేనా, కాకపోతే తనెంత అభాసు పాలవుతుంది? తను పెద్ద అవమానం ఎదుర్కోడానికి రాలేదు కదా!

క్షణంలో ఆమె తలలో కోటి ఆలోచనలు రొదచేశాయి.

ఎవరో వచ్చి తలుపు తీశారు. ఆ అపరిచిత స్త్రీని చూసి నీళ్ళుకారిపోయింది. ఏం మాట్లాడాలో తెలీలేదు. నోట్లోంచి మాటలు రాలేదు. కొంచెం సిగ్గు వేసింది. అయితే ఆ తలుపు తీసిన ఆమె.

"ఎవరు కావాలండీ" అంది మర్యాదగా.

అనుపమ అడుగుదామా వద్దా అన్నట్లుగా "రాజారావుగారిల్లు..."

"అవునండీ... లోపలికి రండీ" అందామె.

అనుపమ ఆశ్చర్యంతో లోపలికి అడుగుపెట్టి ఎదురుగా గోడకి వేలాడదీసిన నళిని ఫొటోని, దానికి నిండుగా అలంకరింపబడిన పూలదండని చూసి నిశ్చేష్టురాలైంది.

"మీరూ..." అంది.

"నేను వారి భార్యనండి"

అనుపమ ఏం మాట్లాడలేక ఏడుపు కంఠంతో-

"అన్నయ్యలేడా" అంటూ ముఖం చేతులో దాచుకుని సోఫాలో కూలబడింది.

లక్ష్మి ఒక్కనిముషం అయోమయమైపోయింది. వెంటనే తేరుకుని.

"మీరు...?"

"అనుపమ" అంది ఏడుస్తూ-

"అయ్యో మీరా- రండి-రండి. లోపలికి రండి. మీ అన్నయ్య మంచంలో వున్నారు" అంటూ అనుపమ భుజాలు పట్టుకుని లేపింది.

అనుపమ చటుక్కున వదిలించుకుని లోపలి గదిలోకి వెళ్ళి తొంగిచూసింది. ఈ అలజడికి అప్పుడే రాజారావు పిలుస్తున్నాడు "లక్ష్మీ" అని.

"అన్నయ్యా! నేను అనుపమని- ఇంకా బతికే వున్నాను" అంది.

రాజారావు వెర్రిగా ఒక చూపు చూసి చేతులు చాచాడు.

అతని దగ్గరకెళ్ళిన అనుపమ దుఃఖం ఆపుకోలేకపోయింది.

ఆమెని వాటేసుకుని, రాజారావు చంటి పిల్లాడిలా భోరున ఏడ్వడంమొదలుపెట్టాడు.

"ఎందుకేడుస్తున్నావు- మళ్ళీ బతికి నీ కంటికి కనిపించాననా, ఎందుకు? అసలు

ఎందుకు నాతో మీరంతా యిలా ఆడుకుంటున్నారు? నేను మీకు చేసిన ద్రోహమేమిటి?'' అనుపమ ఏడుస్తూనే ప్రశ్నిస్తోంది.

''కాదమ్మా! అనూ నా తల్లీ. నిన్నెప్పుడూ అన్యాయం చెయ్యాలనీ, బాధించాలని కలలో కూడా అనుకోలేదు. మేము నీ సుఖంకోసం, నీ నిండు జీవితంకోసం నిరంతరం ఆలోచించాముగానీ మరోటి లేదు. ఎప్పుడైతే నీ భర్త మరణించాడో, అంత పసివయసులో నీ బతు



కలా తెల్లారిందని కుమిలిపోయాము. అప్పట్లో మధు మన కళ్ళ ముందు వుండేవాడు కనుక నీకు, నీ బిడ్డకి ఏలోటూ వుండదనుకున్నాము'' రాజారావు యింత మాట్లాడి ఆయాసపడటం మొదలుపెట్టాడు.

''అన్నయ్యా! అంత నన్ను అభిమానించిన వాడివి. నన్నేం అర్థంచేసుకున్నావు. నా కన్నబిడ్డ జ్వరమొచ్చి మరణిస్తే, కడుపారా కుళ్ళికుళ్ళి ఏడ్చానుగానీ నిన్నొక్కమాట అనుకోలేదు. నాకెందుకింత దూరంగా వున్నావు''

అనుపమ మాటలు పూర్తికాకుండానే రాజారావు ఆమె నోరు నెమ్మదిగా మూశాడు.

''తప్పు తల్లీ, నీ కొడుకు చనిపోలేదు'' ఇంకా ఏదో అనబోతున్నాడు.

''ఆ...'' పెద్ద కేక పెట్టింది.

అప్పుడు లక్ష్మి కల్పించుకుంది.

''అవునమ్మా- నీ బిడ్డ నిక్షేపంలా వున్నాడు''

అనుపమ కొయ్యబారిపోయింది. ''అయితే నాకెందుకీ కడుపుశోకం కలిగించావన్నయ్యా'' అంది కోపంతో కదిలిపోతూ-

''అదీ నీజీవితం కోసమే, రాకేంద్ చచ్చిపోయినట్టు ఉత్తరం రాయమనీ, అలా రాయకపోతే నిన్ను వదిలేస్తాననీ బెదిరిస్తూ వుత్తరం రాశాడు మధు''

''ఎంత ద్రోహం? ఎందుకలా అడిగాట్ట''

''నువ్వు నిరంతరం పిల్లాడి ధ్యానలో వున్నావట, ఎప్పుడైనా వాడిని నీ దగ్గరకి తీసుకెళ్తే తనకి బతుకు నరకమవుతుందట''

అనుపమ ఒళ్ళు ఎరక్కుండా ఏడుస్తూ ఏవేవో మాటలు గొణుక్కుంటూ ''ఏడీ అయితే నా రాకేంద్ ఏడీ, ఇంకా నన్నేదో మభ్యపెట్టి నాతో నాటకాలు ఆడకు. నిజంగా వాడు వుంటే చూపించు'' ఆమె ఒకరకమైన పిచ్చిదానిలా సవాల్ చేస్తోంది.

''ఇదిగో రాకేంద్- ఇటురా'' అంటూ లక్ష్మి ఆ కుర్రాడిని అనుపమవైపు నడిపించింది. తెల్లగా, సన్నగా, నల్లని జుత్తుతో పెద్దపెద్ద అందమైన కళ్ళతో అచ్చం రాహుల్ నోట్లోంచి వూడిపడినట్లున్న రాకేంద్‌ని చూసి, అనుపమ నిస్సత్తువగా వాడిని కౌగలించుకుంది.

లక్ష్మి నెమ్మదిగా మొదలుపెట్టి చెప్పనారంభించింది. ''ఈ పసివాడు పోయినట్లు చెప్పకపోతే మిమ్మల్ని వదిలేసి, మీ బతుకు నవ్వులపాలుచేస్తానని, మీ అన్నయ్యని బ్లాక్‌మెయిల్ చేశాడు మధు. అందుకే నేను కావాలనే అతన్ని బ్లాక్ మెయిల్ చేశాను. డబ్బు పంపకపోతే, రాకేంద్ బతికివున్నట్లు అనుపమకి చెప్తామని. నాకు తెలుసు ఏదో ఒకరోజు ఈ రహస్యం బయటపడుతుందనీ, మీరు వెతుక్కుంటూ వస్తారనీ- కానీ యింత త్వరగా అనుకోలేదు'' అంటూ ఆగింది.

అనుపమ నీరసంగా వాలిపోయింది. ఆమెకి మంచినీళ్ళు తాగించి, కాసిన వేడిపాలు తాగించి కూర్చోబెట్టింది లక్ష్మి.

''అన్నయ్యా! వదిన చచ్చిపోతే కూడా నాకు చెప్పలేదు. నీవెంత దుర్మార్గుడవు'' అంది నీరసంగా.

''అవునమ్మా! చెప్తే, నువ్వు పరుగెట్టుకొస్తావు. ఈ పిల్లాడు బతికే వున్నాడని తెలుస్తుంది''

''అవును... అన్నీ మీ యిష్టప్రకారం, మీ అనుకూలం ప్రకారం చేసుకున్నారు. నాకంటూ ఒక మనసు, ఒక యిష్టం వుంటుందని మీకనిపించలేదు కదూ'' అంది.

''అనిపించిందమ్మా! కానీ అప్పటికే ఆలస్యమైపోయింది''

రెండు గంటలు అనుపమ ఏదేదో మాట్లాడింది. ఆమె రాకేంద్‌ని ఒక్కక్షణం వదలలేదు. చిన్న నళినిని చూసి, ముద్దుచేసింది. వాళ్ళ వదిన్ని తల్చుకుని ఎంతో దుఃఖించింది. వుండుండీ రాకేంద్‌కేసి చూసి, ఇది నిజమేనా- కలా అని కలవరపడింది, తన బిడ్డని జాగ్రత్తగా చూసినందుకు లక్ష్మికి కన్నీళ్ళతో కృతజ్ఞతలు చెప్పింది.

కొంత స్థిమితపడ్డాక, చాలా సీరియస్‌గా అయిపోయింది. రాజారావువైపు తీక్షణంగా చూసి,

''అన్నయ్యా! నేనొక్కమాట అడుగుతాను

సమాధానం చెప్పు. నాకు పెళ్ళయింది. భర్త ప్రమాదంలో మరణించాడు. నేను మళ్ళీ పెళ్ళి చేసుకుంటే, నా భర్తని తలుచుకోకూడదు. అతని జ్ఞాపకచిహ్నాలేవీ నా దగ్గర వుండకూడదు. నాకు అతనివల్ల కలిగిన బిడ్డని నేను పెంచుకోకూడదు. ఆ పసికందుని ఎక్కడో, ఎవరికో యిచ్చేయ్యాలి. లేకపోతే చంపెయాలి. ఏం? ఎందుకని

అదే నీ భార్యపోయి నువ్వు పెళ్ళిచేసుకున్నావు. నీ మొదటి భార్య ఫోటో ముందుగదిలో గోడకి తగిలించి, పూలదండ వేశావు. నీ కన్నబిడ్డ కాకపోయినా, వాడిని పెంచి పెద్దచేసే బాధ్యత ధైర్యంగా నీ రెండోభార్యకి అప్పగించగలిగావు ఏం? ఎందుకని? ఎందుకని ఈ వ్యత్యాసం, ఎందుకీ స్త్రీ పురుష భేదం, నీలాంటి బాధ్యత కాదా నాది? నీలాంటి మనసు కాదా నాది? నీలాంటి మమత లేదా నాకు? నీ హక్కులు వేరు నా హక్కులు వేరా? ఏం నాకు ఆర్థిక స్వాతంత్య్రం వున్నా సామాజికంగా స్త్రీనెందుకలా అణగద్రొక్కాలి? ఆమెకి ఏ స్వేచ్ఛా లేకుండా ఎందుకు చెయ్యాలి? నువ్వు ఎందుకు దాచాలి? నీ మొదటి భార్య బిడ్డల్ని నీ భార్య భరించగలుగుతోంది? ఏం? నా రాకేంద్‌ని మధు ఎందుకు భరించలేకపోవాలి? ఆ భరించలేకపోవడం అందరూ ఎందుకు సమర్థించాలి? అదే న్యాయమనీ, సహజమనీ ఎందుకు అతనివైపు మాట్లాడాలి?''

ఇల్లంతా నిశ్శబ్దంగా వుంది. అనుపమ గొంతు ఖంగుమని మోగుతోంది. రాజారావు దగ్గర ఈ ప్రశ్నల వేటికీ సమాధానం లేదు. లక్ష్మి నిశ్శబ్దంగా కళ్ళనీళ్ళు పెట్టుకుని కూర్చుంది.

అప్పుడు ఒక్క వుదుటున లేచింది- అదే కంఠస్వరంతో చెప్పింది.

''చూడు... ఇప్పుడు చూడు... నేనేమిటో- నా శక్తి ఏమిటో చూపిస్తాను. మీరందరూ ఏం చేస్తే అది చేసి, సర్వం కోల్పోయి, జీవచ్ఛవంలా బ్రతికాను. దానికి కారణం నాలో మెతకతనం. నా ఆలోచనా పరిధి సంకుచితం కావడం,

అయితే ఇప్పుడలా లేను. ఇప్పుడు నేను వేరు. ఆనాటి అబలకాదు ఈనాటి అనుపమ.

నా హక్కుకోసం ధైర్యంగా నిలబడతాను. నా కొడుకుని నా దగ్గర పెట్టుకుని ధైర్యంగా పెంచుకుంటాను. రాకేంద్, రాఘవ్ ఇద్దరూ నాకు రెండు ప్రాణాలు, మరి నే వస్తాను'' అంటూ లేచింది.

లక్ష్మి బిత్తరపోయింది.

''నాన్నా రాకేంద్ నిన్ను కన్నతల్లి ఈమె. ఇన్నాళ్ళూ యిక్కడ వున్నావు, కారణాంతరాల వల్ల ఇప్పుడు అమ్మ రమ్మంటోంది వెళ్ళు'' అంది లక్ష్మి.

అప్పటికే రాకేంద్‌కి చాలావరకు అర్థమైంది. వాడిలో తల్లిమీద ప్రేమ పొంగిపొర్లలేదు. కానీ అనుపమని చూస్తే జాలివేసింది. అయినా వాడి దృష్టిలో తల్లి లక్ష్మి మాత్రమే.

''అమ్మా! ఆమెకి మెల్లగా వస్తాను అని చెప్పు'' అన్నాడు నెమ్మదిగా.

అనుపమ ఖిన్నురాలైంది. అంతలోనే సర్దుకుంది. ఇన్నేళ్ళు అల్లారుముద్దుగా పెంచారు మీరు. రెండు గంటల్లో అభిమానం కలిగి, ప్రేమ కలిగి నాతో రమ్మనడం అన్యాయమే కానీ, రాకేంద్, నేను నీ కన్నతల్లిని. నేను సలపబోయే రేపటి పోరాటంలో నువ్వు నా పక్కన వుండాలి. ఆ రెండు రోజుల తర్వాత నిన్ను పంపేస్తాను. కావాలంటే నీ యిష్టప్రకారమే చదువుకుందుగాని యిక్కడ'' అంది.

''నేను వస్తానమ్మా''. అన్నాడు రాకేంద్ చటుక్కున.

అనుపమ పొంగిపోయింది. వాడిని గాఢంగా కౌగలించుకుని ముద్దుపెట్టుకుని ''ఈ అమ్మని ఎప్పుడూ క్షమించు నాన్నా'' అంది.

''అనూ! నువ్వేం చేస్తావు ఇప్పుడు'' అన్నాడు రాజారావు.

''నా చేతిలో చట్టం వుంటే అతనికి వురిశిక్షే వేసేదాన్ని'' అంది.

''తప్పమ్మా! ఈ లోకంలో క్షమ కంటే గొప్పది మరోటిలేదు''

''అవును... దానినే చేతకానితనం అంటే ఇంకా బాగుంటుంది''

''కాలం కలిసి రాకపోతే తాడు పామై కరుస్తుంది''





ఆ మాటలు వెనుక నుండి వినిపించాయి.

అనుపమ వెనక్కి తిరిగింది. చూస్తూనే-

"యాదగిరీ" అంటూ కేక పెట్టింది.

"మరేనమ్మా నేనొచ్చి పదిరోజులైంది. అయ్యగారు లేవడం లేదని వచ్చాను" అన్నాడు తలొంచుకుని,

"నీకైనా నేను గుర్తురాలేదా" అంది దీనంగా.

"అసలు మర్చిపోతే కదమ్మా గుర్తురావడం"

"అందుకే ఇంతదూరంగా వున్నారంతా"

"దేనికైనా కాలం కలిసిరావాలి"

"సర్లే... ఇప్పుడెలా కాలం కలసివస్తుందో చూద్దురుగానీ..."

"ఇప్పుడేం గొడవ పెట్టుకోకమ్మా" అంది లక్ష్మి.

"నేను ప్రేమించని వ్యక్తితో కలిసి ఇన్నాళ్ళూ జీవించాను. కానీ, నాకింత ద్రోహంచేసిన వ్యక్తితో ఇకముందు సహజీవనం చెయ్యను"

ఆ సాయంత్రం ఆమెతోపాటు యాదగిరి కూడా ప్రయాణమయ్యాడు.



అనుపమ ఇంట్లో అడుగుపెడుతుండగానే రాఘవ్ ఎదురొచ్చాడు. అతను కనిపించగానే ఆ మాతృహృదయం ద్రవించిపోయింది.

స్త్రీ ఎవరివల్ల బిడ్డని కన్నప్పటికీ, ఆ పురుషుడిని ఎంత ద్వేషించినప్పటికీ, బిడ్డని మాత్రం ప్రేమిస్తుందేగానీ ద్వేషించదు.

అనుపమ పరుగున వెళ్ళి రాఘవ్‌ను కౌగలించుకుంది.

"అమ్మా! చెప్పకుండా హఠాత్తుగా ఎక్కడికెళ్ళావ్" అన్నాడు. వాడికి సమాధానం చెప్పకుండా దీనంగా, దూరంగా వున్న రాకేంద్‌ని గమనించి అనుపమ ఇద్దర్నీ ఒకచోటకి చేర్చింది.

"నా బంగారు తండ్రీ రాఘవ్! ఇదిగో నీ అన్నయ్య రాకేంద్. ఈరోజునుండీ మీరిద్దరూ ఒక్కప్రాణంగా వుండాలి" అంది.

"ఇదిగో నా వజ్రాలమూట రాకేంద్- నా వెన్నెల తండ్రీ వీడు నీకు తమ్ముడు. వీడిని జాగ్రత్తగా నువ్వే చూసుకోవాలి" అంది.

ఇద్దరూ ఒకరివైపు మరొకరు ఆప్యాయంగా ప్రేమగా స్నేహంగా చూస్తూ చేతులు కలిపారు.

అనుపమ లోపలికెళ్ళి- తను ఎప్పుడో ఈ వూరు వచ్చేటప్పుడు కూడా తెచ్చుకున్న ట్రంకుపెట్టె పైనుండి దింపింది. అందులో అట్టడుగున, తన పెళ్ళినాటి పట్టుచీరకి జాగ్రత్తగా చుట్టిపెట్టిన రాహుల్ ఫొటో తీసింది. అది ఆనాటినుండి, ఈనాటివరకు అలా చక్కని చిరునవ్వుతో కలకలలాడుతూనే వుంది. ఒక్కసారి ఆమె గుండెలు గుబగుబలాడాయి. ఎప్పటిదో ఏదో ఒక మధురానుభూతి గుండె లోతుల్లోంచి చిన్న అలలా కదిలింది.

ఆమె ఫొటోని గుండెల కదుముకుంది. తలపైకెత్తి కళ్ళు మూసుకుంది. ఆ కళ్ళలో వూరిన కన్నీళ్ళు రెండు బొట్లు రాలాయి.

ఆమె ఆ ఫొటోని మళ్ళీ తనకొంగుతో తుడిచింది. మరల మరల ప్రేమగా తుడిచింది.

కొన్ని హృదయాలు అనురాగంతో ముడిపడుతాయి. అది ఒకక్షణంలోనైనా, ఒక్కరోజులోనైనా అది శాశ్వతంగా వుండిపోతుంది. కొన్ని హృదయాలు ఎన్నాళ్ళు కలిసి జీవించినా కలవవు. ఆ హృదయస్పందనకి ఏ తర్కమూలేదు. ఇది ఎందుకిలా అని ఎవ్వరూ అడగడానికి వీల్లేదు. అది అంతే!

ఆమె ఆ ఫొటోని ముందువున్న విశాలమైన హాల్లో గోడకి అలంకరించింది. దానికి పూలదండ వేసింది. అలా వేస్తున్నప్పుడు ఏదో ఆనందం దుఃఖం కలిసి ఒక కలవరం ఏర్పడిందామె మనసులో, కానీ ఏదో స్వాతంత్ర్యం

పొందిన భావన. తను ఈరోజే స్వేచ్ఛగా కదలాడుతున్నట్లు, ఊపిరి పీలుస్తున్నట్లు అనుభూతి కలుగుతోంది.

ఇంక నేనెవ్వరికిందా బానిసను కాదు. ఏదైనా నా ఇష్టం వచ్చినట్లు, నాకు నచ్చినట్లు చేస్తాను. అంతే, ఈ సంఘం, ఈ సమాజం, ఈ కట్టుబాట్లు ఇవన్నీ తనని సుఖపెట్టడానికైతే అనుసరిస్తుంది కానీ దేనికోసమో తను ముసుగులో మాత్రం బతకదింక.

అనుపమ తీవ్రంగా ఆలోచిస్తూ అటూయిటూ తిరుగుతోంది.

సరిగ్గా అప్పుడే మధు ఇంట్లో అడుగుపెట్టాడు. అతన్ని చూడగానే అనుపమ ఆడపులిలా గైపోయింది. తననుతాను మర్చిపోయింది ఆవేశం, కోపం, క్రోధం ఆమెని చుట్టుముట్టాయి.

''ఆగు! అక్కడే ఆగు'' అంటూ అరిచింది. ఆ కేక విని మధు వులిక్కిపడి ఆగాడు. లోపలెక్కడో వున్న యాదగిరి హాల్లోకి చూశాడు.

ఈరోజుతో నీకూ నాకూ బంధం తీరింది. నిన్ను గౌరవించి, నీ అవసరాలు తీర్చి, నీ కాళ్లకింద చెప్పులా పడివుండిన రోజులు పోయాయి. దుర్మార్గుడా! బతికున్న నా కన్నబిడ్డను చనిపోయాడని చెప్పి, నాకు గర్భశోకాన్ని కలిగించి నువ్వేదో నానుంచి పొందాలనుకున్నావు. కానీ నా భర్తని, నా బిడ్డని నేనెప్పుడూ మర్చిపోలేదు. ఇదిగో చూడు! ఇకముందులా నేను పిరికివందను కాను. నేనేం తప్పు చేయలేదు. అందుకే అదిగో నా భర్త అదే మొదటి భర్త ఫొటో గోడకి తగిలించాను. ఇదిగో నా బిడ్డని నా ఇంటికి తెచ్చుకున్నాను. ఏం? బాధగా వుందా? అవమానమా? ఎందుకు? ఎవరైనా వచ్చి ఈ ఫొటో ఎవరిదీ అని అడిగితే నా భార్య మొదటి భర్తది, ఆయన అకాలమరణంవల్ల నేనామెని పెళ్లి చేసుకున్నాను అని చెప్పడానికి అవమానమెందుకు? ఆ అవమానమో, సన్మానమో నువ్వే చూసుకో. ఇంక ఈరోజుతో నీతో బంధం తెగిపోయింది. నా ఇద్దరు పిల్లలు నాకు చాలు. ఏ రహస్యాన్నీ ఎంతోకాలం దాచగలమనుకోకు. ఎప్పుడో ఒకప్పుడు బయటపడక మానదు'' ఉన్మాదినిలా ఆమె అరుస్తోంది.

''అనుపమా'' గట్టిగా మధు అరిచినా ఆమె వినిపించుకోలేదు.

''నువ్వెళ్ళిపో... నువ్వెళ్లిపో... నాకదే కావాలి. నీలాంటి స్వార్థపరుడికిదే శిక్ష. నా డబ్బునాధారంగా చేసుకుని నువ్వు లక్షలు గడించావు. అవేం నాకు వద్దు. ఈ ఇల్లు నా పేరే ఉంది. మా నాన్న ఇచ్చిన ఆస్తి నా పేరనే వుంది. అది నాకూ నా బిడ్డలకీ చాలు... ఊ! వెళ్లు''

మధు నిలువుగుడ్లు వేసుకుని చూస్తూ వుండిపోయాడు. నిజానికి మధు ధైర్యవంతుడూ, దుర్మార్గుడూ కాదు పైగా పిరికివాడు. అందుకే ధైర్యంగా ఒక్కమాట కూడా అనలేకపోయాడు. అతని కళ్ళు తిరిగాయి. పూర్వంలా సెంటిమెంట్సుని అడ్డం పెట్టుకుని అనుపమని ఆజ్ఞాపించలేకపోతున్నాడు. అప్పుడే యాదగిరి అక్కడికొచ్చాడు.

''అనుపమమ్మా! ఏమిటా ఆవేశం... తప్పు. ఎదుటివాళ్ళు చేసిన తప్పు మనమూ చేసి, వాళ్ళ తప్పు ఎలా దిద్దగలమమ్మా- మధుబాబు రాఘవ్‌కి తండ్రి, అతన్ని నువ్వలా మాట్లాడకూడదు'' నెమ్మదిగా అన్నాడు.

''యాదగిరీ- నువ్వు'' మధు గొంతు పీలగా జీరబోయింది.

''అవునయ్యా నేనే... అనుకోని పరిస్థితుల్లో ఇక్కడికి వచ్చాను''

''యాదగిరీ... నా ఆవేశానికి అర్థం వుంది. ఇన్నాళ్ళు నేను నరకం అనుభవించాను. వద్దు... వద్దు నా జీవితంలో ఇంకా రాజీ వద్దు'' ఆమె విసురుగా లోపలికెళ్ళిపోయింది.

మధు అక్కడే నిలబడివున్నాడు. యాదగిరి వెళ్ళి అతని చేతిలో బ్రీఫ్‌కేసు అందుకుని, భుజంమీద చెయ్యేసి నడిపించాడు అతని గదివైపు.

పిల్లిని కూడా నాలుగువైపులా బంధించి కొట్టాలనుకుంటే అది పులయిపోతుంది. మీద పడి గుడ్లు పీకేస్తుంది.

అణిగి మణిగి వున్నంతకాలం ఆడది అబల. కానీ తనకి జరిగిన అన్యాయాన్ని ఎదిరించాలనుకున్నప్పుడు ఆమె, ఆదిశక్తి. అపరకాళి. ●





# చేతిలో 'కళ' ఉన్నా బతుకులో 'కళ' లేదు!




వారి చేతిలోని కుంచెలు వయ్యారాలొలికిస్తూ రసరమ్య వర్ణజగతికి ఆహ్వానం పలుకుతాయి. ప్లాస్టర్ ఆఫ్ పారిస్‌నుండి 'అద్భుత కళాసృష్టి'ని ఆవిష్కరించేందుకు పూనుకుంటాయి దుమ్ముకొట్టుకున్న వారి చేతులు. అర్ధాకలితోనే పని ప్రారంభించినా చెయ్యితిరిగిన పనితనం సంపూర్ణ కళాత్మకతను సాక్షాత్కరింపచేస్తుంది. అపురూపమైన బొమ్మల్ని మలచడానికే దోహదం చేస్తూంటుంది. ఎందుకంటే ఆ బొమ్మల అమ్మకాలమీద వచ్చే ఆదాయంతోనే రోజులు గడవాలి మరి! అయినా కుటుంబంలోని చిన్నా పెద్దా రోజంతా కష్టపడినా రెండుపూటలా కడుపునిండడమే గగనమవుతోంది వారికి. వారు మరెవరో కాదు. చింపిరితలలు, చినిగిన బట్టలతో కటిక దరిద్రానికి ఆనవాళ్లుగా కాలం గడుపుతున్న 'కళాకారులు' చేతిలో అద్భుతమైన 'కళ' ఉన్నా

బొమ్మకు ఫైనల్ టచ్ ఇస్తున్న కళాకారిణి.

ముఖాన మాత్రం దౌర్భాగ్యం తాండవించే అభాగ్యులు. కనుకనే కడుపు నింపుకోవడం కోసం వారు దేశాలపాలయ్యారు. వారి 'కళ' రోడ్లపాలైపోయింది.

మలక్‌పేట సూపర్‌బజార్ సమీపంలో- రోడ్డువారగా అద్భుతమైన బొమ్మలు బారులుతీరి అమ్మకానికి సిద్ధంగా ఉండడం ఇంచుమించు జంటనగరాల ప్రజలందరికీ తెల్సు. ఆ అపురూప కళాఖండాలన్నీ ఇప్పుడు మనం చెప్పుకున్న 'బీదకళాకారులు' సృష్టించినవే!

సుమారు అయిదారేళ్లక్రితం రాజస్థాన్ నుంచి నగరానికి వలసవచ్చిన ఈ కళాకారులు ఆరేడు బృందాలుగా విడిపోయి మలక్‌పేట, తార్నాక, జూబ్లీబస్‌స్టేషన్ రోడ్, సికింద్రాబాద్ 'మినిస్టర్స్ రోడ్' వంటిచోట్ల స్థావరాలేర్పర







కళాకారుల ప్రతిభకు దర్పణమనదగ్గ రాధాకృష్ణులు.

చుకుని వ్యాపారం చేస్తున్నారు. రోడ్లప్రక్కనే తాత్కాలిక నివాసాలేర్పరచుకొని కాలం గడుపుతున్న ఈ కళాకారుల బతుకులు 'దినదిన గండం నూరేళ్ళాయుష్షు' అన్న చందంగా ఉంటున్నాయి.

గతంలో రాజస్థాన్‌లో వీరు వ్యవసాయం చేసుకుని బతికినవారే! అయితే వర్షాభావం, నిత్యక్షామం మూలకంగా పంటలు పండకపోవడంతో వ్యవసాయం అటకెక్కింది. అప్పుల కింద పొలాలు హరించుకుపోగా, జరుగుబాటు లేక పొట్టలు చేతపుచ్చుకుని వీరు ఆంధ్రప్రదేశ్, తమిళనాడు వంటి రాష్ట్రాలకు వలసపోక తప్పలేదు. ఇంచుమించు వీరి బంధువులంతా ప్రస్తుతం తలో రాష్ట్రంలో బొమ్మలు తయారు చేసుకుంటూనే బతుకుతున్నారు.

ప్రజాపతికుబార్ వంశీయులైన ఈ కళాకారులు బొమ్మల్ని ప్లాస్టర్ ఆఫ్ పారిస్‌తోనే చేస్తారు. బొమ్మల తయారీకవసరమయ్యే రంగులు, ప్లాస్టర్ ఆఫ్ పారిస్ ఇంకా ఇతరత్రా సరంజామా షాహుకార్లనుంచి అప్పుగా తెస్తారు. బొమ్మల అమ్మకం జరిగేస్థాయిని బట్టి నిత్యం కొద్ది పైకాన్ని షాహుకారి బాకీకింద జమకడ్తూ మిగిలిన అతికొద్దిపాటి డబ్బుతో తమ కుటుంబాన్ని పోషించుకుంటారు. వీరు బొమ్మల తయారీకవసరమైన రబ్బర్ మౌల్డుల్ని గుజరాత్‌లోని అహ్మదాబాద్‌నుంచి కొనితెచ్చుకుంటారు. బొమ్మ పరిమాణాన్ని బట్టి, వైశిష్ట్యాన్ని బట్టి ఆయా రబ్బరుమౌల్డులు 500ల నుంచి కొన్నివేల రూపాయలవరకూ ఖరీదు

నగిషీలతో తీర్చిదిద్దిన శ్వేతగజం.







అద్భుత కళాఖండానికి తుదిమెరుగులు...

పలుకుతాయి. తర్వాత మౌల్డుల సాయంతో బొమ్మల్ని అచ్చులు పోస్తారు. అవి గట్టిపడ్డాక వాటికి ఆకర్షణీయమైన రంగులు వేస్తారు.

సాధారణంగా మగవాళ్లు మౌల్డుల్ని ఉపయోగించి అచ్చులు పోస్తుంటే ఆడవాళ్లూ, పిల్లలూ వాటికి రంగులు వేసే కార్యక్రమం చేపడుతుంటారు. ఆ రకంగా రోజుకు నగటున పాతికనుంచి ముప్ఫై బొమ్మలవరకూ ఒక్కో



అలరించే సీతారామలక్ష్మణులు: పాదాల వెంట వానరసమూహం.

కుటుంబం చేయగలదు. అమ్మిన ప్రతి బొమ్మ మీద 3 నుంచి 4 రూపాయలవరకూ లాభం మిగులుతుంది. ఆ లెక్కన చేసిన బొమ్మలలో రోజుకు కనీసం పది బొమ్మలు అమ్ముడైతే ఆ కుటుంబానికి 30 నుంచి 40 రూపాయలవరకూ ఆదాయం లభిస్తుంది. ధరలు ఆకాశాన్నంటుతున్న ఈ గడ్డురోజుల్లో కుటుంబ దిననరి ఆదాయం 40 రూపాయలంటే ఆ



అపురూపమైన కళాఖండాలు.



''బొమ్మలకి రంగులేస్తేనే బువ్వ పెడుతుంది అమ్మ''

కుటుంబీకుల పరిస్థితి ఎలా ఉంటుందో మనం ఊహించుకోవచ్చు. అదీగాక నలబైరూపాయలన్నది నికరాదాయమేమీ కాదు. అమ్మకాలు లేకుంటే అది కూడా అసాధ్యమే. ఆ పరిస్థితుల్లో అంతకంటే తక్కువ మొత్తంలోనే ఇల్లు జరుపుకోవాల్సుంటుంది. అందుకే దరిద్రం వీరి ఆత్మబంధువైపోయింది. అందుకు నిదర్శనమా అన్నట్లు వీరి సంతానం నిత్యదిగంబరులై సంచరిస్తుంటారు. ఎండిన డొక్కలతో అలసిన ముఖాలతో చింకిపాతలు కట్టుకొని పెద్దలు నిత్యజీవన సమరాన్ని సాగిస్తుంటారు.

'మూలిగే నక్కమీద తాటిపండు పడిందన్న' చందంగా వర్షం పడిందంటే వీరిపని గందరగోళమే! ఓ రకంగా చెప్పాలంటే వర్షాకాలం వీరికి ప్రబలశత్రువు. అమ్మకాలు లేకపోవడంతో ఇంచుమించు వర్షాలు పడినన్నిరోజులూ అర్ధాకలితోనూ, పస్తులతోనూ వీళ్లు కాలం గడపాల్సిందే! తలదాచుకుందుకు తమకే సరైన గూడులేని ఈ బడుగుజీవులు తాము చేసిన బొమ్మల్ని ఎక్కడ దాచిపెట్టగలరు? అందుకే వర్షాకాలం వీరి పాలిటి శాపం.

చాలామంది పేదవాళ్లలో ఉండే 'తాగుడు' వంటి బలహీనతలు వీరిలో లేకపోవడం అభినందించదగ్గ విషయమే! ''కట్టుకున్నదానికి, కన్నవాళ్లకీ పట్టెడన్నం పెట్టడమే కనాకష్టంగా ఉంటే ఇంకా తాగడం కూడానా?'' అంటూ నిర్వేదంగా చెబుతారు వీళ్లు. బీడీలు, చాయ్‌లు మినహా వీరిలో చాలామందికి ఇతర అలవాట్లేమీ లేకపోవడం అదృష్టమనే చెప్పాలి.

సొంత రాష్ట్రానికీ, రక్తసంబంధీకులకీ దూర

మై- సుదూరప్రాంతాలలో ఎలాంటి అండ దండలు లేకుండా బతకడం అతిదుర్భరమే! అయినా వీరికది తప్పడంలేదు. కారణం ఉపాధి. పోనీ ఆ ఉపాధి అయినా ఇక్కడ సమృద్ధిగా ఉందా అంటే అదీలేదు. చాలీచా లనీ పట్టెడు మెతుకులు... చావలేక బతికే బతుకులు...! చదువు సంధ్యలకి ఆమడదూ రాన ఉండే వీరికి యూనియన్లు, అసోసియేష న్లంటే తెలియదు. రేటు విషయంలోనూ సమి ష్టిగా తీసుకున్న నిర్ణయాలుగానీ, కట్టడులుగా నీలేవు. ఎవరికి తోచినట్లు వారు అమ్ముకుంటా రు. కడుపు నింపుకుంటారు. వినాయకచవితికి భారీఎత్తున గణపతి విగ్రహాలు తయారుచేసే హైదరాబాద్, ధూల్‌పేట కళాకారులకీ వీరికీ ఎలాంటి సంబంధమూలేదు. వారిలా వీరూ భారీ విగ్రహాల్ని మలచగలరు. ఆక్షేపణేం



*నెలలు నిండినా నరే! కడుపు నిండాలంటే కష్టపడక తప్పదు.*



వీధిలో విక్రయం బేరసారాలమయం.



"నేనైతే ఈ బొమ్మని ఇంకా బాగా చేస్తా"

లేదు. అలాగని ఆ కారణంగా ధూల్‌పేట కళాకారుల్నించి వీరికెలాంటి ప్రతిబంధకాలూ రావు. కానీ వాటికి అవసరమైన వేలాది రూపాయల పెట్టుబడి ఎలా సమకూర్చగలరు? అంత స్థోమత ఎక్కడిది? అందుకే వీరు అలాంటి భారీ ప్రయత్నాలకి పూనుకోక 'ఎంత చెట్టుకి అంతగాలి' అన్నట్లు తమ పరిధిలో తాము జీవిస్తుంటారు.

కేవలం ఉపాధి సౌకర్యాలు లేకనే సొంత ఊళ్లు వదిలి దేశాలమీద తిరుగుతున్న ఈ కళాకారులు ఏడాదికోసారి సాజ్‌డీ ప్రతాప్ గఢ్‌లో జరిగే 'రామ్‌దేవ్‌జీ బాబా' జాతర నిమిత్తం మాత్రం స్వగ్రామాలకు చేరుకుంటారు. సాధారణంగా ఈ జాతర ప్రతి సంవత్సరం 'మే' నెలలో జరుగుతుంది. అదేవిధంగా బతుకులు ఎక్కడ తెల్లవారినా పెళ్ళిళ్లవంటి శుభకార్యాలు సొంత ఊళ్లలోనే బంధుమిత్రుల సమక్షంలో జరుపుకుంటారు. వీరిలో కులాంతర వివాహాలు లేవు.

గాలికి పుట్టి, ధూళికి పెరుగుతున్నట్లని పించే ఈ బడుగుకళాకారుల అభ్యున్నతికోసం ప్రభుత్వాలు ఎలాంటి కృషి జరపడంలేద న్నది నిర్వివాదాంశం. పైపెచ్చు ప్రభుత్వాధికారులు అప్పుడప్పుడూ వచ్చి అక్రమంగా రోడ్లను ఆక్రమించుకున్నారని వీరిని తరిమికొట్టడమూ జరుగుతోంది. అందుకే పుట్టెడు దిగులుతో బతుకులు ఈడుస్తున్న ఈ నిర్భాగ్యుల జీవితాలు వారుచేసే బొమ్మల్లా తళతళ మెరవక వెలవెలపోతున్నాయి. 'కళ' ఉన్నా కళ వళ పడక తప్పడంలేదు. వీరి విషయంలో ప్రభుత్వం కొంచెం చొరవచూపి వీరి ఉత్పత్తులకు తగినంత ప్రచారమిచ్చి ప్రోత్సహించాలి. కనీసం మార్కెటింగ్ విషయంలోనూ, పెట్టుబడుల విషయంలోనూ కొంత చేయూతనివ్వాలి. అప్పుడే వీరి ముఖాలమీద చిరునవ్వూ, వీరి బతుకులో వెలుగూ తాండవిస్తుంది. దేవుళ్లకి సైతం రూపురేఖలు ప్రసాదించే ఈ సృష్టికర్తల జీవితాలు తేజోవంతం అవుతాయి.

-ప్రతాపచంద్ర

ఫోటోలు: కుమారస్వామి








## సేఫ్టీ లాకర్

"అబ్బులును రెడ్‌హ్యాండెడ్‌గా పట్టుకోవటానికి మన డిపార్ట్‌మెంట్ ఎన్ని రోజులనుండి ప్లాన్‌వేసిందో నీకు తెలుసనుకుంటాను" తీవ్ర స్వరంతో ప్రశ్నించాడు కమీషనర్.

"యస్సర్" తల దించుకున్నాడు ఇన్‌స్పెక్టర్.

"ఐనా, అబ్బులు అనుచరులతోపాటు దొరికినా అతని దగ్గరగానీ, అందులో ఎవరి దగ్గరగానీ ఆ వజ్రాలసంచీ కనిపించలేదు అంటే మీరు నిద్రపోతున్నారనుకోవాలా?"

"లేదుసర్! మేమంతా ఎంతో జాగ్రత్తగా వున్నాం. అబ్బులు వజ్రాలసంచీ తీసుకుని బైటకు రాగానే అరెస్ట్ చేయటానికి ప్రయత్నించాం. మమ్మల్ని దాటేసి, చిటికెలో పక్కకు దూకి, అటుగా వెళుతున్న బస్సు ఎక్కాడు. నేను మరుక్షణంలో నా జీప్‌లో ఆ బస్సును అనుసరిస్తూనే, వీధి మలుపులో వున్న పెట్రోల్ కార్‌కు మెసేజ్ యిచ్చాను. వాళ్ళు బస్సును ఆపిన మరుక్షణమే దాన్ని దాదాపు సీజ్ చేశాం. ఈలోగా మిగతావాళ్ళు అబ్బులు అనుచరులను బంధించారు"

"ఐనా, అబ్బులు దగ్గర వున్నదనుకున్న వజ్రాల సంచీ దొరకలేదు" మళ్ళీ అదే మాటన్నాడు కమీషనర్.

"బస్సులోవున్న ప్రతివారినీ క్షుణ్ణంగా శోధించాం. అబ్బులు అనుచరులు ఎవ్వరూ తప్పించుకోలేదు. బస్సులోనుండి బైటకు విసిరేస్తే, మరెవరో తీసుకున్నారనుకోవటానికి కూడా అవకాశం లేద్సార్. అప్పుడు వీధిలో ఒక్క పురుగు కూడాలేదు. అక్కడికీ, అంత తక్కువ సమయంలోనే అబ్బులుగానీ మింగేశాడేమోననే అనుమానంతో ఎక్స్‌రే కూడా తీయించాం కద్సార్. మింగలేదని తెలిసింది"

"ఐతే వజ్రాలసంచీ ఏమైపోయింది" పీక్కుందామన్నా జుట్టులేని నున్నటి బట్టతలను అసహనంగా బరుక్కున్నాడు కమీషనర్.

★ ★ ★

అబ్బులుమీద తీవ్రమైన నిఘా ఏర్పాటు చేసారు కొన్ని రోజులు. కానీ అతను మరెక్కడికో వెళ్ళి దాచిపెట్టటానికీ, మరెవరికో యిచ్చి పంపాడనుకోవటానికీ అవకాశం లేకపోవటంతో ఆ నిఘా ఫలిస్తుందనే నమ్మకం మాత్రం పోలీసులకు ఏ కోశానాలేదు.

అక్కడ అబ్బులు తాపీగానే వున్నాడుగానీ పోలీసులకు తెలియని అబ్బులు బాస్ మాత్రం కల్లుతాగి నిప్పుతొక్కిన కోతిలా గెంతులేసాడు, అబ్బులుమీద.

"యూ ఫూల్. పోలీసులకు లొంగిపోయి ఏదొక రకంగా తప్పించుకునుండాల్సింది. అందులో ఒక్క వజ్రం యిస్తామంటే, ఆ పోలీసులంతా నీకు వంగి దండంపెట్టి, నిన్నొదిలేసి, కావలిస్తే ఉద్యోగాలూ వదిలేసి హాయిగా వుండేవాళ్ళు. ఒక్కోటీ యాభైలక్షలు విలువ చేసే పది వజ్రాలు, అంటే ఐదుకోట్లు. అవి గానీ దొరకలేదో నిన్ను నిలువునా కోసి, ఉప్పు పాతరేయిస్తాను" గయ్యిమన్నాడు బాస్.

"నిలువునా కొయ్యడం తరవాత ఉప్పు పాతరవెయ్యడం, ఇవన్నీ అనవసరం బాస్. మీరు ఊరికే కంగారు పడకండి. అసలే మీకు బీపీ. వజ్రాలెక్కడా పోవు. అక్కడే వుంటాయిగానీ బీపీ ఎక్కువైతే మీరు పోయే ప్రమాదం



వుంది'' అనునయిస్తూ, హామీ యిచ్చాడు అబ్బులు.

''షటప్... పోలీసులు నిఘా ఎత్తేసిన మరు క్షణం వజ్రాలు తేకపోయావో నిన్ను ఏనుగులతో తొక్కిస్తాను''

''మీ దగ్గర ఏనుగులు లేవని నాకు తెలుసు గానీ ఊర్కోండి బాస్'' పబ్లిక్ బూత్‌లోని ఫోన్ పెట్టేసి, బైటికొచ్చాడు అబ్బులు.

★ ★ ★

కొన్ని రోజుల తరవాత పోలీసులు నిఘా ఎత్తేశారు. పర్సనల్ రూమ్‌లో నిద్రిస్తుండగా మాయమయిన కమీషనర్‌గారి చేతిగడియారం పైనలాగే వజ్రాల సంచీమీద కూడా ఆశ వదిలేసుకున్నారు.

తనమీద నిఘా ఎత్తేసిన విషయం రెండు రోజుల్లోనే అర్థంచేసుకున్నాడు అబ్బులు. ఆరోజు బస్‌స్టాప్‌లో నిలుచున్నాడు. పక్కనే మారుతీ జీప్‌లో వెయిట్‌చేస్తున్న అతని అనుచరులకు ఏమీ అర్థంకావటంలేదు. వజ్రాలు తేవటానికి బస్సులోనే ఎందుకు వెళ్ళాలో తెల్చుకోలేక అసహనంగా చూస్తూండిపోయారు. తన అరచేతిలో రాసుకున్న నెంబర్‌తో వస్తున్న ప్రతీ బస్సునూ చూస్తున్నాడు. గంటన్నర తరవాత వచ్చింది AAZ 1310నంబర్ బస్సు. చటుక్కున అందులోకి ఎక్కాడు అబ్బులు. నెక్స్ట్ స్టేజ్‌లో దిగి విజయగర్వంతో తన మారుతీజీప్ ఎక్కాడు.

''ఏమైంది అన్నా''

''ఏమవుతుందిరా, వజ్రాలు తెచ్చాను''

''ఆ బస్సులో వస్తున్న ఎవరికో నువ్వు ఆరోజు యిచ్చావన్నమాట. అతను ఈరోజు ఈ బస్సులో వస్తున్నానని నీకు కబురందించాడన్నమాట? కానీ ఆ ఛాన్స్‌లేదు కదాన్నా''

''కాదురా ఫూల్. ఇన్ని రోజులూ వజ్రాల సంచీ బస్సులోనే వుంది''

''బస్సులో వుంటే ఎవ్వరూ ముట్టుకోలేదా? ఒకవేళ ఎవరైనా తీసివుంటే గొడవయ్యేది కదన్నా''

''ఎవరు మాత్రం ఎలా తీస్తార్రా వెధవా. ఎవ్వరూ ఎన్నడూ ఎంత ఎమర్జన్సీలో కూడా ముట్టుకోరని నాకు బాగా తెలుసు కనకనే అక్కడ పెట్టాను. అందుకే యిన్నాళ్ళూ నిశ్చింతగా వున్నాను''

''బస్సులో ఎక్కడ పెట్టావన్నా? అసలు పెట్టటానికి స్థలమెక్కడుంటుంది?''

''ఫస్ట్ ఎయిడ్ బాక్సులోరా''

-వినయ్




# ఆత్మాభిమానం

"పేరుకి పెద్ద ఆఫీసరు పెళ్ళాన్ని. కానీ నా ముఖానికో స్వంతకారా? పాడా?! ఎక్కడికెళ్లాలన్నా ఆ ఆఫీను డబ్బా జీపునే వాడుకోవాల్సొస్తోంది. ఎదుటి ఫ్లాట్‌లో వుంటున్న పుల్లారావుని చూడు భార్య సొంతంగా వాడుకోవటానికో మారుతీకారు కొన్నాడు. ఛీ... ఛీ... నువ్వూ వున్నావెందుకు? "

ఏకబిగిన మాట్లాడడంతో ఊపిరి తిరగక ఆయాసపడిపోతూ తన భారీకాయాన్ని సోఫాలో కూలేసింది ఆండాళ్లమ్మ.

ఆఫీసులో పులిలా గాండ్రించే అప్పారావు భార్యముందు పిల్లిలా తలొంచుకొని నిలబడ్డాడు భార్య ఎదుట నోరెత్తలేని తన అసహాయతకు తననితనే నిందించుకుంటూ.

★ ★ ★

"ఏమిటోయ్ ఇది? ఫైలా నా పిండాకూడా?" చేతిలోని ఫైలుని విసిరి కొట్టినంత పనిచేస్తూ అరవసాగాడు ఆఫీసర్ అప్పారావు.

"వచారీకొట్లో వద్దులు రాసుకోవాల్సిన వాళ్లని క్లర్క్సుగా అప్పాయింట్‌చేస్తే ఇలాగే ఏడుస్తాయి ఫైళ్ళు. కొట్టివేతలూ దిద్దివేతలూ లేకుండా ఫైలు పుటప్ చెయ్యలేని వాళ్లకి



గవర్నమెంటు ఉద్యోగాలెందుకోయ్! ఇంటి దగ్గర కూర్చోని చాకలిపద్దులు రాసుకోక''

ఆఫీసరుగారి నోటివెంట జడివానలా కురుస్తున్న పరుషపదజాలం ఫలితంగా, నరనరాల్లోంచి తన్నుకొస్తున్న ఆగ్రహాన్ని అతిప్రయత్నం మీద అదుపుచేసుకుంటూ "ఛీ...ఛీ.... వెధవ బ్రతుకూ, వెధవ వుద్యోగం...'' అని మనస్సులోనే గొణుక్కుంటూ నిప్పుల కుంపటి మీద నిలబడ్డట్టు సలసలా కాగిపోసాగాడు ఆంజనేయులు.

★ ★ ★

"ఏమిటీ? ఏమిటిది? కాఫీయా కుడితినీళ్ళా? పొద్దున్నుంచీ సాయంత్రందాకా ఆఫీసులో చాకిరీచేస్తూ, అడ్డమైనవాడి నోటల్లా పడరాని మాటలు పడుతూ సంపాయించి తెస్తుంటే, ఇంటి దగ్గర తీరిగ్గా తిని కూర్చోని, అలసిపోయి వచ్చిన మొగుడికి కాసిన్ని మంచి కాఫీ చుక్కలు కూడా పోయలేని పెళ్ళాం ముం...లని ఏం చేస్తే పాపముందే?''

ఏదో సంజాయిషీ చెప్పబోయిన భార్య కాళ్ల దగ్గర పడేలా కాఫీనీ విసిరికొట్టి విసవిసా నడచుకుంటూ బయటకెళ్ళిపోయాడు ఆంజనేయులు.

"ఛీ... ఛీ... ఏం మొగుడో ఏం కాపురమో! ఇంటి దగ్గర తేరగా తిని కూర్చుంటున్నానట. ఇంటి చాకిరీ అంతా ఎవరు చేస్తున్నారో ఈయన బాబుగాడు. ఈ మగాళ్ళు ఆఫీసులో పేద్ద పనిచేసి అలసిపోయినట్టు ఫీలైపోతారు గానీ ఇంట్లో పెళ్ళాం వంటపనితోనూ పిల్లలతోనూ ఎలా వేగిపోతుందో కాస్తయినా పట్టించుకోరు''

ముఖాన్ని పమిటచెంగుతో తుడుచుకుంటూ గొణుక్కుంటున్న పావని దగ్గరకొచ్చింది పనిమనిషి.

"పనైపోయిందమ్మగోరూ... ఎల్లొత్తాను'' అని ఒకడుగు ముందుకేసి అంతలోనే ఏదో మరచిపోయినట్టు వెనక్కి తిరిగి "ఓ పదిరూపాయలుంటే అడ్డమాన్సియ్యండమ్మా, మా ఇంటోడికి బాగోనేదు. ఆసుపత్రికి తీసుకెల్లాల''అంది పనిమనిషి పాపాయమ్మ.

భర్తచేత చీవాట్లు తిన్న పావని అసలే భగ్గున మండిపోతోందేమో, పనిమనిషి మీద విరుచుకుపడింది.

"ఏమిటీ, నీకు పదిరూపాయలు అడ్వాన్సు కావాలా? మొన్ననేకదా, జీతమంతా పైసల్తో సహా వసూలు చేశావు. ఇక్కడ డబ్బేమయినా చెట్లకు కాస్తుందనుకుంటున్నావా ఏమిటి?''

ఈ హఠాత్ దాడికి బిత్తరపోయింది పనిమనిషి. అదేమీ గమనించకుండా దులుపుకుపోతోంది పావని. "నువ్వు చేసే ఇంతోటి పనికీ అడ్వాన్సు కూడా కావాలా? ఇల్లూడిస్తే ఎక్కడి దుమ్ము అక్కడే ఉంటుంది. అంట్లు తోమితే ఒక్క ఎంగిలి మెతుకుని కూడా బయటికి పోనీవు. తమరు చేసే ఇంతోటి అందమైన పనులకీ ఇప్పుడు అడ్వాన్సొకటి తక్కువొచ్చిందా!''

ఆమె మాటలకి తిక్కరేగిపోయింది పనిమనిషికి. ఆమె కంటే మరింత పెద్ద గొంతుపెట్టి "చాల్చా ల్లేవమ్మా, నువ్విత్తన్న బోడి జీతానికి నాను సేత్తన్న పనెక్కువే. నానేదో ధర్మానికడగతన్నట్టు అలాగెగిరిపోతావేటి?'' అని ఎదురు తిరిగింది.

తన సబార్డినేట్ తిరుగుబాటుని సహించలేని పావని ఆవేశంగా "బయటికి ఫో ఈవాళ్టి నుంచి ఈ ఇంట్లో పని లేదు నీకు'' అనేసింది.

"నీ బోడి పన్లోంచి నువ్వు తీసేసేదేటి నానే మానెత్తన్నాను'' అంటూ వెళ్ళిపోయింది పాపాయమ్మ.

అప్పుడు దిగ్భ్రాంతి చెందటం పావని వంతయింది. 'పని మానెయ్యమం'టే తన కాళ్ళా వేళ్లాబడి బ్రతిమాలుతుందనుకుందే గానీ అసలుకే ఎసరు పెడుతుందనుకోలేదు. అసలే పనిమనుషులు దొరకటం కష్టంగా వున్న ఈ రోజుల్లో ఇంకో పనిమనిషిని ఎదుర్కోవాలిరా దేవుడా? అని నిట్టూరుస్తూ నేల మీద కూలబడిపోయింది పావని.

-భూస అప్పలరెడ్డి

Edited, Printed and Published by Ramoji Rao for Vasundhara Publications, Printed at Colorama Printers Pvt. Ltd. Hyderabad. Tel. 229428. Office address: CHATURA Telugu Monthly Eenadu Compound, Somajiguda, Hyderabad Tel. Hyderabad: 223422, 229444, Madras 470434, Vijayawada 476685, Visakhapatnam 52211, Tirupati 5291, Anantapur 22977.

